1993-2013 నడుస్తున్న చరిత్ర

సంపుటి : 2
సంచిక : 1
రు. 20/-లు
తెనాలి



తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

మార్చి 2016





## తెలంగాణ
## తెలుగు గిరిజన వారసత్వ వేడుక
## మేడారం సమ్మక్క-సారలమ్మ జాతర



భాషల సామర్థ్య నిరూపణకు సాంకేతిక కొలమానాలు :
కీ.శే. బి.యస్. రామకృష్ణ

# తెలుగును పదే పదే అవమానిస్తున్న ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం






ప్రపంచంలోని భాషాజాతుల వారంతా తమ అమ్మనుడులను కాపాడుకోవాలని 16 ఏళ్ళుగా ప్రపంచ వేదిక 'యునెస్కో' పిలుపు ఇస్తూనే ఉంది. తెలుగునేల పైన కూడా ఉద్యమం సాగుతూనే ఉంది. మన ప్రభుత్వాలు ఈ పండుగని లాంఛనంగా జరుపుతూనే ఉన్నాయి. కానీ తెలుగును పట్టించుకోకపోగా తెలుగును అణగద్రొక్కుతున్నాయి. తెలుగు ప్రభుత్వాలే తెలుగుకు ద్రోహం చేస్తున్నాయి. తాజాగా ఈ చిత్రాల్ని చూడండి. నాలుగు రోజుల్లో అమ్మనుడుల పండుగ జరుగనుండగానే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రజల భాషను ఎంతగా అవమానించిందో చూడండి. తాత్కాలిక సచివాలయ నిర్మాణాన్ని ఘనంగా మొదలుపెట్టినసందర్భంగా నెలకొల్పిన శిలాఫలకం పైన ఏ భాష ఉన్నదో గమనించండి. అంతా ఆంగ్లమే. తెలుగు అక్షరం లేనే లేదు. ఇదేవిధంగా రాజధాని నిర్మాణానికై శంకుస్థాపన జరిపినప్పుడు కూడా ఈ ప్రభుత్వం తెలుగును అవమానించిన దృశ్యాలను ఈ పత్రిక ఇంతకుముందు ప్రచురించింది. ఎందరు విమర్శించినా పట్టించుకోని ముఖ్యమంత్రులు, నేతలు, అధికారులు పరిపాలిస్తున్న రాష్ట్రం మనది. వాళ్ళ ధోరణి వారిదే....

మన ముఖ్యమంత్రిగారు నేలకు తలవంచి నమస్కరిస్తున్న చిత్రాన్ని చూడండి..ఇంతకుముందేమో Mana Rajadhani-Mana Amaravathi అని ఇంగ్లీషులో వ్రాసిన పలకలు, లాప్‌టాప్‌లు పట్టుకొని ముఖ్యమంత్రిగారు, వారి కుటుంబ సభ్యులు ఫొటోలు తీయించుకొని మరీ ప్రదర్శించుకొన్న సంగతి మన పాఠకులకు తెలుసు. మరి– మన రాజధాని కావాలి, మన నేల కావాలి, కానీ మన అమ్మనుడి తెలుగు మాత్రం వద్దు. తెలుగు లేకుండా మనం తెలుగువాళ్ళం ఎలా అవుతాం? మన నేల తెలుగునేల ఎలా అవుతుంది? మన రాష్ట్రం ఆంధ్రప్రదేశ్ ఎట్లా అవుతుంది? ఇంతకూ ప్రజలకు మీరిచ్చే సందేశం ఏమిటి ముఖ్యమంత్రిగారూ!

సరే...అధికార, ప్రతిపక్ష నాయకులు నోరెందుకు విప్పడం లేదు? మీరంతా ఆత్మగౌరవాన్ని వదులుకొన్నారా?



"1757లో ప్లాసీ యుద్ధం వల్ల దేశానికెంత అరిష్టం వచ్చిందో 1857లో చిన్నయసూరి ఆచార్యుడు కావడం వల్ల తెలుగుభాషకంత నష్టం వచ్చింది"

"విద్యాప్రణాళికలో విద్యార్థులకు మార్గదర్శకంగా వ్యావహారిక భాషకు అవకాశం కల్పించమని పండితుల్ని, ఆచార్య వర్గాన్ని నేను కోరుతున్నాను. ఇరవై సంవత్సరాల అనంతరం నేటి దుస్థితికంటె అన్నివిధాలా బాగుపడుతుం దని నేను పండితులకూ, ఆచార్య వర్గానికీ హామీ ఇస్తున్నాను.

**(19-04-1965**
**శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో జరిగిన భాషా సదస్సులో)**


రచనలకు, ఉత్తరాలకు
**డాక్టర్ సామల రమేష్‌బాబు,**
సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం,
విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : 0866-2439466
సంపాదకుడు : 9848016136




తెలంగాణ తెలుగునేలమీద గిరిజన, దళితుల సంప్రదాయ వేడుక- సమ్మక్క, సారలమ్మ జాతర వరంగల్లు జిల్లా మేడారంలో ఘనంగా జరిగింది. తెలంగాణ సాంస్కృతిక ప్రత్యేకతగా ఈ జాతరను ప్రభుత్వం ప్రకటించింది.
వివరాలు లోపలి పుటల్లో...




## లోపలి పుటలలో....



**కవితలు**




ముఖచిత్రం ఫొటోలు : **నాగరాజు దేవర,** ఖమ్మం
రెండవ అట్టమీద ఫొటోలు : **తమ్మా శ్రీనివాసరెడ్డి**

కైసేత-ముఖచిత్రం : **కలిమిశ్రీ**
రేఖాచిత్రాలు : **బాలి** పకపకలు : **సరసి, శేఖర్**

తెలుగుజాతి పత్రిక
# అమ్మనుడి
మాసపత్రిక
• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు

శాలివాహన శకం 1937 : మన్మథనామ సంవత్సర మాఘ మాసము
***(ఏరిమాపి)** బహుళ సప్తమి మంగళవారము నుండి ఫాల్గుణ
***(వేగాపి)** బహుళ సప్తమి గురువారము వరకు
* **ఏరిమాపి** * **వేగాపి** : తెలుగు నెలలు

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 5 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 700 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు NEFT / RTGS ద్వారా **'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.
**AMMA NUDI - AXIS BANK, TENALI**
అక్కౌంట్ నెం. **915020010550189**
**IFSC Code : UTIB0000556**
ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆ వెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా
**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com
**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలను మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి.
4. మీ చిరునామా మారినట్లయితే దయచేసి వెంటనే తెలియజేయండి.

**STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS OF 'AMMANUDI' MONTHLY MAZAZINE, VIJAYAWADA**

as required under rule 3 of the Registration of News papers (Central) Rules 1956

**FORM IV** (See rule 3)

| | | |
|---|---|---|
| 1. Place of Publication | : | Angalakuduru |
| 2. Periodicity | : | Monthly |
| 3. Printer's Name | : | Samala Lakshmana Babu |
| 4. Whether Citizen of India | : | Yes |
| 5. Address | : | D.No.8-386, Angalakuduru Post, Tenali Mandal-522 211, Guntur Dist., A.P |
| 6. Publisher's Name<br>Address | : | Samala Lakshmana Babu<br>As above |
| 7. Editor's Name<br>Address | : | Samala Ramesh Babu<br>As above |
| 8. Names & Addresses of individuals who own the News paper | : | Samala Lakshmana Babu<br>As above |

I, Samala Lakshmana Babu, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

Tenali
28- 2 - 2016

Sd/-
S.LAKSHMANA BABU
Publisher

## 'నడుస్తున్నచరిత్ర' చందాదారులకు...

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్న చరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్న చరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారిచందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటి వరకూ సరిపోతుందో-పత్రికను పెట్టి పంపే కవరుపై చిరు నామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

## నడుస్తున్న చరిత్ర శాశ్వత చందాదారులకు

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000/-లు చెల్లించి, శాశ్వత చందా దారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వత చందా రు. 5000/-లకు గాను రు. 4000/- లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. 'అమ్మనుడి'కి శాశ్వత చందాదారులుగా కొనసాగలేని వారు సాధారణ చందాదారుగా చేరి పత్రికను తెప్పించుకోవచ్చును. దయచేసి సహకరించగోరుతున్నాము.

**శ్రీ మల్లవరపు అనిల్ చౌదరి,** చికాగో, అమెరికా సెల్ : 0018478673048



గోల్డ్‌మాన్ సాక్స్ (sax) కంపెనీలో సీనియర్ మేనేజర్‌గా ఉన్నారు. భార్య శ్రీలత, కుమార్తెలు ఆర్తి, సాన్వి- కుమారుడు అనిష్. నిజామాబాద్ జిల్లా బోధన్‌లో తెలుగు భాషోద్యమ సమాఖ్య కార్యకర్తలు. శ్రీ మల్లవరపు శౌరయ్య చౌదరి- శ్రీమతి అన్నామేరీల కుమారుడు శ్రీ అనిల్ తెలుగుజాతి ట్రస్టుకు పోషకులుగా రు.25,000/లు అందజేశారు. వీరు 'అమ్మనుడి' పత్రిక చదువరులు.



**శ్రీ పొనకల వెంకట శేషారావు,** హైదరాబాదు, సెల్ : 9490683101

ప్రకాశం జిల్లా నాగులుప్పలపాడుకు చెందిన శేషారావు గారు ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ఎం.ఎస్‌సి. (అప్లైడ్ జియాలజీ) చదివి భారత భూగర్భసర్వేక్షణ (జి.ఎస్.ఐ)లో జియాలజిస్టుగా ఒడిశా, కర్నాటక, ఆంధ్రప్రదేశ్‌లలో పనిచేసి సంచాలకులుగా పదవీ విరమణ చేశారు. 'అమ్మనుడి' పత్రికలో 'తెలుగుజాతి' ట్రస్టు ఆదర్శాలు, పని తీరు నచ్చి, ప్రోత్సాహకులుగా రు.10,000/లు అందజేశారు.

**శ్రీ అడుసుమిల్లి శివరామకృష్ణప్రసాద్,** డెట్రాయిట్ (యు.ఎస్.ఏ) సెల్ : 91-81859 25391



"తెలుగుగడ్డ నడిబొడ్డున పుట్టి పెరిగి సాగిస్తున్న జీవనయానంలో ప్రస్తుత మజిలీ డిట్రాయిట్ నగరం. మీ అందరిలాగానే తెలుగు అంటే ప్రేమ. మా ఊళ్ళో డెట్రాయిట్ తెలుగు లిటరరీ క్లబ్ ద్వారా తెలుగు పరిమళాలను ఆస్వాదిస్తున్నాను. ఆ సందర్భంలోనే స.వెం.రమేశ్ వంటి భాషా యోధులతోనూ, అచ్చతెలుగులోని అందాలతోనూ పరిచయభాగ్యం కలగడం, ఆ యాగానికి నేను సైతం...అన్న తృప్తి పొందాలన్న స్వార్థంతోనే ఈ చిరుకానుక..." అంటున్నారు శ్రీ శివ అడుసుమిల్లి. ఆయన తెలుగుజాతి ట్రస్టుకుప్రోత్సాహకుడుగా రు.10,000/లు అందజేశారు.

# తెలుగుజాతి (ట్రస్టు) విన్నపం

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరిగింది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది.దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచు రించవలసిన అవసరం ఏర్పడింది. పరిశోధన, శిక్షణ కార్యక్రమాల్ని కూడా చేపట్ట వలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును నమోదు చేయించాము. (92/2014). తెలుగు 'అమ్మనుడి"గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది.

2015 మార్చి నుంచి అమ్మనుడి పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో భాగంగా తొలుత స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. త్వరలో మరికొన్ని ప్రత్యేకమైన పుస్తకాలను వెలువరించ బోతున్నాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.




| | | |
|---|---|---|
| **ట్రస్టుకు విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.** | రాజ పోషకులురు. 1,00,000/-లు<br>విశిష్ట పోషకులు రు. 50,000/-లు | పోషకులు రు. 25,000/-లు<br>ప్రోత్సాహకులు రు. 10,000/-లు |

దాత ఫోటోను, క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి. యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.

అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136 ట్రస్టీలు : **పారుపల్లి కోదండరామయ్య** 9505298565, **డా॥వెన్నిసెట్టి సింగారావు** 9393015584, **స.వెం.రమేశ్** 8500548142, **సామల లక్ష్మణబాబు** 9440448244

# అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవ సందేశం- 2016




**ప్రతి సంవత్సరమూ అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం (ఫిబ్రవరి, 21) సందర్భంగా యునెస్కో (ఐక్యరాజ్యసమితి వారి విద్య, శాస్త్ర, సాంస్కృతిక సంస్థ- UNESCO) డైరెక్టర్ జనరల్ సందేశం ఇస్తారు. ఈ ఏడు యునెస్కో డైరెక్టర్ జనరల్ శ్రీమతి ఇరినా బోకోవా- ప్రపంచంలోని అన్నిదేశాలను, భాషాజాతులను ఉద్దేశించి విడుదల చేసిన సందేశం ఇది :**

ఈ 2016 అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం సందర్భంగా యునెస్కో ప్రకటించిన అంశం :

**'ప్రామాణిక విద్య-బోధనా భాష(లు)- అభ్యసన ఫలితాలు'**

ఈ 2030 నాటికి సుస్థిరాభివృద్ధిని సాధించాలన్న '2030 అజెండా' లక్ష్యాన్ని సాధించడానికై ఎంతో అవసరమైన 'ప్రామాణిక విద్య'ను అందరికీ అందిస్తూ భాషా వైవిధ్యాన్ని కాపాడవలసిఉంది. ఇందుకు మన మాతృభాషలు ఎంత ముఖ్యమో ఈ అంశం చాటి చెపుతున్నది.

ప్రామాణిక విద్యను జీవనపర్యంతం చదువును నేర్చుకునే అవకాశాలను అందరికీ అందించాలనేదే '2030 అజెండా'లోని నాలుగవ లక్ష్యం, తద్వారా... స్త్రీ పురుషులు అందరూ వారివారి లక్ష్యాల సాధనకు కావలసిన నైపుణ్యాలను, జ్ఞానాన్ని, విలువలను పొంది, వారి సమాజాలలో పూర్తి భాగస్వాములు కాగలుగుతారు. ప్రత్యేకించి బాలికలు, మహిళలు, మైనారిటీలు, బడుగువర్గాలు, గ్రామీణుల విషయంలో ఇది మరీ ముఖ్యం. '2030 అజెండా' మార్గ దర్శనిలో పేర్కొన్న "ఎడ్యుకేషన్ 2030- ఫ్రేమ్‌వర్క్ ఫర్ యాక్షన్" (విద్య 2030- కార్యాచరణ ప్రణాళిక) బోధన అభ్యసన ప్రక్రియల్లో మాతృభాషను సంపూర్ణంగా వినియోగించడాన్ని, భాషా వైవిద్య పరిరక్షణను ప్రోత్సహిస్తున్నది.

2030-అజెండాలో పేర్కొన్న అభివృద్ధి, ఉపాధి, అరోగ్యం, సుస్థిర ఉత్పత్తి - వినియోగాలు, వాతావరణ పరిరక్షణకు సంబంధించిన లక్ష్యాలను సాధించాలి అంటే, మనకు ఇప్పుడు బహుభాషా విధానం చాలా అవసరం.

ఇంటర్నెట్‌లోను, ప్రసార మాధ్యమాలలోను, సమాచార ప్రసరణల్లోను భాషావైవిద్యం అంశాన్ని యునెస్కో ముందుకు తెస్తున్నది. లింక్స్ (లోకల్ అండ్ ఇండిజీనియస్ నాలెడ్జ్ సిస్టమ్స్) కార్యక్రమం ద్వారా, దేశీయ సంస్కృతులను, ఎంతో విస్తృతమైన వారసత్వ జ్ఞాన సంపదను పరిరక్షించుకుంటూ, అందరికీ అందించుకోవడంలో మాతృభాష అవసరాన్ని, స్థానిక భాషల అవసరాన్ని యునెస్కో ప్రపంచానికి ఎత్తిచూపుతున్నది.

బహుభాషా విధానంలో అందరికీ ప్రామాణిక విద్యనందించడంలో మాతృభాషలు కీలకం. స్త్రీపురుషులందరినీ, వారి సమాజాలనూ సాధికారులను చేయడానికి ఇదే పునాది.

మన సమాజంలో ఏ ఒక్కరూ వెనుకబడిపోకుండా, అందరూ సమన్యాయాన్ని పొందుతూ సుస్థిర భవిష్యత్తును అందుకోవాలంటే నేర్పడంలోనూ, నేర్చుకోవడంలోనూ మాతృభాష ప్రాధాన్యతను మనం అందరం గుర్తించి, ప్రోత్సహించవలసి ఉంది.

ఇదీ... అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం సందర్భంగా యునెస్కో సందేశం.

## ద్రావిడ భాషలపై జూన్‌లో అంతర్జాతీయ సదస్సు

హైదరాబాదు విశ్వవిద్యాలయంలోని అనువర్తిత భాషాశాస్త్రం మరియు అనువాద అధ్యయన కేంద్రం 2016 జూన్ నెలలో ద్రవిడియన్ లింగ్విస్టిక్స్ అనే అంశంపై అంతర్జాతీయ సదస్సును నిర్వహిస్తోంది. ఈ సదస్సులో దేశ విదేశాల నుంచి ప్రతినిధులు హాజరవుతారు. ద్రావిడ భాషలకు సంబంధించి వర్ణనాత్మక, చారిత్రక, తులనాత్మక భాషాశాస్త్ర శాఖలలో పరిశోధనాత్మక పత్రాలను సమర్పిస్తారని హైదరాబాదు విశ్వవిద్యాలయంలోని అనువర్తిత భాషాశాస్త్రం మరియు అనువాద అధ్యయన కేంద్ర విభాగాధిపతి ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు తెలియజేస్తున్నారు.

సంపుటి : 2 సంచిక : 1
అమ్మనుడి
మార్చి 2016

సంపాదకీయం

# రాజ్యాంగ సవరణలతోనే మాతృభాషల రక్షణ

**భా**రత రాజ్యాంగాన్ని ప్రకటించి 60 ఏళ్లయిన సందర్భాన్ని మన పార్లమెంటు ఇటీవల గుర్తు చేసుకొంది. ఆ సందర్భంగా ప్రభుత్వ బాధ్యులు, పార్లమెంటు సభ్యులు కొందరు ఉద్విగ్న ప్రసంగాలు చేశారు. అయితే ఎవ్వరూ ఈ రాజ్యాంగంతో మనకున్న 60 ఏళ్ల అనుభవాలను చర్చించి రాజ్యాంగాన్ని తగిన విధంగా సంస్కరించాలని, మరింత శక్తిమంతం చేయాలని ప్రతిపాదించినట్లు లేదు.

ఇరవై ఏళ్ల క్రిందట శేషన్ కేంద్ర ఎన్నికల అధికారిగా ఉన్నప్పుడు రాజ్యాంగాన్ని పునఃపరిశీలించాలనడం చర్చలకు, వాదోపవాదాలకు దారి తీసింది. అయితే ఏ నిర్ణయం లేకుండానే అవన్నీ సమసిపోయాయి. ఇప్పుడైనా ఈ అంశాన్ని మళ్లీ చర్చకుపెట్టి, నిర్ణీత కాలపరిమితిలో నివేదిక ఇచ్చేటట్లుగా ఒక రాజ్యాంగ సంస్కరణల సంఘాన్ని నియమించవలసిన అవసరం ఉంది. రాజకీయ పార్టీలు, మేధావులు, సామాజిక ఉద్యమకారులు ఈ సందర్భాన్ని వినియోగించుకొని, తమ సూచనలను, డిమాండ్లను ఆ సంఘం ముందు పెట్టి– తగిన ప్రజాస్వామ్య ప్రక్రియల ద్వారా రాజ్యాంగానికి తగు సవరణలు చెయ్యవలసిన అవసరం ఉంది.

రాజ్యాంగంలో పునఃపరిశీలన చెయ్యవలసిన అనేక మౌలిక అంశాలలో భాషకు, విద్యకు సంబంధించినవి ఉన్నాయి. స్పష్టత కోసం తిరిగి నిర్వచించవలసిన 'సెక్యులరిజం' వంటి అంశాలు ఉన్నా, మేమిక్కడ భాషకు సంబంధించిన కొన్ని కీలక అంశాలను మాత్రం ప్రస్తావించదలచుకొన్నాము.

భాషారాష్ట్రాలను రాజ్యాంగబద్ధంగా ఏర్పరచి, జాతీయ భాషావిధానాన్ని ప్రకటించినా, ఆయా రాష్ట్రాలలో ఇతర భాషల అణచివేత, నిరాదరణ నిరాటంకంగా కొనసాగుతూనే ఉంది. కేంద్ర అధికారభాషగా హిందీని ప్రకటించి, అనేక జన భాషలను నిరాదరణకు గురిచేశారు. రాజ్యాంగం గుర్తించిన అన్ని భాషలను జాతీయ భాషలుగా గుర్తించాలన్న డిమాండును ఎప్పటికప్పుడు పక్కన పెడుతూనే ఉన్నారు. బహుభాషా సమాజాలు తమ భాషా వారసత్వ సంపదను కోల్పోకుండా రక్షించడానికి మన రాజ్యాంగం ఎక్కడా హామీనివ్వడం లేదు.

మాతృభాషల రక్షణకు కీలకం విద్యలోనూ పాలనలోనూ ఆ భాషల్ని వాడుకోవడం. వాటి వాడకం తగ్గేకొద్దీ అవి కనుమరుగు అవుతుంటాయి. చదువులు ప్రాథమిక విద్యతోనే మొదలవుతాయి. పిల్లలకు వారు సహజంగా నేర్చుకొన్న అమ్మనుడిలోనే చదువును కొనసాగించడం శాస్త్రీయం, హేతుబద్ధం. అక్షరాన్ని నేర్చుకోవడం, జ్ఞానాన్ని సముపార్జించడం అమ్మనుడితో జరిగినపుడే వారికి ఆ చదువుల సారం బుర్రకెక్కుతుంది. తనకు తెలియని పరభాషను ఒక పక్క నేర్చుకొంటూ దానిపై ఏమాత్రం పట్టులేకుండానే దాని ద్వారా విజ్ఞానాన్ని పొందాలనే పద్ధతి హేతుబద్ధం కాదు. మనదేశంలో ముఖ్యంగా మన తెలుగు రాష్ట్రాలలో ఇంగ్లీషు మాధ్యమంతోనే అక్షరాన్ని నేర్పడం, అమ్మనుడిని పూర్తిగా పక్కనపెట్టి ఇంగ్లీషుతోనే జ్ఞానం అనే మోజులోపడి కొట్టుకుపోతున్న దశలో– ఇప్పుడు బడి పిల్లలకు బోధనా మాధ్యమం గురించి తీవ్రంగా చర్చ మొదలైంది. తెలుగు భాషోద్యమకారులు 20 ఏళ్లుగా ఎంత మొత్తుకుంటున్నా పట్టించుకోని ప్రభుత్వానికి కళ్లు తెరిపించే విధంగా ఇటీవల కొన్ని సర్వేలు వెలువడ్డాయి. ఇంతకాలంగా ఆంగ్ల మాధ్యమంతో బాల్యాన్ని కుళ్లబొడుస్తున్న విద్యా విధానం ఎంత లోపభూయిష్టమైనదో సర్వేలు తేటతెల్లం చేశాయి.

సాక్షాత్తూ ఇంగ్లీషు భాషకు ప్రాణాధారమైన ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ మన రెండు తెలుగు రాష్ట్రాల్లో చేసిన సర్వేలు మన విద్యావిధానంలోని డొల్లతనాన్ని బయటపెట్టాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యాశాఖ అధికారులు రెండు నెలల క్రితం జరిపించిన సర్వేలోనూ ఇటువంటి ఫలితాలే వచ్చాయి. ఇదే సమయంలో 'యునెస్కో' – అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా – మాతృభాషలోనే ప్రాథమిక విద్యను నేర్పించాలని, మాతృభాషలతోనే భాషాజాతుల పరిపూర్ణ వికాసం సాధ్యమవుతుందని స్పష్టం చేసింది.

ఇటు ఉద్యమకారుల డిమాండూ, అటు జాతీయ అంతర్జాతీయ సర్వేలు స్పష్టంగా తేల్చి చెప్పిన అంశం కనీసం ప్రాథమిక విద్యను పిల్లలకు వారి మాతృభాషలోనే అందించాలి అని. ఇక మన ప్రభుత్వాలు – ముఖ్యంగా మన రెండు

## సంపాదకీయం

తెలుగు రాష్ట్ర ప్రభుత్వాలు ఏమి చర్యలు చేపట్టబోతున్నాయో తేలవలసి ఉంది.

ఈ సందర్భంగా తెలంగాణ ప్రభుత్వం ఒక అడుగు ముందుకు వేసింది. జాతీయస్థాయిలో ఈ అంశంపై స్పష్టత కావాలని, విధాన ప్రకటన కావాలని అప్పుడే ప్రయివేటు, ప్రభుత్వ పాఠశాలలన్నిటిలో మాతృభాషలోనే ప్రాథమిక విద్యను తప్పనిసరి చేయగలుగుతామని తెలంగాణ ప్రభుత్వం కేంద్రానికి వ్రాసింది. భాషోద్యమకారులు ఈ చర్యను స్వాగతిస్తున్నారు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కూడా వెంటనే తెలంగాణ ప్రభుత్వంతో ఈ అంశంలో శృతి కలపాల్సిన బాధ్యతను గుర్తించాలి.

మన రెండు రాష్ట్రాల్లో పిల్లల చదువులు మెరుగుపడడంతోపాటు తెలుగుపిల్లలు తమ ఘనమైన భాషా సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకొంటూ ఎదగడానికి ఈ కనీస చర్య అత్యవసరం. తెలంగాణ ప్రభుత్వమూ ఎంతో కాలంగా భాషోద్యమకారులూ సూచిస్తున్నట్లు ప్రాథమిక విద్యలో తెలుగు మాధ్యమాన్ని అన్ని పాఠశాలల్లో తప్పనిసరి చేస్తూ చట్టాన్ని తేవాలి.

అయితే కేవలం మన రెండు రాష్ట్రాలూ తమంతట తాముగా ఈ పని చేసినంతమాత్రాన పూర్తి ఫలితం కలుగదు. కేంద్రప్రభుత్వం కూడా కలిసివచ్చి తగిన రాజ్యాంగ సవరణలను తెచ్చి దేశమంతటా మాతృభాషలో బోధన, పరిపాలన విషయంలో ఒకే విధానం ఉండేట్లు చూడాలి. కేంద్ర పాఠ్యప్రణాళికల్లో కేంద్ర విద్యాసంస్థల్లో కూడా ఈ విధానం అమలు కాకుండా రాష్ట్రాలలో ప్రైవేటు సంస్థల 'వ్యాపార విద్య'ను కట్టుదిట్టం చేయలేము. కనీసం పాఠశాల స్థాయిలో ఇంటర్మీడియట్ వరకూ స్పష్టమైన భాషా విధానాన్ని, విద్యా విధానాన్ని చేపట్టకుండా అందరికీ సమాన అవకాశాలు ఉండేట్లు చూడడం అసాధ్యం.

మన రాజ్యాంగంలో ఒక బలహీనమైన అధికరణం ఉంది. అది 350(ఎ). దాని ప్రకారం ఏ రాష్ట్రంలో అయినా ఆ రాష్ట్ర అధికార భాష కాకుండా ఇతర భాషలకు చెందిన (లింగ్విస్టిక్ మైనారిటీస్) పిల్లలకు వారి మాతృభాషలోనే ప్రాథమిక విద్యను అందించాలి. అయితే ఇది ఏ రాష్ట్రంలోనూ అమలుకావడం లేదు. తమిళనాడు వంటి కొన్ని రాష్ట్రాలలో ఈ అధికరణాన్ని పూర్తిగా విస్మరించారు. అక్కడ 42 శాతంకు పైగా ఉన్న తెలుగు మాతృభాషీయులు తమ భాషావారసత్వాన్ని పోగొట్టుకొంటున్నారు.

ఈ పరిస్థితుల దృష్ట్యా తగు రాజ్యాంగ సవరణలు చేయకుండా భారతదేశంలోని మాతృభాషల్లో సంక్షోభం తప్పని పరిస్థితి వచ్చేసింది. భాషకు సంబంధించిన అంశాలన్నీ ఉమ్మడి జాబితాలో ఉన్నందున– ఈ సమస్యపై జాతీయస్థాయి చర్చ జరగాలి. 370(ఎ) తో సహా భాషలకు సంబంధించిన ఇతర అధికరణలను కూడా పరిగణనలోకి తీసుకొని రాజ్యాంగానికి సమగ్రమైన సవరణలను తేవాలి. మొత్తంగా రాజ్యాంగాన్ని పునఃపరిశీలించే సంగతి ఎలా ఉన్నా, కనీసం భాషలకు సంబంధించి అయినా నిపుణులతో ఒక సంఘాన్ని నియమించి త్వరగా నివేదికను రాబట్టి తగిన రాజ్యాంగ సవరణలను తేవడం, వాటి అమలుకు చర్యలు తీసుకోవడం మాత్రమే తెలుగుజాతిని ఈ భాషాసంక్షోభం నుండి కాపాడగలదు.

8వ షెడ్యూలులో గుర్తించిన అన్ని భాషల్లో ఒక పోర్టల్‌ను విద్యార్థుల కోసం త్వరలో ప్రారంభించనున్నట్లు ఇటీవల కేంద్ర మానవ వనరుల మంత్రి స్మృతీఇరానీ ప్రకటించారు. జాతీయ అంతర్జాతీయ విజ్ఞానాన్ని, పరిశోధనల సారాన్ని 22 భారతీయ భాషల్లోకి అనువదించి ఈ పోర్టల్‌లో అందించనున్నట్లు ప్రకటించారు. ఇది చాలా గొప్ప వార్త. కానీ తమ భాషలో తాము చదువుకోలేని విద్యార్థులు ఈ పోర్టల్‌ను వినియోగించుకోలేరు కదా! పోయిన ఏడాది నుండి అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవాన్ని జరిపించడంలో కూడా కేంద్ర మానవ వనరుల మంత్రి చొరవ తీసుకున్నారు. అయితే ఉత్సవాలను లాంఛనంగా జరుపుకోవడం మాత్రమే భాషల్ని రక్షించలేదు కదా! మోడీగారి ప్రభుత్వం జాతీయవాదానికి అంకితమైనదే. అయితే జాతీయ భాషల్ని రక్షించుకోవద్దా? విద్యాపాలనా రంగాల్లో మాతృభాషల్ని రక్షించకుండా ఏ విధంగా ప్రజాస్వామ్యాన్ని కాపాడుకోగలం? సామాన్యుడి గొంతునూ, బ్రతుకునూ విస్మరించి బంగారు భారతదేశాన్ని ఎలా నిర్మించుకోగలం?!

రాజ్యాంగంలో భాషలకు సంబంధించిన 17వ విభాగంలోని రెండు అధ్యాయాలకూ సమగ్రమైన సవరణలు తెచ్చి పటిష్టమైన జాతీయ విధానాలకు రూపకల్పన చేసి అమలు పరచవలసిన బాధ్యతను కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు ఇప్పటికైనా గుర్తించాలి.

**1-3-2016**

సామల రమేష్‌బాబు

# భాష- అంతర్జాతీయ భావన

(విద్యాభ్యాసం, జ్ఞాన సముపార్జన, విజ్ఞానశాస్త్ర అధ్యయనం, ఆంగ్ల భాషాధ్యయనాలలో మాతృభాష ప్రాధాన్యత)

ఆంగ్ల మూలం : **జోగా సింగ్,** తెలుగు సేత :**మనోహర్ బోరంచ,** పంజాబ్

**1. ప్రస్తావన**

ఈ మధ్య, కేంద్ర ప్రభుత్వం, కేంద్ర ప్రభుత్వ సివిల్ సర్వీసు పరీక్షలకు సంబంధించి ఒక ప్రకటన జారీచేసింది. 'ఆంగ్ల భాష పేపరు' ను రాయడం తప్పనిసరి చేయడమే కాకుండా దానిలో సంపాదించిన మార్కులను ఉత్తీర్ణతాశాతానికి లెక్కించాలనే ప్రకటన చేసింది. ఇది మరొకసారి భాషా సంబంధమైన సమస్యల చర్చను రగిలించింది. భాషావేత్తల, రాజకీయవేత్తల నిరసనలకు జడిసి తన ఈ ప్రకటనను కేంద్ర ప్రభుత్వం 15 మార్చిన ఉపసంహరించుకుంది. కేంద్ర ప్రభుత్వపు ఈ అనాలోచిత ప్రకటనపై దృష్టి సారించడమే ఈ పత్రమును సిద్ధపఱచుటలోని ముఖ్య ఉద్దేశ్యము.

భాషకు విద్యతో, విజ్ఞాన శాస్త్రంతో, సంస్కృతితో, వారసత్వంతో అవినాభావ సంబంధం ఉంది. ముఖ్యంగా, విదేశీ భాషను నేర్చుకోవాలంటే 'మాతృ భాష' ప్రధానపాత్రను పోషిస్తుంది.

బ్రిటీషువాళ్లు భారతదేశాన్ని వదిలివెళ్లిన తరువాత కూడా భారతీయ భాషలకు న్యాయబద్ధమైన స్థానం లభించలేదు. సరికదా గత 30 సంవత్సరాలుగా పరిస్థితి మరీ దిగజారుతూ వస్తోంది. చివరకు పాఠశాలలో బోధనామాధ్యమ స్థానాన్ని కూడా ఆంగ్లమే అక్రమిస్తోంది. దీనికి అసలు కారణం భారతదేశపు కుహనా మేధావుల అనాలోచిత, స్వార్థపూరిత ప్రయోజనాలు కానీ, వారు తమ అవివేకానికి మద్దతుగా ఈ వాదనలు చేస్తున్నారు:

1. విజ్ఞానశాస్త్రము, ఇతర శాస్త్రాల జ్ఞానమంతా ఆంగ్లభాషలోనే నిక్షిప్తమైంది. కాబట్టి, మనం పురోగమించాలంటే ఆంగ్లభాషలో బోధన తప్పనిసరి.
2. అంతర్జాతీయంగా సమాచార వ్యవస్థ, వాణిజ్య వ్యవస్థ సమస్తం ఆంగ్లభాషలోనే నడుస్తుంది కాబట్టి ఆంగ్లంలో బోధన తప్పనసరి అని.

ఈ వాదనలు అవివేకానికి నిదర్శనాలు.

**2. మాతృభాష, ఇతర భాష మరియు విద్య**

ప్రపంచ దేశాల వ్యాప్తంగా భాషకు- విద్యకు, భాషకు- విజ్ఞాన శాస్త్రానికి, భాషకు- జ్ఞాన సముపార్జనకు గల సంబంధాన్ని మొదట పరిశీలించాలి. 1953లో UNESCO విడుదల చేసిన 'The use of Vernaculars in Education' అనే పుస్తకములో నున్న ఈ క్రింది విషయాలు జ్ఞానోదయాన్ని కలుగజేస్తాయి. అంతర్జాతీయంగా ఈ విషయంపై జరిగిన పరిశోధనలను గురించీ తెలుపుతాయి.

"మాతృభాషలో విద్యాబోధన అత్యుత్తమం" అనేది నిర్వివాదాంశం. మనస్తత్వశాస్త్ర పరంగా ఆలోచిస్తే, మాతృభాషలో అర్థంచేసుకోవడం, వ్యక్తపరచడం సులభం, విద్యాపరంగా ఆలోచిస్తే, విద్యార్థి ఏ ఇతర భాషామాధ్యమంలో కన్నా గూడా, మాతృభాషా మాధ్యమంలోనే తొందరగా విషయాన్ని గ్రహించగలడు" @ (UNESCO, 1953 : 11)

ఇది విస్తృత పరిశోధనల అనంతరం UNESCO వెలిబుచ్చిన అభిప్రాయం. 1968లో మళ్లీ UNESCO ఇలా అంది.

"మాతృభాషలో బోధన వీలైనంత ఎగువస్థాయి వరకు జరగాలి" @ (UNESCO, 1968 :691) 2004 సంవత్సరపు యునైటెడ్ నేషన్స్ డెవలప్‌మెంటల్ రిపోర్టులో ఈ విధంగా రాసి వుంది.

"ద్విభాషాబోధనా పద్ధతిలో (టగాలగ్ (Tagalog) మరియు ఆంగ్లం) బోధన జరిపే ఫిలిప్పీన్సులో, టగాలగ్ భాషను తమ ఇంట్లో మాట్లాడని వారు కూడా టగాలగ్ భాషలో అత్యుత్తమ ప్రతిభను కనబఱచారు." @ (UNDP Report, 2004 :61)

అత్యధిక సంఖ్యాకులు ఆంగ్లాన్ని తమ మాతృభాషగా వ్యవహరిస్తున్న అమెరికా సంయుక్త రాష్ట్రాల కథనాన్ని గమనించండి :

"అ..సం.రా.లలో నవహో (Navajo) విద్యార్థులు వారి భాషయైన నవహో భాషను ప్రథమ భాషగా, ఆంగ్లభాషను ద్వితీయభాషగా ప్రాథమిక స్థాయి వరకు చదువుతున్నారు. కేవలం ఆంగ్లభాష లోనే విద్యాభ్యాసము గావింపబడిన సహాధ్యాయుల కంటే, నవహో భాషను ప్రాథమిక స్థాయిలో ప్రథమ భాషగా విద్యాభ్యాసము చేసిన పిల్లలే అత్యుత్తమ ప్రతిభను చూపగలిగారు" @ (UNDP Report, 2004 : 61)

భారత ఆంగ్ల భాషావ్యామోహపరులకు మనఃపూర్వకంగా, వ్యక్తిగత విన్నపము చేయదలిచాను. ప్రధానంగా ఆంగ్లభాషను మాట్లాడే ప్రజలున్న అమెరికా, కెనడా, న్యూజిలాండ్ దేశాలలో ఎంత పెద్ద సంఖ్యలో ఆంగ్లేతర భాషా మాధ్యమమున్న పాఠశాలలు ఉన్నాయో పరికించండి. ప్రపంచ వ్యాప్తంగా, ఈ అంశముపై చేయబడిన విశ్లేషణలను గమనించండి.

"మెక్సికోలో మోదియానో (1968, 1973) ఫిన్లాండ్‌లో Skutnabb-Kangas (1995) ఇంకా Gudschinkky యొక్క పరిశోధనా ఫలితాల ప్రకారం, స్వదేశీభాష (మాతృభాష) లో పాఠశాల చదువు ప్రారంభించి, తదనంతరం ద్వితీయ భాషగా విదేశీభాషను నేర్చుకున్న విద్యార్థులు తమ స్వదేశీభాషలో సాధికారతను సాధించారు. అక్షరాస్యతా శాతం కూడా పెరిగింది. ద్వితీయభాషగా నేర్చుకున్న విదేశీ భాషలోనూ ప్రావీణ్యతను సాధించారు. చాల సంవత్సరాలపాటు పాఠశాల చదువును కొనసాగించారు. కేవలం విదేశీ భాషలో విద్యాభ్యాసము చేసిన విద్యార్థుల విషయంలో పై విషయాలు తద్విరుద్ధంగా ఉండడం గమనార్హం" @ (Tucker, 1977 : 3) ('ద్వితీయ భాష'ను 'విదేశీ భాష'గా చదవండి)

ఫిన్లాండ్ నుండి స్వీడన్‌కు వెళ్లి స్థిరపడిన పిల్లల చదువుపై చేసిన పరిశోధనా ఇలా ఉంది.

"ఫిన్నిష్ భాషా నైపుణ్యము గణితములో మార్కులు/ గ్రేడ్ సంపాదించడంలోనూ కొట్టొచ్చినట్టు కనబడింది. ఉన్నత విద్యా స్థాయిలో, స్వీడిష్ భాషలోనే గణితమును బోధించినప్పటికీ అటువంటి ఫలితాలే

అగుపడ్డాయి. ఈ ఫలితాలు స్పష్టపరుస్తున్నదేమంటే– గణిత సంబంధమైన సమస్యల పరిష్కారానికి మాతృభాషలో ఆలోచన అన్న అంశం ప్రశంసనీయంగా పనిచేస్తుంది అని. ఇదేకాకుండా జీవశాస్త్రము, రసాయనశాస్త్రము, భౌతికశాస్త్రము పరిపూర్ణంగా అర్థంచేసుకోవడానికి 'మాతృభాషలో ఆలోచన' చక్కగా ఉపయోగపడింది అని. ఎవరైతే స్వదేశీభాష/ మాతృభాషలో తగినంత ప్రావీణ్యాన్ని సాధించలేక పోయారో వారికన్నా వీరు ముందున్నారు. @ (Skutnabb-Kangas and Toukomaa, 1976), (quoted in Paulston, 1977, 1977 : 94)

అమెరికాకు సంబంధించి మరొక విషయాన్నీ చూద్దాం.

"ఆంగ్లేతర భాషలను తమ మాతృభాషగా కలిగి, అమెరికాలో నివసిస్తున్న వారికి ఆంగ్లంలో మాత్రమే బోధన అన్న ఏక భాషా మాధ్యమ బోధన అంతగా ఉపకరించలేదనీ, వారు తగినంత ప్రావీణ్యాన్ని ప్రదర్శించలేకపోయారనీ, దీనికి కారణం స్వదేశీ/ మాతృభాషకు వారిని దూరంగా ఉండడమే" @ (Tucker, 1977 : 3) అని రచయిత అభిప్రాయపడ్డారు.

**ఘనా విషయానికొస్తే :**

"Bokamla and Tlou (1977:45) ప్రకారము... ఘనాలో, ప్రాథమిక విద్య పూర్తిచేసిన విద్యార్థులలో కేవలము 5%విద్యార్థులు మాత్రమే మాధ్యమిక విద్యాభ్యాసానికై వెళుతున్నారు. Zaier లో, పాఠశాలలో చేరిన విద్యార్థులలో కేవలము 30%విద్యార్థులే 4వ తరగతి వరకు చదువుతున్నారు. విదేశీ భాషా మాధ్యమ బోధనతో భాషా నైపుణ్యాలను పెంపొందించుకొనే శక్తి లోపించడమే దీనికి ప్రధాన కారణము అంటారు ఈ రచయితలు" @ (Fasold, 1984 : 306)

ఇక.."విద్యార్థులు ఆంగ్ల భాషను నేర్చుకొనకపోతే విజ్ఞాన శాస్త్రాన్ని, గణితాన్ని అర్థంచేసుకోజాలరు అన్నమాట శుద్ధ అబద్ధం. విజ్ఞానశాస్త్ర విషయాలు, భావనలు కేవలం ఒక భాషకో, ఒక సంస్కృతికో, కట్టుబడి ఉండవు. రష్యన్లు, జర్మన్లు, ఫ్రెంచ్ దేశీయులు ఆంగ్ల భాషను ఉపయోగించకుండా తమ అత్యుత్తమమైన శాస్త్రీయ పరిశోధనలను ఆవిష్కరిస్తున్నారు. 2003 సంవత్సరంలో నిర్వహింపబడిన Trends in International Mathematics and Science Study (TIMSS) లో అత్యుత్తమంగా నిలిచిన ఐదు దేశాలు, సింగపూర్, రిపబ్లిక్ ఆఫ్ కొరియా, హాంకాంగ్, చైనీస్ తైపీ, మరియు జపాను. ఈ దేశాల విద్యాలయాలలో ఆంగ్లం ప్రథమ భాషగా బోధింపబడదు, అన్న సత్యాన్ని గమనించండి" @ (Ricardo and Nolasco 2009 :6)

ఆంగ్ల భాష పుట్టని నాడే మన దేశము, అరబ్ దేశాలు "విజ్ఞాన ఖనులు "అని వేరే చెప్పాలా!

నార్వే దేశపు Global Monitoring Report (Benson, 2005) ప్రకారం.

"యోరుబా మీడియం ప్రైమరీ ప్రాజెక్టు (Fafunwa et al 1975; Akinnaso 1993; see Adegbiya 2003 for other references) సత్ఫలితాల నిచ్చింది. 6 సంవత్సరాల పాటు మాతృభాషలోనే అన్ని విషయాలను బోధిస్తూ, ఒక విదేశీ భాషను ద్వితీయ భాషగా బోధించడం వల్ల చక్కని ఫలితాలు వచ్చాయి. ఈ ఫలితాలు ఆంగ్లమాధ్యమ పాఠశాలల ఫలితాల కన్నా మెరుగ్గా ఉన్నాయి..." @ (Benson, 2005)

ఇవన్నీ పరిశీలించిన తరువాత, ప్రపంచవ్యాప్తంగా పలుమార్లు నిరూపించబడిన విషయం ఒకే ఒక్కటి : అది– **విద్యలో విజయం కేవలం మాతృభాషా మాధ్యమంలోనే సాధ్యం అనేది. విదేశీ భాషా మాధ్యమంలో అసాధ్యం అని. మాతృభాషలో విద్యాబోధన అత్యుత్తమం అన్నది అసత్యం కాదు అనడానికి ఇవి కారణాలు:**

"బాలుడు/ బాలిక తన మాతృభాషలో నిర్భయంగా, నిస్సంకోచంగా, తప్పులులేకుండా తన అభిప్రాయాలను బహిరంగపరచ గలగడం, పలు భాషలు నేర్పడంవల్ల... అంటే మాతృభాషా మాధ్యమంగా అన్ని సబ్జెక్టులు నేర్పుతూ ఇతర విదేశీ భాషలను ఒక సబ్జెక్టుగా బోధించడం వల్ల సత్ఫలితాలు కలుగుతాయి. విదేశీ భాషను నేర్చుకోవడానికి ఉత్సుకత చూపుతారు. మాతృభాషాను ప్రథమభాషగా ఎంచుకొని చదివిన విద్యార్థి రెండవ భాష, మూడవ భాష విషయానికి వచ్చేటప్పటికి అంతకు ముందే తాను పక్కాగా నేర్చుకొని ఉన్న భాషలో చక్కని ఆలోచన చేయడం, భావ వ్యక్తీకరణ సుస్పష్టంగా చేయడానికి సంసిద్ధుడు కావడం జరుగుతుంది. ఇది ఉపాధ్యాయులకూ ఉపయుక్తంగానే ఉంటుంది. విద్యార్థి నిర్భయంగా, నిస్సంకోచంగా, తప్పులు లేకుండా భావవ్యక్తీకరణ చేయగలుగుతాడు కనుక విద్యార్థి ఎంతవరకు నేర్చుకున్నాడు. ఎక్కడ తప్పులు చేస్తున్నాడు. ఇంకా ఏమి నేర్చుకోవలసి ఉన్నది అన్న విషయాలు ఉపాధ్యాయులకు అవగతమైపోతాయి. బహుభాషలు నేర్పడం వల్ల, పాఠశాలలోనున్న, సమాజంలో నున్న ఇతర వ్యక్తులతో సత్సంబంధాలూ నెలకొంటాయి. వారితో ఏర్పడిన సత్సంబంధాలతో విద్యాభ్యసనానికి కావలసిన అదనపు సమాచారాన్ని, బోధనోపకరణాలను సమకూర్చుకోగలుగుతాడు. తమ భాష, తమ పిల్లలు నేర్చుకునే భాష ఒకటే అయినందున పోషకులూ తమ పిల్లల చదువుపట్ల ఎక్కువ శ్రద్ధాసక్తులను చూపుతారు. పాఠశాల కార్యక్రమాలతో, పోషకులు సాన్నిహిత్యాన్ని పెంచుకుంటారు" (Ricardo and Nolasco, 2009 : 4)

మాతృభాషా మాధ్యమములో బోధన జరుగక, ఇతర భాషా మాధ్యమంలో జరిగితే, విద్యార్థి తన ఎక్కువ కాలాన్ని ఆ భాషను నేర్చుకోవడంతోనే సరిపుచ్చుతాడు.

"విద్యార్థికి, ఉపాధ్యాయునికి విజ్ఞానశాస్త్రము, గణితముల పైన కన్నా, ఆ భాషను నేర్చుకోవడం పైననే అధికదృష్టి పెట్టవలసి వస్తుంది. కాబట్టి, విజ్ఞానశాస్త్రపు, గణితపు ప్రాథమిక విషయాలు తెలుసుకోవాలన్నా, కారణాలు కనుగొనాలన్నా, సమస్యలకు పరిష్కారాలను కనుగొనాలన్నా, అత్యుత్తమమైన మార్గం మాతృభాషలో విద్యాబోధనయే" @ Ricardo and Nolasco, 2009 : 11)

కేవలం, మాతృభాషలో విద్యాబోధన ద్వారానే ప్రగతి సాధ్యం అన్న సత్యం, పైన తెలిపిన ప్రపంచ వ్యాప్త పరిశోధనల ద్వారా, ప్రముఖుల అభిప్రాయాల ద్వారా స్పష్టమైనది కదా! కాని, **ఇక్కడ, మన భారతదేశంలో భాష, విద్యావిషయాల పై ప్రణాళికలు సిద్ధం చేయవలసిన పెద్దలు ఆంగ్ల భాష ముందు మోకరిల్లుతున్నారు. భారత దేశపు విద్య, భాష, సంస్కృతులకు రక్షణ లేకుండా చేస్తున్నారు.**

**అంతర్జాతీయంగా చేసిన పరిశోధనల ఫలితాలు వీరి పిరికితనాన్ని, అవివేకాన్ని ఎండగట్టడానికి బాగా ఉపకరిస్తాయి. మాతృ**

**భాషా మాధ్యమం ద్వారా విద్యా బోధన, విద్యా వ్యవస్థలో పురోగతిని సాధించడమే కాదు, విదేశీభాషలను నేర్చుకోవడానికి కూడా విదేశీ భాషా మాధ్యమం కన్న బాగా ఉపకరిస్తుంది** అని తేటతెల్లమవుతుంది. అది ఏ విధంగానో చూద్దాం!

### 3 విదేశీ భాషను నేర్చుకోవడంలో మాతృభాషా మాధ్యమం– విదేశీభాషా మాధ్యమం

దీన్ని UNESCO వారి ప్రకటనతోనే ప్రారంభించడం సముచితంగా ఉంటుంది.

1. "భాష– అభ్యసనము" అన్న విషయాల మీద మనకు కొన్ని అపోహలు ఉన్నాయి, ఆ అపోహలను దూరంచేయవలసిన అవశ్యకత ఉన్నది. **ఒకటవ అపోహ,** 'విదేశీభాషను నేర్చుకోవాలంటే, ఆ భాషా మాధ్యమంలోనే దాన్ని నేర్చుకోగలము" (వాస్తవంగా ఆ భాషను ఒక సబ్జెక్టుగా మాత్రమే నేర్చుకోవడం ఉత్తమం) **రెండవ అపోహ** : 'ఒక విదేశీభాషను నేర్చుకోవాలంటే బాల్యము నుండే ప్రారంభించాలి" (బాల్యము నుండే నేర్చుకోవడంవల్ల ఆ భాషోచ్చారణ బాగా ఉంటుందేమో కానీ ప్రథమ భాషగా మాతృభాషను అభ్యసించి ప్రావీణ్యతను సంపాదించిన వ్యక్తియే విదేశీభాషను బాగుగా గ్రహించగలడు) **మూడవ అపోహ :** 'విదేశీ భాషలను నేర్చుకోవడంలో మాతృభాష అవరోధంగా నిలుస్తుంది' (వాస్తవానికి, మాతృభాషలో సంపాదించుకున్న ప్రావీణ్యత విదేశీ భాషలను నేర్చుకోవడానికి చాల బాగా దోహదకారి అవుతుంది) ఆ అపోహలు అపోహలే, వాస్తవం కావు. కానీ, భాషాభ్యసన విధాన రూపకర్తలకు మార్గదర్శకాలు కాగలుగుతాయి" @ (UNESCO, 2008 : 12)

అన్ని ఖండాలలో విస్తరించిన 12 దేశాలలో జరిపిన పరిశీలనలు ఎలా ఉన్నాయో చూద్దాం. వీనిలో భారతదేశము కూడా ఉన్నది. ప్రపంచ బ్యాంకు భారతదేశంలోని పరిశోధనల కొరకు నిధులను కేటాయించింది. ప్రపంచ బ్యాంకైతే ఆంగ్లభాషకు విరోధి కాదు గదా!

ఆసక్తిని గొలిపే ఒక పరిశీలనను గమనిద్దాం! "ఫిన్లాండ్ దేశములో కొన్ని సంవత్సరాల పాటు పాఠశాలకు వెళ్లి, ప్రథమ భాష/ మాతృభాషగా ఫిన్నిష్ భాషను, ద్వితీయ/ విదేశీ భాషగా స్వీడిష్ భాషను నేర్చుకొన్న విద్యార్థి, స్వీడన్ దేశానికి వలన వెళ్లినప్పుడు రెండు భాషలలోనూ సమాన ప్రతిభను చూపగలిగాడు. సరాసరిగా 10 సంవత్సరముల వయసుగల విద్యార్థులు ఫిన్లాండ్ నుండి స్వీడన్‌కు వెళ్లి స్థిరపడిన సందర్భంలో, తమ మాతృభాషయైన ఫిన్నిష్‌లో ప్రతిభ కనపఱచడమే కాక, స్వీడన్‌లోని విద్యార్థులతో స్వీడిష్ భాషలో సరితూగగలిగారు. 6 సంవత్సరముల కన్న తక్కువ వయసు ఉన్నప్పుడే స్వీడను వెళ్లి స్థిరపడిన వారో, లేదా స్వీడను లోనే జన్మించిన వారో ఇంతగా తమ ప్రతిభను కనబరచలేకపోయారు. వీరి స్వీడిష్ భాషా ప్రావీణ్యపు పెరుగుదల 12 సంవత్సరముల వయసులో ఆగిపోయింది. కారణం, వీరికి మాతృభాషయైన ఫిన్నిష్‌లో గట్టి



పునాది లేకపోవడం" @ (Paulston 1977 : 92-3)

మాతృభాషా మాధ్యమములో చదివినవారు మాత్రమే విదేశీ భాష/ ద్వితీయ భాషను బాగా నేర్చుకొనగలరని ఋజువైంది. ఇది ఎలా సాధ్యం అన్న దానిని ఇప్పుడు చూద్దాం.

"విదేశీ భాషను నేర్చుకొనుట లేదా బోధించుట అనే ప్రక్రియలో మాతృభాష పాత్ర చాలా ఉంటుందని Butzkamm నొక్కి చెప్తాడు. మాతృభాషా ప్రభావమున్న పరిసరాలలో పెరిగిన వానికి తన చుట్టూ ఉన్న విషయాలు మనసులో ముద్రపడిపోయి, భాషను సాధనంగా చేసుకొని అభిప్రాయాలను భావయుక్తంగా సులభంగా వ్యక్తపఱచ గలుగుతాడు. వ్యాకరణాంశాలు, భాషాసౌందర్యపు ప్రక్రియలు జన్మతః వచ్చియుంటాయి. ఇక చదవడం, వ్రాయడం అనే నైపుణ్యాలను సంతరించుకోవడం సులభం. ఈ విధంగా మాతృభాషలో నైపుణ్యము సాధించిన తరువాత విదేశీ భాషను నేర్చుకోవడం సులభతరం అవుతుంది" @ (WIKIPEDIA)

"తెలివిపరులు తమ భాషాభ్యసనము ద్వారా నేర్చుకొనిన భాషా నైపుణ్యాలను, ప్రాపంచిక విజ్ఞానాన్ని బహుబాగా సద్వినియోగపరచు కుంటారు. చాలవరకు ఒక విషయాన్ని కొత్త భాషలో భావించుకునే అవసరం వీరికి రాదు. ఎందుకంటే వీళ్లు ఇదివరకే అవసరమగు జ్ఞానాన్ని పొందియున్నారు. వేరు వేరు భాషల వ్యాకరణ సంబంధమైన నియమనిబంధనలు ఒకే తీరుగా లేకపోయినప్పటికీ వచనము, లింగము, కర్త, కర్మ, క్రియ, నకారాత్మక భావన, వస్తు స్థితి, కాలము మొదలగు భావనలన్నియు అన్ని భాషలలో ఇంచుమించు ఒకే తీరుగా ఉంటాయి" @ http: en.wikipedia.org/wiki/Wolfgang/ Budzkamm.

ఇంతవరకు నిర్ధారించబడిన వాస్తవాలు భారతదేశపు విధాన కర్తల కళ్లను, చెవులను తెరిపించడానికి సరిపోతాయి. అయినప్పటికీ ప్రపంచ వ్యాప్తంగా, భాషాపరంగా జరుగుతున్న విషయాలను తెలుసు కుంటే నష్టమేమి లేదు.

వాస్తవానికి, ఎక్కడెక్కడైతే ఆంగ్లం విదేశీభాషా మాధ్యమంగా చలామణి అవుతూ వస్తున్నదో, అక్కడక్కడ అంతర్ధానమవుతున్నది లేదా మసకబారుతున్నది. దీన్ని నిర్ధారించడానికి కొన్ని నిదర్శనాలు :

2007 సంవత్సరంలో, ఉగాండా తమ దేశపు పాఠశాలలో మాతృభాషా మాధ్యమం ద్వారా బోధన కొనసాగిస్తూ, ఆంగ్ల భాషను ఒక సబ్జెక్టుగా నేర్పాలని నిర్ణయించి అమలుపరచింది. 2008 లో ఫలితాలను మదింపువేసి చూడగా అక్షరాస్యత శాతం పెరిగిందని తెలిసింది.

ఉగాండాలో 52 ప్రాంతీయ భాషలు వ్యవహారంలో ఉన్నాయి. మాతృభాషలో ప్రావీణ్యాన్ని సంపాదించిన విద్యార్థి విదేశీ భాషను అతి సులభంగా నేర్చుకొనగలుగుతాడని ఋజువైంది. ఈ విధానాన్ని అమలుపరచకముందు ఉగాండాలో పాఠశాల విద్య ఆంగ్ల మాధ్యమం లోనే ఉండేది (See Kavuma, 2009 for these facts)

మలేసియా, 2009 సంవత్సరంలో, తమ దేశ జాతీయ పాఠ శాలలో గణితం, విజ్ఞానశాస్త్రం మలేసియాలో బోధించాలని, ప్రాంతీయ పాఠశాలలో చైనీస్ భాషలోను, తమిళభాషలోను బోధించాలని నిర్ణ యించింది.

మలేసియాలోని తమిళులకు విజ్ఞానశాస్త్రాన్ని తమిళ మాధ్యమం లోనే బోధించడం సముచితం అని మలేసియా నిర్ణయించింది. కాని, మన దేశంలో అది దోషంగా భావించబడుతున్నది. ఆంగ్ల భాషా వ్యామోహంలో పడిన విధానకర్తలు విచక్షణలు కోల్పోతున్నారు. ఇంకా కొన్ని విషయాలను సాక్ష్యాధారాలతో నున్న వానిని పరిశీలించి చూడడంలో నష్టం ఏమీ లేదనుకుంటాను.

"న్యూజిలాండ్, బ్రిటన్ దేశాలు తమ స్వదేశీ అల్ప సంఖ్యాకుల భాషలకు (విదేశాల నుండి వలసవచ్చిన వారి భాషలకు కాకుండా) కొంత కాలంగా మంచి గుర్తింపునిస్తూ వస్తున్నాయి. తమ పాఠ శాలలలో బోధనా మాధ్యమంగా కూడా చేశాయి. ఎస్.మే గారు ఒక సకారాత్మక దృష్టితో మాఓరి (Maori) భాషకు సంస్కృతికి పెద్ద పీటను వేశారు. విదేశీ భాషను గూడ నేర్పుతూ మాఓరి భాషను బోధనా మాధ్యమంగా చేసి నడుపుతున్న పాఠశాలల ప్రాథమిక ఫలితా లను గమనిస్తే, చాలా బాగున్నాయి. హాంకాంగ్‌లో స్వదేశీ భాషయైన కాంటోనీష్ (Cantonese) ను, ఆంగ్లాన్ని కూడా బోధనామాధ్య మంగా చేసి, పుతోంగ్వా (Puntonghua) అనే భాషకు కూడా ప్రాధా న్యాన్ని యిస్తూ బోధిస్తున్నారు. పుతోంగ్వా భాషాభివృద్ధి గూడ జరుగు తున్నది. మలేసియా తద్విరుద్ధముగా, ఆంగ్లభాష ప్రాధాన్యతను తగ్గించి, దేశమంతటా తమ భాషయైన మలేయ్ (Malay) భాషను అధికార భాషగా చేసింది. పాఠశాలలోను, విశ్వవిద్యాలయాలలోను బోధనామాధ్యమంగా మలేయ్ భాషను అమలుపఱచింది (S.Kaur Gill.pp.135-152)." @ Ammon, 2004)

వీటన్నింటిని గమనిస్తే, గతములో ఆంగ్లభాషా ప్రభావానికి లోనైన అన్ని దేశాలు ఆంగ్లానికి వీడ్కోలు పలుకుతున్నాయి, మన దేశంలో తప్ప. దీనికి కారణం–

ఆంగ్ల భాషను సాధనంగా చేసుకొని, ఇతర భారతీయులను అన్ని విధాలా కొల్లగొట్టాలని, దోచుకోవాలని చూడడమే. కనుక, ఈ ఆధునిక యుగంలో, ఈ ఛాందస వాదాన్ని ధ్వంసంచేయాల్సిన అవసరం ఉంది. స్టాక్ హోమ్ విశ్వవిద్యాలయం (see Benson, 2005) వీటిని అపోహలని తేల్చింది. ఈ అపోహల్లో కొన్ని.

**2. భాషా పరంగా మరికొన్ని అంధవిశ్వాసాలు :**

2.1. "ఒకే దేశం, ఒకే భాష అనే అంధవిశ్వాసం: దేశానికి రాష్ట్రాలకు ఒకే భాష ఉపయుక్తమని భావించి ఒక విదేశీ భాషను అమలుచేసినా దేశ సమైక్యతను సాధించలేకపోయాయి. దాదాపు ఏ భాషా దేశాలైన సోమాలియా, బురాండీ, రవాండాలు స్థిరత్వాన్ని సాధించలేదు. బంగ్లాదేశ్, పాకిస్థాన్, మయన్మార్, శ్రీలంకలలో జాతి గత, భాషాగత విభేదాలకు సంబంధించి ఆయా ప్రభుత్వాలు ఈ సూత్రంపై పరాజయం పాలయ్యాయి (Ouane 2003)." @ (Benson, 2009)

2.2. 'ప్రాంతీయ భాషలు ఆధునిక భావనలను స్పష్టంగా వ్యక్తీకరింపజాలవనేది మరొక అంధ విశ్వాసం : ఏ ఇతర భాషలకన్నా, యూరపు భాషలకు సహజసిద్ధంగా సామర్థ్యం గొప్పదన్న అపోహ ఒకటి. ప్రపంచవ్యాప్తంగా ఉన్న ప్రతీ భాష అన్నింటా సామర్థ్యాన్ని ప్రదర్శించగలదు. సాంకేతిక పదాలను సృష్టించడం, విస్తరింప జేయడంతో సహా ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతాన్ని సెనెగల్ భాషలో లియోపోల్డ్ సెంఘర్ అనువదించి చూపడమే దీనికి నిదర్శనం (Alexander, 2003)." @ (Benson, 2009)

పై విషయాల ద్వారా, ఏ భాషలోనైనా, ఏ భావననైనా స్పష్టంగా తెలియజేయవచ్చునని రుజువైంది. ఈ అవివేకాన్ని తొలగించాలంటే ఇంకొంచెం లోతుకు వెళ్లి చూడాలి.

వాక్య నిర్మాణపరంగా ఆలోచిస్తే ఏ భాషయైనా ఇతర భాషలలోకి అత్యుత్తమంగా లేదా అతి హీనంగా అనువదింపబడదు. వ్యాకరణ పుస్తకాలు చదివి రాసిన దాని లాగానే బాగానే ఉంటుంది కనుక, వాక్య పరంగా ఆలోచిస్తే అన్ని భాషలూ గొప్పవే. శబ్ద సంపదను బట్టి ఆ భాష గొప్పదా కాదా అనే భావన కలుగుతుంది. అంతే!

విజ్ఞానశాస్త్ర, సాంకేతిక శాస్త్రాలకు చెందిన పదాలను విశద పరచడానికి మన భాషలో తగిన పదాలు లేవు అని అంటుంటారు. భాషలలో ఉన్న 'శబ్దనిధి' ని గురించి తెలియనివారు మాత్రమే ఈ విధంగా మాట్లాడుతుంటారు.

ప్రతి భాషలోనూ తగిన పదాలు లభిస్తాయి. ఎందుకంటే, అన్ని భాషా పదాలూ ఏదో ఒక ప్రాథమిక మూలాన్ని కలిగి ఉంటాయి. భాషలలో ఉన్న పదాలను పరిశీలించి చూస్తే పెద్దగా తేడాలు కనిపించవు కూడా. కింది ఆంగ్ల పదాలు ఈ విషయాన్ని వివరిస్తాయి.

1. Haem -A prefix signifying blood.
2. Haemocyte -A blood cell
3. Haemagogue - Medicine that promotes the catamenial and haemorrhoidal discharges.
4. Haemal - Partaining to the blood
5. Haemalopia - An effusion of the blood into the globe of the eye; bloodshot eye.
6. Haemngiectasis - Dilation of a blood vessel.
7. Haemangioma - A Malformation of a blood ves sel which may occur in may part of the body.
8. Haemarthrosis - The presence of blood in joint cavity.
9. Haematemesis - The vomiting of blood.
10. Haematin - An iron-containing constituent of hemoglobin.
11. Haematinic - An agent improving the blood-quality.
12. Haematinuria - The presence of haematin in the urine.
13. Haematocele - A swelling filled with blood ; haeatoma
14. Haematocolpos - Retention of the menses due to a congenital obstruction of va gina.
15. Haematogenesis - The development of the blood.
16. Haematoid - Havinig the nature or appear ance of blood.
17. Haematology - The science dealing with the formation.
18. Haematolysis - Destruction of blood cells and liberation of haemoglobin.
19. Haematoma - The blood tumor; H.Auris, the blood tumor of the external (with thanks from Rawat, 1985)
20. Haemophilia - Tendency of blood not to clot.

మొదట చూడగానే, పై పదాలకు సమానార్థక పదాలు మన భాషలలో లేవు అనిపిస్తుంది కాని, నిజమేమిటంటే ఒక మూల పదానికి చివరలో పదాలు చేర్చడం వల్ల కొత్త పదాలు ఏర్పడ్డాయి. ఇక్కడ Haem కు అర్థం 'రక్తం' క్రింది హిందీ పదాలను గమనిస్తే మన భాషలలో సమానార్ధకాలు ఉన్నాయని లేదా మనం సులభంగా సేకరించుకోగలమని బోధపడుతుంది.

1. రక్త్, 2. రక్త్-కోశికా, 3. రక్త్-ప్రేరక్, 4. రక్తీయ్, 5. రక్తియ్-నేత్ర్, 6. రక్తవాహినీ- పాసార్, 7. రక్త్- మస్సా, 8. రక్తజోడ్-వికార్, 9. రక్త్- వామన్, 10. లౌహరక్తీయ్, 11. రక్తవర్ధక్, 12. రక్త- మూత్ర్, 13. రక్త్-గ్రంథి/సూజన్. 14. రక్త్ - మాసధర్మరోధ్, 15. రక్త్- ఉత్పాదన్, 16. రక్త-రూప్. 17. రక్త్- విజ్ఞాన్, 18. రక్త్-హ్రాస్, 19.రక్త్- గ్రంథి, 20. రక్త్- జమావ్హీనత.

పైన పేర్కొన్న ఆంగ్ల పదసంపద యావత్తూ అరువుతెచ్చుకొన్నదే. ఇవన్నీ లాటిన్ భాష నుండి నేరుగా అరువు తెచ్చుకున్నవే. ప్రస్తుతపు ఆంగ్ల భాషలో నున్న విజ్ఞానశాస్త్ర పదజాలంలో ఎక్కువ భాగం లాటిన్ లేదా గ్రీకు మూలాన్నించి తీసుకొన్నదే. కాబట్టి విజ్ఞానశాస్త్ర పదాలను అర్ధంచేసుకొనడానికి ఆంగ్ల భాషపై పట్టుండాలి అనడం అపోహ మాత్రమే.

భాషాపరంగా, ప్రపంచవ్యాప్తంగా జరుగుతున్న విషయాలను గమనిస్తే 'ఆంగ్లభాష- ప్రపంచ భాష' అన్న అంధ విశ్వాసం లేదా అపోహ పటాపంచలు అవుతుంది.

2.3 "విదేశీ భాష/ ద్వితీయ భాష అనేది విద్య, ఉపాధి అవసరాలకు ఆవశ్యకం కాని, ఫిల్లిప్సన్ (1992) ఏమంటాడంటే... శక్తిమంతమైన దేశాలు తమ భాషలకు విస్తృత ప్రచారం చేయడం వల్ల అలా గోచ రిస్తుందని. అల్పాదాయము కలిగిన దేశాలలో, అసంఘటిత రంగా లలో ఉపాధి అవకాశాలను గమనిస్తే, 50% లేదా అంతకంటే ఎక్కువ ప్రాథమిక విద్య పూర్తిచేసుకున్న వారితోనే నిండి ఉంది (Bruthiaux, 2002)" @ (Benson, 2005)

**4. ప్రస్తుత భాషాసంబంధమైన దృశ్యం :**

ఇక్కడ రెండు ధోరణులు స్పష్టంగా గోచరిస్తున్నాయి. (1) ఆంగ్ల భాషా ప్రాధాన్యత మసకబారుతుండడం, (2) ఆంగ్లేతర భాషల ప్రాధాన్యత అన్ని రంగాలలో పెరుగుతుండడం ఏ దేశాలలో నైతే వారి మాతృభాషలో కాక, ఆంగ్ల భాషలో విద్యాబోధన జరుపబడినదో ఆ దేశాలలో ఆంగ్లాన్ని పూర్తిగా తొలగించడం గాని లేదా తొలగించే ప్రక్రియ గాని జరిగింది లేదా జరుగుతోంది. ఒక్క భారతదేశం. దానిని ఆనుకొని ఉన్న పాకిస్థాన్‌లో తప్ప.

2000 సంవత్సరం వరకు 80%దాకా అంతర్జాలం (Internet) ఆంగ్లభాష ఆధీనంలో ఉన్నది. ఇప్పుడు 40% వరకు తగ్గిపోయింది. ఇప్పుడు అంతర్జాలం పలు భాషలలో లభ్యమవుతున్నది.

మైక్రోసాఫ్ట్ ను ఉట్టంకించి చెప్పాలంటే, భారతదేశంలో 95% వ్యాపారం భారతీయ భాషలలో, కేవలము 5% ఆంగ్ల భాషలోనూ నిర్వహించబడుతోంది.

ఆంగ్లం మాత్రమే తెలిసి ఉండి, ఏ ఇతర భాషాజ్ఞానం లేని వ్యక్తికి ఈ రోజుల్లో ఉద్యోగం ఇవ్వడానికి కంపెనీలు ముందుకు రావడం లేదు. ఈ విషయాన్ని ప్రఖ్యాత ఆంగ్ల పత్రిక "The Economist" స్పష్టంచేస్తూ, బ్రిటన్ వాసులకు ఆంగ్లం మాత్రమే తెలిసి ఉన్నందున ఉద్యోగ అవకాశాలు తగ్గుతున్నాయని రాసింది. భాషా పరంగా, ప్రపంచవ్యాప్తంగా ఏ దేశాలు ఏ దిశగా పయనిస్తున్నాయో తెలుసుకోవాలంటే ఈక్రింది విషయాన్ని చదవాలి.

"ఆంగ్లేతర భాషలలో మౌఖిక, లిఖిత వ్యక్తీకరణ నైపుణ్యం కలిగి ఉండడమే కాక, తమ సాంఘిక, సాంస్కృతిక వ్యవహారాలతో సంబంధం లేని వారితోను కలసిపోగలగాలి" @ (Stephanie Bell Rose, The Goldman Sachs Foundation; Vishakha Desai, The Asua Society, www).

"ఇతర దేశాలు ఆంగ్లేతర భాషలకు ప్రాధాన్యతనిస్తూ, ఆర్థిక సహాయాన్ని కూడా అందిస్తుండడం వల్ల, అమెరికా విద్యార్థులు ప్రపంచ వాణిజ్య క్షేత్రంలో వెనుకబడిపోతున్నారు. ఇంకా కష్టాలను ఎదుర్కోబోతున్నారు" @ (Asia Society News, 2nd April, 2009, www)

**"గుత్తాధిపతాన్ని కోల్పోతున్న ఆంగ్లం...."**

"20వ శతాబ్దపు చివరి వరకు ఆంగ్లం తన గుత్తాధిపత్యాన్ని కొనసాగిస్తూ వచ్చింది. కాని 21వ శతాబ్దంలో ఏ ఒక్క భాష కూడా గుత్తాధిపత్య స్థానాన్ని ఆక్రమించజాలదు"

"ఉపగ్రహ ప్రసారాలన్నిటినీ ప్రధానమైన ఆంగ్లేతర భాషలు ప్రపంచ వ్యాప్తంగా ఆక్రమిస్తాయి. 21వ శతాబ్దంలో దృశ్య శ్రవణ మాధ్యమాలు బహుభాషామయంగా తయారవుతాయి"

"ఆంగ్లభాషకు సాంకేతిక సమాచార వ్యవస్థకు గల అవినాభావ సంబంధం ఇక తాత్కాలికమే అవుతుంది. ఇక ఆంగ్ల భాషను మాత్రమే ఎరిగి ఉన్న వారికి ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం అందని ద్రాక్ష పండే అవుతుంది" @ (David Graddol, 2000 (1997).

"ప్రపంచ వ్యాప్తంగా, వర్ధమాన దేశాలన్నీ తమ విద్యార్థులకు మాతృభాషతో పాటు ఇతర విదేశీ భాషలను కూడా నేర్పాలని చూస్తున్నాయి. అయితే ఆ భాష ఆంగ్లమే కావాలని లేదు.

ఇప్పుడు అమెరికాలో కూడా చైనీస్ భాషా మాధ్యమ పాఠశాలలు దర్శనమిస్తున్నాయి. ఇందులో చేరుతున్న వారిలో 90% మంది చైనా భాష నేపథ్యం కలవారు కాకపోవడం విశేషం (ఇది పాలసీకి విరుద్ధంగా భాసించినప్పటికీ చైనీస్ భాష ఎదుగుతున్నదనడానికి నిదర్శనం) అమెరికాలో చైనా భాష నేర్చుకునే వారి సంఖ్య 2000 సంవత్సరముతో పోలిస్తే. 2007 సంవత్సరము వచ్చే సరికి పదింత లైంది (USA Today, 20th November, 2007).

ప్రధానంగా ఆంగ్లం మాత్రమే మాట్లాడు దేశాలలో సైతం. ఆంగ్లం మాతృభాష కానివారు ఆంగ్లాన్ని వదిలిపెడుతున్నారు. అమెరికా దేశపు 1990 సంవత్సరపు జనాభా గణనలో తేలిందేమిటంటే 31.8 మిలియన్ల మంది తమ గృహాలలో ఆంగ్లభాషను మాట్లాడడం లేదని చెప్పారు. 2000 సంవత్సరపు జనాభా గణనలో ఈ సంఖ్య 47 మిలియన్లకు చేరింది. జనాభా పెరుగుదల శాతం కన్నా, ఆంగ్లేతర భాషను మాట్లాడేవారి సంఖ్య అత్యధికంగా పెరిగింది. 1980 నుండి 2011 వరకు అమెరికా జనాభా 40% పెరిగితే. ఇంటి వద్ద ఆంగ్లం మాట్లాడని వారి సంఖ్య 140% పెరిగింది. భారతదేశంలో మాత్రం కొందరు మేధావులు జాతీయాభిమానమును వదిలిపెట్టి ముప్పూటలా ఆంగ్ల విధేయతను చాటుకుంటున్నారు.

ప్రసారమాధ్యమాల నుండి ఆంగ్లం ఏ విధంగా దూరమయిందో చెప్పడానికి అర్జెంటీనా భేషైన ఉదాహరణ. 1983లో. అర్జెంటీనా లోని ప్రసారమాధ్యమం 49% వరకు విదేశీ హస్తగతం. 1996 వచ్చేవరకు అది 22 శాతానికి పడిపోయింది.

గతంలో తన ప్రాభవాన్ని చాటుకున్న దేశాలనుండి ఆంగ్ల భాష క్రమంగా కనుమరుగవుతున్నదన్నది అక్షర సత్యం.

ఇంటర్నెట్, కంప్యూటరు, మొబైల్ ఫోన్లు, e–పుస్తకాలు మొదలైన వాటికి సంబంధించిన వ్యాపార విషయాలలో ప్రాంతీయ భాషల ప్రాధాన్యతే. ఎక్కువ అనడం అతిశయోక్తి కాదు.

ఆంగ్లభాష మనలను విద్యాపరంగా, ఆర్థికపరంగా, వ్యాపార పరంగా, సాంస్కృతికపరంగా ఎంత నష్టపరచిందో బేరీజువేసుకో వలసిన అవసరం ఉన్నది.

**5. ఆంగ్లంలోనే అంతా ఉన్నది అనుకోవడం వల్ల కలిగిన నష్టాలు**

విస్తరిస్తున్న వాణిజ్య అవసరాల దృష్ట్యా, దాదాపుగా అన్ని దేశాలూ ఇతర దేశ భాషలను నేర్చుకోవడంలో నిమగ్నమై ఉన్నాయి. కాని, మనం మాత్రం ఆంగ్లం వదలడంలేదు. ఇతర దేశాల భాషలు నేర్చుకుందామని మనం ఏ చిన్న ప్రయత్నమూ చేయడం లేదు. తత్కారణంగా మనం ఎన్నో ఆర్థిక, వాణిజ్య నష్టాలను చవిచూస్తున్నాం. ఇలాగే ఉంటే మనం ఏకాకులం కాకపోం. ప్రస్తుతం, మనకు ఆంగ్లం కన్నా చైనీస్, స్పానిష్ భాషల అవసరం చాలా ఉంది. ప్రస్తుతాన్నే మనం గుర్తించడం లేదు. భవిష్యత్తు దేవుడికెరుక. ప్రపంచ దేశాలన్నీ ఆంగ్లాన్ని వదులుకుంటుంటే మనం మాత్రం మన చదువు సంస్కృతులను ఆంగ్లానికి అప్పగిస్తున్నాం. ప్రపంచ వాణిజ్యంలో మన వాటా నిశితంగా పరిశీలించనట్లైతే మనం కోల్పోయిందేమిటో అర్థమవుతుంది. ప్రపంచ వాణిజ్యంలో మన దేశ వాటా 1950 సంవత్సరంలో 1.78 శాతమైతే, ఇప్పుడు అది 1.50 శాతానికి పడిపోయింది. ఇదే కాలంలో, భారతదేశంలో ఆంగ్లభాషా వ్యాప్తి అనేది మనకు సుస్పష్టమైన విషయమే. వాణిజ్యంలో వాటా క్షీణతలను చూస్తే, మన మేధావుల పనితనం గుడ్డెద్దు చేనులో పడ్డట్టు ఉన్నదనిపిస్తుంది. కొద్ది రోజుల క్రితం ఐక్యరాజ్య మంత్రిచే కీర్తించబడే మాన్య మంత్రివర్యులు శ్రీ శశిథరూర్ గారి కథనం... "భారతదేశ ప్రగతిలో ఆంగ్లం కీలక పాత్ర పోషించింది" అని. భాషలపై ఐ.రా.స. ప్రచురించిన పుస్తకాలను థరూర్ గారు చదివి వుంటే ఈ మాట అనేవారుకాదు.

సాంస్కృతికంగా ఆంగ్లభాష మనకు ఎంత నష్టాన్ని కలిగించిదో, కలిగిస్తున్నదో, ఎంత తక్కువగా చెప్పుకుంటే అంత మేలు. ఆంగ్ల భాషాభిమానులకు తమ భాష, సాహిత్యం, సంస్కృతి, చరిత్ర, మతం, విజ్ఞానం, కళలు, వీటిల్లో దేనితో కూడా పరిచయం లేకుండా పోతోంది.

**6. అంపశయ్యపై భాష**

ఆంగ్ల భాష కంటే ఎక్కువగా సాహిత్య చరిత్రను కలిగి ఉన్న, సుసంపన్నమైన, ప్రపంచంలో అత్యధికులు మాట్లాడే భాషలలో 10వ

స్థానాన్ని అధిష్ఠించిన, పంజాబ్ రాష్ట్ర అధికార భాషయైన పంజాబీ లాంటి భాషయే అంపశయ్యపై ఉంది. రాజ్యాంగంచేత గుర్తించబడిన ఇతర భారతీయ భాషల స్థితికూడా ఇంచుమించుగా ఇంతే. రాజ్యాంగం చేత గుర్తించబడని భాషల గురించి ఇంకెందుకు చెప్పుకోవడం. వాటిల్లో చాలా భాషలు మృత్యువునకు సమీపంలో ఉన్నాయి. నేను పాఠకులను Language Vitality and Endangerment అనే UNESCO (2003) డాక్యుమెంటును చదవవలసిందిగా సవినయంగా విజ్ఞప్తిచేస్తున్నాను. ఇంతకన్నా ఎక్కువగా నేనేమీ చెప్పదలచుకోలేదు. భారతీయ భాషలు ఏ దిశలో పయనిస్తాయో తెలుసుకోవాలంటే ఈ క్రింది కథనాలను చూడండి.

**"భాష ఎలా మరణిస్తుందంటే, ప్రజలు తమ భాషను మాట్లాడ దానికి సిగ్గుపడడం. గొప్పగా భావించబడే భాషకు దాసోహం అనడం. ఫలితంగా, తమ ముందు తరాల వారికి తమ భాషను అందివ్వలేకపోవడం, 'అది క్రమంగా అల్ప సంఖ్యాకులు మాట్లాడే భాషగా మారిపోవడం. మెల్లమెల్లగా కనుమరుగై మృత భాషగా మారిపోవడం."** (McMahon, 1994 :285", @ (Eckert, T et al, 2006)

"ప్రాంతీయ భాషలను పాఠశాలలలో నేర్పకపోవడం వల్లకూడా ఆయా భాషలు మృతభాషలుగా మారే అవకాశం ఉంది. ప్రాంతీయ భాషల మనుగడకు, వాటిని మాట్లాడే వారి సంస్కృతి పరిరక్షణకు పాఠశాలలు కీలక పాత్రను పోషిస్తాయి" @ (Eckert, T et, al, 2006)

**7. విజ్ఞప్తి**

మాతృభాషను ప్రేమిస్తూ, కేవలం మాతృభాష పునాదులపైననే భారత దేశం ప్రగతి సాధిస్తుందని విశ్వసించే ప్రతి భారతీయునికీ నాది ఒకే ఒక విన్నపం. వేల సంవత్సరాలుగా, మన మాతృభాషలలో పొదగబడిన అపారమైన జ్ఞానాన్ని మన ముందు తరాల వారికి అందించడం మన విధి. ఏమాత్రం జాగుచేసినా, ఒక తరం నష్టపోతుందని గ్రహించాలి. ※

కవిత

## మనిషికి దారెటు?

**బి.హనుమారెడ్డి,** న్యాయవాది, ఒంగోలు
సెల్ : 9440288080



**అతను**
ప్రొద్దుతో కలిసి ప్రయాణిస్తూనే ఉన్నాడు
అడవులు దాటాడు... ఎడారులు దాటాడు
జంతువుల మందలు లేళ్ళ గుంపులు పోతున్నె
ఎండెక్కింది.... వడదెబ్బ.... తట్టుకోలేకున్నాడు
నీడకోసం దాపులో మర్రిచెట్టు క్రిందకు చేరాడు
చల్లగావుంది... చీమలు కూడ చేరాయి
చెట్టుమొదట్లో చీమల పుట్ట... పగిలింది... ఎందుకో

మర్రిమీది పక్షులెగిరి పోతున్నె... ఎందుకనో
అగమ్యంగా వుంది.... నడక సాగించాడు
ఎంత నడిచినా మనిషి మత్ర తగల్లేదు
ఖాళీ ఊరుంది
కోడికూతల్లేవు... కుక్క అరుపుల్లేవు
ఆకలి... ఆకలి... ఆకులు తింటూ నడిచాడు
చిట్టడవి దాటాడు... చీకటి ప్రయాణం ఆగింది
తెల్లారింది... సూర్యుడు ప్రయాణం సాగించాడు
జనం కనిపించలేదు... ఏమయ్యారు?

లీలగా పరిసరాలు గుర్తొస్తున్నె... కాని
ఏదో మారణకాండ జరిగినట్లుంది
ఊళ్ళు ధ్వంసమైనాయి
మనుషులు... పశువులు కూడ..
బూడిద మిగిలింది
ఏం చేష్టలవి? వాదమా! అపవాదమా!
నడిచాడు..నడిచాడు..ఇంకా నడుస్తూనే ఉన్నాడు
మనిషి కనబడదు... ఇక్కడా ఒంటరే
మర్రిచెట్టు నయం... నోరూ నాలుకా లేకున్నా
తనకు చీమలకు ఆతిథ్యమిచ్చింది

ఏమిటిది? వింతగా వుంది!
ఉన్నవాడూ కనబడలేదు.... లేనివాడూ కనబడలేదు
పిచ్చెత్తింది... కేకలేస్తున్నాడు
నా వాళ్ళేమైనారు?... నా ఊళ్ళేమైనాయి?
నా దేశం ఏమైంది?
ఎవరూ పలకలేదు... ఏదీ ఆగలేదు
చీమల దారిన చీమలు పోతున్నె
పక్షుల దారిన పక్షులు పోతున్నె
సూర్యుడు దారిన సూర్యుడు పోతున్నాడు
మనిషేడి... మనిషికి దారెటు?

తెలుగునుడి కోసం

# రండి..చర్చిద్దాం...నిగ్గుతేలుద్దాం.. ముందడుగు వేద్దాం!

**తెలుగునుడి (తెలుగు భాష)ని, తెలుగు లిపిని మెరుగుపరచుకొంటూ సమకాలీన అవసరాలకు తగ్గట్టు తీర్చిదిద్దుకోవలసి ఉంది. అన్ని స్థాయిలలో తెలుగును నేర్పడంలోనూ, నేర్వడంలోనూ ఇంకా స్పష్టతను, పెంపుదలను తెచ్చుకోవలసిన అక్కర ఉంది. లోటు పాటకు, ఎదుగుదల లేకపోవడానికి కారణాలను, వాటికి పరిష్కారాలనూ చర్చించుకొని,వాటి నిగ్గుతేల్చవలసి ఉంది. ఇందుకోసమే ఈ శీర్షిక.**

**ఈ చర్చలో వచ్చే ప్రతిపాదనలను ఎవరు ముందుకు తెస్తున్నారో వారి పేరు వారి పరిచయమూ వారు కోరితే తప్ప, ప్రచురించ దలచుకోలేదు. ఎవరు ఏం చెప్పదలచుకొన్నారన్నదే ముఖ్యం. ఎక్కడా కోపతాపాలకు, వ్యక్తిగత, సంస్థాగత దూషణలకు చోటు ఇవ్వం. కొత్త ప్రతిపాదనలను తెచ్చేవారు, చర్చలో పాల్గొనే వారు అందరూ వారి పేరు, చిరునామా, ఫోన్ నెంబరు, ఇమెయిల్ చిరునామాలను తాము వ్రాసే జాబు/వ్యాసంతో పాటు తెలపాలి. వారు కోరుకొంటే తప్ప వాటిని ప్రచురించము, వెల్లడించము. కేవలం సంపాదకుని వద్దనే రహస్యంగా ఉంచుతాము. వారితో సంపాదకుడు ఉత్తర ప్రత్యుత్తరాలు జరపడానికీ, నేరుగా మాట్లాడటానికి మాత్రమే ఆ వివరాలను ఉపయోగిస్తాము.**

**ఈ నెల ఒక ప్రతిపాదనను ముందుకు తెస్తున్నాము. దీనిపై చర్చకు ఆహ్వానిస్తున్నాము. చర్చను విషయం మీదే శ్రద్ధతో నడుప గోరుతున్నాము.**

–సంపాదకుడు

**తెలుగు** అక్షరాలు 36. అవి

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అం

క గ జ చ జ ఞ ట డ ణ త ద న ప బ మ

య ర ఱ ల ళ వ స హ

తెలుగు మాటలకు కావలసిన అక్షరాలు ఇవి. వీటితో పాటు పొల్లు, గుణింతపు గుర్తులు, వత్తు గుర్తులు– ఇవి అదనంగా నేర్చుకో వలసినవి. ఇవి ఉంటే తెలుగుకు సరిపోతాయి. ఇవి గాక మరొక నుడి నుంచి మనం దిగుమతి చేసుకొన్నవి 19. అవి–

ఋ ౠ ఌ ౡ ఖ ఘ ఛ ఝ ఠ ఢ థ ధ ఫ భ శ ష క్ష ృ ః

ప్రపంచంలో ఏ నుడి అయినా మరొక నుడి నుంచి మాటలను తీసుకొంటుంది గానీ వాటి చప్పుడును(శబ్దాన్ని) తీసుకోదు. దీనికి మారుగా మనం మరొక నుడి నుంచి మాటలను ఉన్నవి ఉన్నట్లుగా తెచ్చుకొన్నాం. అది అప్పటి అక్కఱలను తీర్చుకోవడానికి తెచ్చుకొని ఉండవచ్చు. కానీ భాషాశాస్త్రం ఎంతో అభివృద్ధి చెంది, భాషా కుటుంబాల వివరం తెలిసి రెండు వందల ఏళ్ళయింది. అయినా, పట్టుబట్టి అదే పనిగా పలికితే తప్ప, తెలుగువారికి సహజంగా నోటికి రాని ధ్వనులకు చెందిన అక్షరాలను ఇంకా అట్టిపెట్టుకోవడం తెలుగుకు కీడే గానీ, మేలు కాదు. ఉదాహరణకు 'శబ్దరత్నాకరం' సంక్షిప్త ప్రతిని తీసుకొని, అందులోని మహా ప్రాణాలతో ఉన్న మాటలను లెక్కించితే అవి సుమారుగా 3800 వరకు లెక్క తేలు తాయి. ఈ 3800 లోనూ సుమారు 400 మాటలు మాత్రమే ఇప్పుడు చదువుకొన్న వారిలోను, పత్రికలలోనూ వాడుకలో ఉన్నాయి. ఇది కూడా ఒకటి రెండు శాతం వారు తప్పితే మిగిలిన తెలుగువారందరూ తెలుగు తీరులోనే పలుకుతారు. వీటిలో కూడా 350 మాటలకు వాటికి సరిపోగల తెలుగు మాటలున్నాయి. ఉదా : భార్య, పెండ్లాము, ఆలు. ఇక– మనకు తెలుగు మాటలు దొరకని 50, 60 మాత్రమే మహాప్రాణాలతో కూడిన సంస్కృతపు మాటలు న్నాయి. ఈ కొద్ది మాటల కోసం ఇన్నేళ్ళుగా నుడి పెరుగుదలకు ఎంతో నష్టం జరిగింది. తెలుగు అకాడమీని పెట్టి ఉన్నత విద్యకు అవసరమైన తెలుగు మాటలను రూపొందించుకోవలసిన అక్కఱను తీర్చే పనిలో నిఘంటువులలోని కొన్ని వందల సంస్కృతపు మాటలు పాఠ్య పుస్తకాలలోకి వచ్చాయి.

తెలుగులో 2000 వరకు క్రియావాచకాలు (పని పలుకులు) ఉన్నాయి. అయినా వాటి వాడకం రాను రాను తగ్గిపోతున్నది. ఇంచు, చేయు, పెట్టు, వేయు– వంటి కొన్ని క్రియా వాచకాలను మాత్రం ఇంగ్లీషు మాటలతో చేర్చి వాడడం బాగా అలవాటయి పోయింది. మచ్చుకు 'వర్క్' చేయు, 'రన్' చేయు, 'కుక్' చేయు. లోగడ ఇదే విధంగా అలవాటు అయిన ఉర్దూ మాటలు కొన్ని అలాగే ఉండిపోయాయి. మచ్చుకు : బనాయించు. వీటన్నిటికి సహజంగా ఉన్న తెలుగుమాటల్ని వదలివేస్తున్నాము. అట్లా వంద లాది మాటలను మనం వాడకంలోంచి చేతులారా వదలి వేస్తు న్నాము. మచ్చుకు. పని చేయు, పరుగెత్తు, వంట చేయు (వండు), మోపు. ఇలా మాటల్ని పోగొట్టుకొంటుంటే మన తెలుగునుడి చివరకు ఎలా మిగులుతుంది?

1953లో లేదా 1956లో తెలుగు రాష్ట్రం అంటూ ఒకటి మన సొంత పలుకుబడిలోకి వచ్చిన తర్వాతనైనా ఈ పనిని మొదలుపెట్టి ఉంటే బాగుండేది. ఇకనైనా మన రెండు రాష్ట్రాలలో నెలకొని ఉన్న తెలుగు పాలకులు, పండితులు, ఆలోచనాపరులు ఈ పనిని మొదలు పెట్టేందుకు పూనుకొంటే బాగుంటుంది. ❋

-డా|| అద్దంకి శ్రీనివాస్

# అచ్చంగా అచ్చ తెలుగే

తెలుగులో సాహిత్యం, వ్యాకరణం, ఛందస్సు మొదలైన వాటిలో మార్గ దేశి అనే రెండు మార్గాలున్నాయి. మార్గ గురించి పేచీ లేదుగానీ దేశి గురించి లోతుగా ఆలోచించవలసిన అవసరం ఉంది.

దేశిని ఇప్పుడు స్వదేశీయమనే అర్థంలో వాడుతున్నాం. కానీ వ్యాకరణంలో దీని కథ వేరు. వ్యాకరణాలు దేశినీ, అచ్చతెనుగునీ మొదట విడివిడిగా చూపించాయి. తరువాత అచ్చతెనుగును దేశిలో కలిపివేశాయి. ఇదిలా ఉంటే ఈ రెండు పద్ధతులలో– ఎవరికి నచ్చిన మార్గాన్ని వాళ్ళు ఎంచుకొన్నారు. చెప్పాలనుకున్నది యథేచ్ఛగా చెప్పుకున్నారు. ఇక భాషకు కూడా 'మార్గ' 'దేశి' అనే పదాలను అన్వయించుకోవాలనుకున్నప్పుడు– దేశికి ప్రతినిధిగా అచ్చతెనుగు కావ్యాలు నిలుస్తాయి.

వ్యవహారభాష, గ్రంథభాష ఎప్పుడూ వేరుగానే ఉంటాయి. తన కాలం నాటి వ్యవహార భాషకు భిన్నంగా నన్నయ ఒక భాషారీతిని (దానిని కావ్యరచనకు ప్రమాణమనుకున్నా సరే) నెలకొల్పాడు. అంతకు ముందున్న శాసనాలలో దేశి లక్షణాలున్నాయి. నన్నయ కల్పించిన రీతీ కన్పిస్తుంది. నన్నయ మార్గ కవితా లక్షణాలకు అనుగుణంగా ఉండే భాష– అంటే సంస్కృతసమాస భూయిష్ఠమయిన దానిని వాడాడు. ఈ భాషను మార్గకవిత్వానికి ఆధారభూతమయిన భాష అనవచ్చు. దీనికి భిన్నంగా అచ్చతెనుగు పదప్రయోగ బాహుళ్యంతో చేసే రచనకు ఆధారభూతమయిన భాషను దేశిగా చెప్పుకోవచ్చు. నన్నయ నుంచి అచ్చతెనుగు కావ్యాలు పుట్టేదాకా– తెలుగు సాహిత్యంలో మార్గ, దేశి పద రీతులు సమాంతరంగా కాదు గానీ హెచ్చు తగ్గులతో కన్పిస్తాయి. దేశి పద్ధతిలో సాహిత్యం మిక్కుటంగానే వచ్చినా అది మార్గతో సరితూగేంత కాదు. భాషలోనూ మార్గలక్షణాలే ఎక్కువగా కన్పిస్తాయి.

దేశిరీతిని ప్రతిబింబింపజేసే పదజాలం అంటే అచ్చతెనుగే. అంటే సంస్కృత సమేతరం. తెలుగు పదాల స్థానంలో సంస్కృత పదాలు పూర్తిగా ఆక్రమించి తెలుగు పదాల 'ఉనికి' కి ప్రమాదం ఏర్పడుతుందని భావించడమే అచ్చతెనుగు కావ్యాల ఆవిర్భావానికి నాంది.

కావ్యంలో ఏదో ఒక పద్యాన్ని అచ్చతెనుగులో రాయటమే గగనమని కవులు వాపోయిన స్థితిలో మొత్తం కావ్యాన్ని అచ్చతెలుగులో నడిపించి కైతలమొనగాళ్ళనిపించుకోవాలనే తపనా ఇందుకు కారణం కావచ్చు. ఏది ఏమైనా తెలుగు సాహిత్యంలో అచ్చతెనుగు కృతులు ఒక వైవిధ్యం, ఒక ఉద్యమం, భాషా పరిరక్షణకూ దోహదపడ్డాయని చెప్పుకోవచ్చు.

అచ్చతెనుగు కృతులు రాయడంలో కొన్ని నియమాలను కవులు కల్పించుకొన్నారు.

1. సంస్కృతసమం తప్పించి తక్కిన సంస్కృతభవ, ప్రాకృతసమ, ప్రాకృతభవ, దేశ్య పదజాలాలను ఉపయోగించుకోవచ్చు.
2. ప్రసిద్ధ సంజ్ఞలను యథాతథంగా అవి సంస్కృత సమాలైనా అలాగే వాడటం. కొన్ని సంజ్ఞలు యౌగికార్థ సాధనకు అనుకూలంగా ఉంటాయి. వాటిని అచ్చ తెనుగు తోనే చెప్పటం.
3. ఛందస్సు విషయంలో పట్టింపు లేదు. దేశి ఛందస్సునే వాడాలనే నియమం పెట్టుకోలేదు. సంస్కృత వృత్తాలు వాడుకోవచ్చు.
4. నియమంగా కాదు కానీ అప్రసిద్ధ నామవాచకాలను అచ్చతెనుగు సమాసాలలో అనువదించి ప్రయోగించారు. ఇప్పుడు 'లక్ష్మి' అనే సంజ్ఞను సిరి, లచ్చి అని వాడారు. ఇవి తద్భవాలు క్షీర సాగర పుత్రిని మాత్రం 'కడలి రాచూలి' అని అనువదించారు. 'లక్ష్మీ పరిణయం' అనే కావ్యం రాయవలసివస్తే– పేరు మాత్రం సంస్కృతంలోనే ఉంటుంది. సంజ్ఞలను మార్చలేదు.
5. కావ్యనామాలకు అచ్చ తెనుగు పులమలేదు. 'నీలాసుందరీ పరిణయము' 'అచ్చ తెనుగు రామాయణము' ఇత్యాదులు. అచ్చ తెనుగులో అనేక రచనలు చేసిన ఆదిభట్ల నారాయణదాసు పేర్లు కూడా అచ్చతెనుగులోనే పెట్టారు.
6. సంస్కృతంలో ఉన్న సమాసాలకు అచ్చంగా అచ్చతెనుగు సమాసాలను కూర్చి కావ్యాలలో ప్రయోగించారు.

ఇవన్నీ తెలుగన్నలకు పెద్దన పొన్నగంటి తెలగన్నవే. యయాతి చరిత్ర అనే అచ్చతెనుగు కావ్యంతో శ్రీకారం చుట్టాడు. ఆయన పెట్టిన నియమాలే తరువాతి వారికి శిరోధార్యాలయ్యాయి.

తెనుగునకు మారు పేళ్ళిడి
పెనచిన వినగూడ దనుచు బిరుదులు పేళ్ళున్
మును వేల్పు బాస వెంబడి
నునిచెద గాదనకుడయ్య యుల్లములందున్
(యయాతి చరిత్ర 1-14)

సంజ్ఞలను మాత్రం తత్సమపదాలనే స్వీకరిస్తానన్నాడు. అంటే దేవయాని, శర్మిష్ఠ, శుక్రుడు మొదలైన వాటిని తెలుగులోకి అనువదించలేదు. అయితే ఈ సంజ్ఞలకు నామాంతరాలుంటాయి. అవి యౌగికార్థం చెప్పటానికి వీలుగా ఉంటాయి. అటువంటి వాటిని అనువదించటం కన్పిస్తుంది. ఉదా :

అస్త్రాద్రి = క్రుంకుగుబ్బలి
సాగరమేఖ = మున్నీటి మొలనూలు మగువ
కుంభకర్ణుడు = కడవ చెవుల పోటరి
ఉచ్చైఃశ్రవం = నిక్కువీనుల జక్కి, జేజేరాచతేజి
కుంభసంభవుడు = పనటి చూలి, పరటి పుట్టువు
మైనాకుడు = గట్టుపట్టి, (గిరిసుతుడు)
చలికొండకొడుకు = (హిమగిరిసుతుడు)
పుష్పశరుడు = ననవిల్తుడు
వాయుపుత్రుడు = ఈదకొమరుడు

వృకోదరుడు = తోడేటికడుపుమేటి
జలనిధి = నీటికుప్ప
అప్పకవి 1) మఱుగు తెలుగు 2) ప్రాఁదెలుగు అనే రెండు భేదాలను చెప్పాడు.

అబ్ధిమేఖల కుదయించి నట్టి సీతఁ
జేకొనియె రాఘువుండని చెప్పుచోటఁ
గడలి మొలనూలి చేడియ గనిన పడుచుఁ
దెచ్చుకొనె రాయుఁడనఁగను దెనుఁగు మఱుఁగు (1-112)

అబ్ధి మేఖలను కడలి మొననూలి చేడియ అంటే మఱుగు తెలుగు. పైన చెప్పినవన్నీ ఇవే. అచ్చ తెనుగును ఇలా నిర్వచించాడు.

నెలకొను సంస్కృత తత్సమ
ముల దొరలక తజ్జ దేశ్యముల మూటఁను సం
ధిలి కేవలాంధ్రములు నానలరు
గృతుల నచ్చ తెనుగు లంద్రు తెలుగునన్ (1-110)

బ్రా దెనుగులను ఇలా నిర్వచించాడు.

తొల్లింటి జనవాక్యము
లెల్లను ప్రాఁదెనుగులయ్యె నిప్పటి వారల్
చెల్లుబడి నాడునవియే
దెల్లమిగానింకఁబ్రాత తెలుగులు నృహరీ (1-113)

పుడమియు సిరియును బడతులు
వెడవిలుతుడు పసిడికడుపు వేల్పును గొడుకున్
గడలి విడి మట్టు పాఁపల
నడుచు గుఱము సామి కనఁగ లెనంగుల్ (1-114)

ఈ పద్యంలో విష్ణుమూర్తికి సంబోధనగా వేసిన 'కడలి విడిమట్టు పాపల నడుచు గుఱము సామె..తద్భవాలుంటే వాటినీ ప్రయోగించటం కన్పిస్తుంది ఉదా :

విష్ణువు - వెన్నుడు
కుంతి - గొంతి
లక్ష్మణుడు - లక్కుమనుడు
శల్యుడు - సెల్లుడు
కృష్ణుడు - నల్లనయ్య

కొన్ని సమాసాలు సుదీర్ఘంగా ఉంటాయి. ఉదా :
చౌపంచములుకులు గల దంట - మన్మథుడు
పక్కిడాల్ వేల్పు పొక్కలి పసిబిడ్డ - బ్రహ్మ
జగడంపు టోరెంపు జగదారి - నారదుడు

యౌగికార్థం కుదిరితే సంజ్ఞలను కూడా అచ్చతెనుగులో చెప్పారు మన కవులు.

హిరణ్యాక్షుడు - జాళువాకంటి, పుత్తడి పొలదిండి
దశరథుడు - పది తేరుల దొర
వాల్మీకి - పుట్టపుట్టువు, బీఱియకానుపు, బొఱియచూలి

నక్షత్రాలలోని కొన్నింటిని సంజ్ఞలకు కూడా అచ్చతెనుగు కూర్పు కన్పిస్తుంది. వీటిలో వాటి ఆకృతి పొడకడుతుంది.

అశ్వని - గుఱ్ఱపు చుక్క, తొలిరిక్క
భరణి - బరణి చుక్క
కృత్తిక - మంగలకత్తిరూపు, కత్తెర, కార్తె
రోహిణి - బండిరిక్క
మృగశిర - జాబిలి రిక్క, జింకతల చుక్క
ఆర్ద్ర - పగడపు రిక్క
పునర్వసు - కుక్కచుక్క, పొదరిండ్ల చుక్క
పుష్యమి - తొండరూపు రిక్క, పొట్ల పూరిక్క
ఆశ్లేష - అసిలేరు
మఘ - జన్నపు చుక్క, పాలకీబొంగు చుక్క
పూర్వఫల్గుణి - పాముకంటిచుక్క
ఉత్తర ఫల్గుణి - ప్రొద్దురిక్క
హస్త - కైసాటిరిక్క
చిత్ర - ముత్తెపురిక్క, ముత్తెపు సవతు
స్వాతి - కరువలి రిక్క, కెంపు సవతురిక్క
విశాఖ - కుమ్మెర సారె చుక్క, చేర్టరిక్క, జోడు వేల్పు రిక్క
అనూరాధ - చెలిమి చుక్క, విశాఖకు రాధ అని పేరు, దానిని అనుసరించి వచ్చేది అనూరాధ. దీనికి అచ్చ తెలుగు సాటిరిక్క
జ్యేష్ఠ - తాటిరిక్క
మూల - సోకురిక్క



చీరాల కొత్తపేట 'సరస్వతి నిలయం'లో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం జరిగింది. విద్యార్థినులు పాడిన 'తెలుగు పతాకమా' ప్రార్థన గీతంతో మొదలైన సభలో జంపాల గంగాధరరావు, డా॥బీరం సుందరరావు, అన్నంరాజు సుబ్బారావు, సర్విశెట్టి సుబ్బరామయ్య, వెలుగు వెంకట సుబ్బారావు పాల్గొన్నారు. పాఠశాల ప్రిన్సిపాల్ కె.సుధాకరరావు అధ్యక్షత వహించి ఈ కార్యక్రమాలను నిర్వహించారు.

కవిత

## మార్కెట్ భాష అవసరమా?

సదాశివుని శంకరరావు, శ్రీకాకుళం
సెల్ : 99599 70652

**చె**దలు పట్టేశాయి
తెలుగు అక్షరాలకు
'మమ్మీ' అయిపోయింది
అన్నం పెట్టే 'అమ్మ'
అంబలి సిగ్గయింది
రాగి మాల్ట్ హోష్ అయ్యింది
గ్రహణం పట్టింది
తెలుగు వెన్నెల అక్షరాలకు
అధికారం చెలాయిస్తుంది
మార్కెట్ భాష విశృంఖలంగా
పరభాషా వ్యామోహపు
చదువుల వేలంవెర్రిలో
నలిగిపోతుంది 'అమ్మభాష'
ఛాందసాలైనాయా తెలుగు ఛందస్సులు!
వేమన మన యుగధారేగా?
జాషువాను కాదనగలమా?
రూపం కాదు ప్రధానం



సారంలో మన తెలుగేమిటి?
పాల్కురికి-నాచన్న
తిక్కన్న - అన్నమయ్య
మధ్యలో చిన్నయ్య
పానకంలో పుడక
తప్పదు కదా గిడుగు నడక!
వాటేసుకుంటున్నాయి
ఆంగ్ల ముద్దు ముద్దు మాటలు
భాషపై పడమటి వికృతదాడి
సాంస్కృతిక విలువల నాశనమే!
మసకబారుతున్న జీవభాషకు
ఎలివేదిక 'రాజముద్ర'
విముక్తి కలిగించాలి 'సృజనశీలి'ని
మార్కెట్‌భాషా సంకెళ్ళ నుండి
అమలు చేయాలి సంకల్పబలంతో
ప్రజల భాషలోనే విద్య!
ప్రజల భాషలోనే పాలన!!

పూర్వాషాఢ – తాలునీటిరిక్క, నీటిరిక్క
ఉత్తరాషాఢ – ఏచకంకటిచుక్క
శ్రవణము – కటివేల్పురిక్క, తూపురిక్క
ధనిష్ఠ – మద్దెలరూపురిక్క
శతభిషము – నీటిఱేనిరిక్క
పూర్వభాద్రపద – ఎనిమిది కాళ్ళ చుక్క
ఉత్తరభాద్రపద – ముక్కంటి చుక్క
రేవతి – కడచుక్క, కొనరిక్క, మీనురూపురిక్క, ముప్పదిరెంటి గుంపు
అభిచ్ఛిన్ననక్షత్రము – కానరాని చుక్క, బొమ్మ చుక్క

బడేబీబీని లక్ష్మీదేవితో పోలుస్తూ తెలగన్న తుంట విల్తు తల్లి = లక్ష్మి అన్నాడు. బ్రహ్మగారినీ తమ్మి పూవింట నెలకొన్న దంట (1-43) అన్నాడు. ఇల కొత్త కొత్త సమాసాలను కూర్చుకొంటూపోతే – అర్థం కావటం ఎంతో కష్టం. ఇలా రాయటం ప్రతిభా ప్రదర్శనంగానూ కవులు భావించేవారట. తమ కృతుల్లో పనిగట్టుకొని ఒక్క అచ్చతెనుగు పద్యమైనా రాసేవారు. ఈ విషయాన్నే తెలగన్న ఇలా అంటున్నాడు.

అచ్చతెనుంగు బద్దె మొకటైనను గబ్బముతోన నుండినన్
హెచ్చని యాడు చుందురది యెన్నుచు నేర్పున బొత్త మెల్ల ని
ట్ల చ్చ తెనుంగుగనన్నొడువ నందుల చందమెరుంగువారినిన్
మెచ్చురొ యబ్బురం బనరొ మేలనరో కొనియాడరో నినున్ (1-12)

పొన్నగంటి తెలగన్న అచ్చతెనుగు కృతి రాయడానికి ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులే కారణమన్నారు ఆరుద్రగారు. (స. ఆం. సా. 6-74) తెలగన్న గోల్కొండ ప్రాంతంవాడు మల్కిభరాముడి ఇలాకా అది. మల్కిభరాముడికి అచ్చతెనుగంటే పిచ్చి.

"He (Ibrahim Qutb Shah) appears to have preferred a pure Telugu Direction (Acca Telugu or Acca Tenugu) rather than the highly Sanskritized mixed language or the day"- Suneet Kumar Chatterji in Languages and Literatures or Modern India (p.281)

అది నిజమే కావచ్చు. మల్కిభరాముడిలానే అచ్చతెనుగు మెచ్చుకొనే అమీరుఖాను ఆహ్వానంపై ఈ కృతి తెలగన్న నిర్మించనూ వచ్చు. కానీ ఇదే ప్రధాన ప్రేరణ కాదు. కవి ఏ రచనైనా స్వీయ ప్రేరణ, ఆసక్తి, ఉద్దిష్ట అధికారి లేకుండా రాయడు.

కవిత్వం చదివి రాజులో ప్రజలో మెచ్చుకోవాలనుకోవటం ఉంటుంది కానీ మెప్పు కోసమే కవిత్వం రాయటం అంటే అది సదాశయంకల కవిత్వం అనిపించుకోదు. ఆ కవి కాలక్షేపపు కవి అవుతాడు తప్ప నిబద్ధత ఉన్న కవి కాడు.

రాజరాజ నరేంద్రుడి అభిరుచి నన్నయకు ప్రోత్సాహమందించ వచ్చు గానీ స్వీయలక్ష్యాలు లేకుండా నన్నయ రాయలేదు. 'ఆంధ్రావళి మోదముం బారయ' అని తనకు తాను ఈ లక్ష్యం ఏర్పరచుకొన్నాడు. అలాగే అచ్చతెనుగు కృతులకూ ఒక నేపథ్యం ఉంది.

అచ్చతెనుగు పదప్రయోగాలు కనుమరుగయ్యే ప్రమాదముందని గుర్తించటమూ, ఆ లోటును భర్తీ చేయాలనే తలపూ అచ్చతెనుగు కావ్యాలు రావడానికి కారణాలు. ❊

రచయిత సెల్ : 98488 81838

-సంకేపల్లి నాగేంద్రశర్మ

# విశాల తెలుగు సాంస్కృతిక వారసత్వం తెలంగాణ ప్రాంత ప్రత్యేకం- సమ్మక్క సారలమ్మ వనజాతర



వరంగల్లు జిల్లా మేడారం సమ్మక్క-సారలమ్మ వన జాతర ఆదివాసీ సంస్కృతిని గౌరవించే విధంగా ప్రకృతిని ఆరాధించే జాతరగా ప్రసిద్ధి చెందింది. గద్దెలపై కేవలం వెదురుకర్రలు, కుంకుమ భరిణలను పూజించే ఆచారం ఇక్కడ విశేషం. రెండేళ్ళ కొకసారి జరిగే ఈ నాలుగు రోజుల జాతరను ముఖ్యమంత్రి కేసీఆర్, మంత్రులు, అధికారులు ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించారు. ఈ ఏడాది సమ్మక్క- సారలమ్మ గద్దెలను గ్రానైట్ పలకల వంటి హంగులతో తీర్చిదిద్దారు. ఈ జాతర గిరిజన ఆచారాలు, సాంప్రదాయాలతో రాష్ట్ర ప్రభుత్వం ఆధ్వర్యంలో అధికారికంగా జరుపబడుతుందని రాష్ట్ర దేవాదాయశాఖామంత్రి ఇంద్రకరణ్‌రెడ్డి తెలిపారు. ఆయన ఈ ఉత్సవాలకు హాజరై వన దేవతల గద్దెల ప్రవేశ కార్యక్రమంలో పాల్గొని పూజలు జరిపారు. ఈ ఏడాది ఫిబ్రవరి 17వ తేదీ నుండి 20వ తేదీ వరకు సాగిన ఈ జాతరకు సుమారు 1 కోటి 40 లక్షల మంది భక్తులు తరలి వచ్చినట్లు అంచనా.

కోయల డోలీ వాయిద్యాలు, నెమలీకల అలంకరణలు, కోళ్ళతో ఎదుర్కోళ్ళు, జంపన్నవాగులో పవిత్రస్నానాలు, శివసత్తుల పార వశ్యం, పసుపు కుంకుమ, కొబ్బరికాయలు, కోడి, గొర్రె, నిలువెత్తు బంగారం (బెల్లం), తలనీలాలు వంటి మొక్కుబడులు సమర్పణలతో సమ్మక్క- సారలమ్మ, గోవిందరాజు, పగిడి గిద్దెల రాజులను భక్తులు భక్తిశ్రద్ధలతో కొలిచారు. రెండు తెలుగు రాష్ట్రాల నుండే కాకుండా ఛత్తీస్‌ఘడ్, కర్నాటక, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ తదితర రాష్ట్రాల నుంచి భక్తులు పెద్దఎత్తున తరలివచ్చారు.

గిరిజనుల కర్రాలు, యాత్రికుల వాహనాలు, షామియానాలు, గుడారాలతో దట్టమైన ఆ ఆరణ్యప్రాంతం జనారణ్యంగా మారింది. దేవాదాయశాఖ ఏర్పాటు చేసిన క్యూలైన్లలో గంటల కొద్దీ నిలబడి భక్తులు తమ మొక్కులు తీర్చుకున్నారు. ఈ జాతర ముగిసిన తర్వాత కర్రలు, బురద, బంగారం (బెల్లం) పేరుకు పోయిన చెత్తాచెదారా లను శుభ్రం చేసే పనుల్లో రాజమహేంద్రవరం (రాజమండ్రి) నుండి వచ్చిన 270 మంది పారిశుద్ధ్య కార్మికులు పాల్గొన్నారు.

మాఘమాసం అంటేనే తెలంగాణలో పల్లెపల్లెన స్థానిక జాత రలు వెల్లువెత్తుతాయి. జనవరి 3న కొమురవెల్లి మల్లన్న, పట్నాలు, జాతర, కళ్యాణంతో ముగుస్తుంది. అదిలాబాద్ జిల్లా నాగోబా గిరి జన జాతర. నల్లగొండ జిల్లా చెరువుగట్టు జడల సంగమేశ్వరాలయం జాతరలు వైభవంగా ముగిశాయి. రెండేళ్ళకొకసారి జరిగే ఈ సమ్మక్క-సారలమ్మ జాతరను కేంద్ర ప్రభుత్వం జాతీయజాతరగా ప్రకటించి, సకల సదుపాయాలు కలుగజేయాలని కేంద్రమంత్రి బండారు దత్తాత్రేయ, ముఖ్యమంత్రి కేసీఆర్, మంత్రులు, అధి కారులు విజ్ఞప్తి చేశారు.

ఈ జాతరను శాశ్వత ప్రతిపాదిక జాతర సమయంలోనే కాకుండా ఏడాది పొడవునా జరపడానికి రాష్ట్ర ప్రభుత్వం తగు సౌకర్యాలను కల్పించనుందని రాష్ట్ర గిరిజన సంక్షేమ, పర్యాటక, సాంస్కృతిక శాఖల మంత్రి అజ్మీరా చందూలాల్ ప్రకటించారు.

ఈ జాతరను సందర్శించిన వారిలో రాష్ట్ర ఉపముఖ్యమంత్రి కడియం శ్రీహరి, అసెంబ్లీ స్పీకర్ మధుసూదనాచారి, డిప్యూటీ స్పీకర్ పద్మా దేవేందర్ రెడ్డి, మంత్రులు, ఎంపీలు, ఎమ్మెల్యేలు, వరంగల్లు జిల్లా కలెక్టర్ వాకాటి కరుణ, ఐజీ నవీన్‌చంద్, డీఐజీ, రూరల్ ఎస్పీ, అధికారులు తదితరులు పాల్గొని అమ్మవార్లను పూజిం చారు. ఈ జాతరలో ముఖ్యమంత్రి కేసీఆర్ మాత్రం అనారోగ్య కారణం వల్ల పాల్గొనలేకపోయారు.

జాతీయ గుర్తింపు రావాలని కేంద్ర ప్రభుత్వంపై వత్తిడి తెచ్చి, ప్రత్యేక నిధులు తెస్తామని చెప్పిన తెలంగాణ ప్రభుత్వం ఈ జాతరకు కనీసంగా ఒక్కరోజయినా సెలవు దినంగా ప్రకటించకపోవడాన్ని ఉద్యోగ వర్గాలు తీవ్రంగా నిరసించాయి. గోదావరి పుష్కరాల సమయంలో తెలంగాణ ప్రభుత్వం ఒక్కరోజయినా సెలవు ఇవ్వలేదు. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గోదావరి పుష్కరాల సమయంలో ఒకరోజు సెలవు దినం ప్రకటించింది.

తెలుగునేలమీద తెలంగాణ ప్రాంతంలో గిరిజన సంస్కృతికి, తెలంగాణ వారసత్వ జనజీవన సంప్రదాయాలకు అద్దం పట్టిన ఒక పండుగ-సమ్మక్క సారలమ్మ వనజాతర.

తెలంగాణ రాష్ట్రం ఏర్పడిన తర్వాత రాష్ట్ర ప్రభుత్వం ఈ జాతరను ప్రతిష్ఠాత్మకంగా నిర్వహించాలని తలపెట్టింది. 2016 ఫిబ్రవరి 17 నుండి 20 వరకు జరిగిన జాతర తెలంగాణ మొత్తానికీ గర్వకారణమయింది.

*రచయిత సెల్ : 94417 97650*

కవిత

## బతుకు పొత్తం

**కత్తి పద్మారావు,** పొన్నూరు
సెల్ : 98497 41695

ఆ కోళ్ళు కాలుదువ్వుతున్నాయి
కత్తులతో చీరిన ఆ వళ్లు నెత్తురునోడుస్తున్నది
గెలిచినవాడు పాముపడగలా విచ్చుకొని చిందులేస్తున్నాడు
పండగకు పాడిపంటలు ఉండక్కరలేదు
అప్పు చేసైనా అదొక రుస
చేసుకొనే వాడికి రోజూ పండగే
ఆ మామిడితోట పిందెలదగ్గరే మొరాయించింది
ఆ సరిగ ఏపుగా ఎదిగినా
సన్నని ఆకులు రెమ్మలు రాలిపోతున్నాయి
ఇసుక పొరల్లో నీటిబుగ్గలు లేవు
ఆ జీడిమామిడి తోటలో పక్షులగుంపులు ఇప్పుడు లేవు
కుందేరులో జమ్ము ఎండిపోయింది
ఆ కుర్రదూడ తొలి ఈతలో పెందలాడే 'తరిపి'కి వచ్చింది
అది పచ్చనిగడ్డి కొరికి ఎన్నాళ్ళయ్యిందో
వేరుశెనగవిత్తనాలకు పురుగుపట్టింది
బెల్లంకలిపిన ఉండ అంగిలికానడంలేదు
చెట్టుపండు కాయ ఇప్పుడరుదు
అన్నీ కావేసిన కాయలే
పేగులు చిల్లులు పడుతున్నాయి
ఆబాలెంతరాలికి కనురెప్పలు లేపితే
నెత్తుటి బొట్టులేదు, కాలిలో ముల్లిరిగింది
ముల్లుపీకితే దానిమొన తెల్లగానే వుంది
ఎరుపు కనిపించలేదు
ఆమె కాళ్ళ అడుగులలో
బీడునెలలు పండి వరిగాయి
ఆమె ఎండిన తాటి బుర్రలా ఒట్టిపోయింది
తాటిమట్టలాగిడసబారింది
ఆమె జుట్టుకు నూనెలేదు
రెపరెపలాడుతున్నాయి
ఎండిన దారాల్లా అవి రెపరెపలాడుతున్నాయి
ఆ గుడ్డివాడు దుడ్డుకర్రను పట్టుకు తిరుగుతున్నాడు
ఆ రోడ్లన్నీ తెగబలిసిన కుక్కలు
వెదురు బొంగులనుండి వస్తున్న
సన్నని సడి ఇప్పుడు లేదు
ఆ చెత్తలో ఉడికిన కుడుములు
బెల్లం, పిండి, కొబ్బరితో నిగ నిగలాడుతున్నాయి
నా నోటిని తీపిచేసిన పెద్దమ్మ కళ్ళల్లో వెలుగుజల్లు
ఆ జోరులో ఉడికిన సగ్గుబియ్యం
ముత్యాల్లా తేలుతున్నాయి
కొబ్బరితురుముతో అదిచిక్కబడింది
మా వాడలో చిరునవ్వుల వెన్నెల్లు
చీకటిలోనూ మెరుస్తాయి
కన్నీరేకాదు, కళ్ళలోనచ్చత్రాలూ
బతుకులో దొంతరలే

రోకటిలో పోటువేస్తున్నప్పుడు
ఆ రోటిలో ఒక అలజడి
ఎప్పుడో చేసుకొనే పిండివంటలో
గుంపు సందడులున్నాయి
బతుకంటే చిన్నపొత్తం
గుస గుసలు, రుసరుసలు అన్నీవుంటాయి
పూతరేకుల్లోవున్న తీపి
వేపపూతలోని చేదు
రాగిపిండిలోని బిగువు
టేకు చెట్టులోవున్న సొగసు
జాజివువ్వులో తెలుపు
అన్నీ పెనవేసుకొనివుంటాయి
మొక్కజొన్న కండెను
మునిపంటితో కొరుకుతున్న వయలు
వంకాయ కూరలో దనియాల పొడికలిపిన మదుపు
నిజమే-బతుకు పొత్తంలో వుంటాయి.

–మధురాంతకం నరేంద్ర

# అనువాదాలు అత్యవసరాలు

ప్రపంచంలో చాలా భాషలున్నాయి. వాటిలో చాలా భాషలకు వాటివయిన సాహిత్యాలూ వున్నాయి. ఏ భాషయినా మరే యితర భాషల ప్రభావంలోనూ పడకుండా, స్వతంత్రంగా వుండడమన్నది అసాధ్యం. కానీ ప్రతిభాషా తనదైన విశిష్టతలను పదిలపరచుకోవటానికి అవసరమైన కృషి చేస్తూనే వుండాలి. ప్రతి భాషా సాహిత్యమూ ఇతర సాహిత్యాలలో వుండే విశిష్టతలను నేర్చుకోవటానికి ప్రయత్నిస్తూనే వుండాలి. అందుకు అనువాదాలు చేసుకుంటూ సాగడమే అవసరం.

తెలుగుసాహిత్యం అనువాదాలతోనే ప్రారంభమయింది. తెలుగు వారి మహాభారత ఆంధ్రీకరణం గొప్ప అద్భుతం. అనువాదమన్నది యెంత గొప్పగా, మహత్తరంగా రూపొందవచ్చో నిరూపించిన సందర్భ మది. సంస్కృత భారతానికి ధీటుగా, అత్యుక్తి అనుకోకపోతే, మూల గ్రంథం కంటే గొప్పగా, అనువాదానికి అనుసృజనకూ మధ్య వుండే సరిహద్దుల్ని చెరిపేసినట్టుగా తెలుగు మహాభారతం రూపొందింది. మహాభారతానికీ తెలుగువారికీ వున్నంత గాఢమైన అనుబంధం మరే యితర భాషలవాళ్లకూ లేదు. బహుశా యితరులకు తెలుగువాళ్ల కున్నంత గొప్ప మహాభారతం లేకపోవడమే కారణంగావచ్చు. ప్రాచీన తెలుగు సాహిత్యంలో ఎక్కువ భాగం అనువాదాలే!

ఆధునిక తెలుగు సాహిత్య నిర్మాతలు ప్రాచీన తెలుగు, సంస్కృత సాహిత్యాలలో పాండిత్యాన్ని సంపాదించుకోవడంతో బాటు ఆధునిక పాశ్చాత్య సాహిత్యపు వివిధ ప్రక్రియలనూ అధ్యయనం చేశారు. తెలుగు కథానిక, నవలలపైన పాశ్చాత్య ప్రభావం ప్రస్ఫుటంగా కనబడుతుంది. 1940–70 ప్రాంతాల్లో తెలుగులోని పాశ్చాత్య నవలలూ, కథల్ని అనువదించడమన్న పని పెద్ద ఉద్యమంలా కొనసాగింది. విజయ వాడకు చెందిన ఆంధ్రగ్రంథమాల, విశ్వసాహిత్యమాల సంస్థలు అటు వంటి అనువాదాలను చాలా ప్రచురించాయి. సూరంపూడి సీతారాం గారు అనువాదం చేసిన 'విక్టర్ హ్యూగో ఘంటారావం', అలెగ్జాండర్ డ్యూమాస్ "కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టో" మూలవిధేయంగానే వుంటూ, అచ్చమైన తెలుగు నుడికారంతో అనువాదాలకే గీటురాళ్లుగా రూపొం దాయి. రెంటాల గోపాలకృష్ణగారు అనేక అనువాదాలు చేశారు. ఇటీ వల ఆయన అనువాదం చేసిన కుప్రిన్ నవల "యమకూపం" (యామా దిపిట్) మలిముద్రణ వచ్చింది. తెన్నేటి సూరి అనువదించిన చార్లెస్ డికెన్స్ 'రెండు మహానగరాలు' చాలాసార్లు పునర్ముద్రణయ్యింది. నండూరి రామమోహన్‌రావుగారు మార్క్‌ట్వయిన్ నవలలు 'టామ్ సాయర్' 'హకుల్‌బెరీఫిన్' 'రాజు పేద', 'విచిత్రవ్యక్తి'లను అనువదించారు.

మాస్కోకు చెందిన రాదుగ, ప్రగతి ప్రచురణాలయాలు రష్యన్ గ్రంథాలనంతా అనువాదం చేయించి, అందంగా ప్రచురించి, తక్కువ ధరలకే పాఠకులకు అందుబాటులోకి తీసుకొచ్చారు. టాల్‌స్టాయ్, దాస్తోవిస్కీ, తుర్గెనేవ్, కుప్రిన్, గోర్కీ, పుష్కిన్ వంటి వారి రచనలనంతా తెలుగువాళ్లు అప్పుడే చదువుకోగలిగారు. ఆర్వీఆర్ అనే పేరుతో ప్రసిద్ధుడైన ఆర్.వెంకటేశ్వరరావుగారు 100కు పైగా అనువాదాలు చేశారు. రాచమల్లు రామచంద్రారెడ్డి, ఉప్పల లక్ష్మణరావు గూతా చాలా రష్యను పుస్తకాలను అనువదించారు.

శరత్‌బాబు నవలలన్నింటినీ అనువాదం చేసి, దేశీ ప్రచురణల పేరుతో వరసగా ప్రచురించిన బొందలపాటి శివరామకృష్ణకు తెలుగువాళ్లంతా రుణపడిపోయారు. కె.వి.రమణారెడ్డి, బెజవాడ గోపాలరెడ్డి గూడా రవీంద్రుడి రచనలను తెలుగీకరించారు. ఇదంతా అలవోకగా, జ్ఞాపకం చేసుకుంటే గుర్తుకొచ్చిన కొన్ని అనువాదాలు మాత్రమే! అయిదారు సంవత్సరాలక్రితం ప్రముఖ కథకుడు జాన్‌సన్ చోరగుడి "ఈ పాత సాఫ్ట్‌వేర్ పనికొస్తుంది" అనే మంచి కథ రాశారు. అందులో 1940 ప్రాంతాల్లో విజయవాడలో గద్దెలింగయ్య గారు ఆంధ్ర గ్రంథమాల కోసం గోర్కీ నవల "అమ్మ"ను ఎంత కష్టపడి ప్రచురించారో అద్భుతంగా వివరించారు. అప్పట్లో ఆ నవలను ప్రభుత్వం బహిష్కరించడంతో, రహస్యంగా ఫారం తర్వాత ఫారం ముద్రించి, పడవలో దూరప్రాంతపు రేవుకు పంపి, అక్కడ పుస్తకంగా కుట్టి ప్రచురిం చారట! కానీ కొన్ని రోజుల్లో ప్రచురించిన వెయ్యి ప్రతులూ అమ్ముడయి పోయాయట!

ఈ అనువాదాలను అధ్యయనం చేసినందుకే, తెలుగుకథానిక, నవల, తన తొలిరోజుల్లోనే ప్రపంచ స్థాయిని అందుకోగలిగాయి. దీపధారులైన తొలినాటి తెలుగు రచయితలు పాశ్చాత్య శిల్పరీతుల్ని నేర్చుకోవడంతో బాటూ తమదైన ప్రాంతీయ శిల్పరీతుల్ని పాశ్చాత్య ప్రక్రియలను నేర్పారు. గొప్ప తెలుగు సాహిత్యాన్ని సృష్టించారు. అయితే 1980 నుంచీ యీ అద్భుతకృషికి అంతరాయం వచ్చింది. క్రమంగా అనువాదాల సంఖ్య తగ్గిపోతూ వస్తోంది. ప్రభుత్వ సంస్థలయిన కేంద్ర సాహిత్య అకాడమీ, నేషనల్ బుక్‌ట్రస్టూ, కేవలం భారతీయ భాషల నుంచి మాత్రమే అనువాదాలు చేస్తున్నాయి. ఇటీవల కాలంలో నేషనల్ బుక్‌ట్రస్టు నామమాత్రంగా అనువాదాలు చేస్తోంది. పాత అనువాదాల ప్రతులన్నీ పాతబడి, చిరిగిపోయి, మాయమైపోయే ప్రమాదం ముంచు కొచ్చింది. అంతగొప్ప పుస్తకాలను మళ్లీ ప్రచురించడం గూడా సాహస కార్యమైపోయి, ప్రచురణ కర్తలెవరూ అందుకు పూనుకోవడంలేదు. 1992 ప్రాంతంలో రష్యాలో కమ్యూనిష్టు ప్రభుత్వం పతనమైపోయాక, మాస్కో ప్రచురణ సంస్థలన్నీ మూతబడిపోయాయి. సరైన ప్రోత్సాహం లేకపోవడంతో అనువాదకులు గూడా క్రమంగా తగ్గిపోయారు.

ఇప్పుడెవరైనా ఆ పాత అనువాదాలు కావాలంటే, విజయవాడ కెళ్లి అక్కడి పాత పుస్తకాల అంగళ్ళను గాలించాల్సిందే. కొన్ని విలువైన అనువాదాలు కాలగర్భంలో కలిసిపోతున్నాయి. వాటిని మళ్లీ అనువ దించుకోవడం అంత సులభం కాదు. జరిగిన అనువాదాలనైనా పరి రక్షించుకోవాల్సిన అవసరమెంతో వుంది. ఇటువంటి విపత్కర పరి స్థితిలో, అనిల్ బత్తుల అనే సాహిత్య ప్రేమికుడు, ఐటీ ఇంజనీరు ఆ పాత పుస్తకాలను పిడియఫ్ చేసి పదిల పరచడమనే కొత్త ప్రక్రియను ప్రారంభించాడు. పుస్తకాలను పూర్తిగా స్కాన్ చేసి ఇంటర్‌నెట్‌లో వుంచితే, ఎవరైనా చదువుకోడానికి వీలవుతుంది. కావాల్సిన వాళ్ళు

ఆ పుటల్ని అలాగే ప్రింటు చేసుకొని కూడా చదువుకోవచ్చు. మళ్లీ ఎప్పుడైనా పుస్తకాలను పట్టించుకొనే మంచికాలమొకటి వస్తే, అప్పుడు వాటిని మళ్ళీ పునర్ముద్రణ చేసుకోవచ్చు. వీటిని ఈమెయిల్ ద్వారా ఎవరికైనా పంపవచ్చు. ఇంతవరకూ దొరికిన అమూల్యమైన అనువాదాలనంతా అనిల్ ఈ రీతిలో పదిలపరుస్తూ వస్తున్నాడు.

తల్లి భాషపైన మాకూ మమకారముందని గొంతులు చించుకున్నంత మాత్రాన వొరిగేమీ వుండదు. మన పొరుగు వాళ్ళయిన తమిళ, కన్నడ, మలయాళ సోదరులనుంచీ మనం నేర్చుకోవలసినదెంతో వుంది. అయిదారేళ్ళ క్రితం నేను కేరళలో ప్రతి సంవత్సరమూ వేడుకగా జరిగే మలయాళ ఆదికవి తుంబన్ కవి పేరుతో త్రిసూర్‌లో జరిగిన ఉత్సవాలకు వెళ్ళాను. ఆ సందర్భంగా అక్కడో పాతిక పుస్తకాల అంగళ్ళు వెలిశాయి. ఆ పుస్తకాల అంగళ్ళలో షేక్స్పియర్ నుంచీ బెకెట్ వరకు, డికెన్స్ నుంచీ మార్క్వెజ్ వరకూ, పాశ్చాత్య సాహిత్యంలో వుండే గొప్ప రచనలన్నింటికీ మలయాళ అనువాదాలను చూశాను. అక్కడికొచ్చిన ప్రతివ్యక్తీ సంచులకొద్దీ పుస్తకాలు కొని తీసుకెళ్ళాడు. అంగళ్ళవాళ్ళు మళ్ళీ మళ్ళీ పుస్తకాలు తీసుకురావలసి వచ్చింది. సమకాలీన సాహిత్యమే స్థాయిలో వుందో తెలుసుకున్నాకగానీ, మనం ప్రయాణం చేయవలసిన దూరమెంతుందో గ్రహించలేం.

ఇటీవల ప్రముఖ శాస్త్రీయ పాత్రికేయుడు, భాషాభిమానీ నాగసూరి వేణుగోపాల్ గారు విద్వాన్ విశ్వం గారిని గురించి రాస్తూ ఆయన జాన్‌స్టెయిన్ బెక్ రాసిన నవలిక 'ది మూన్ యీజ్ డవున్' ను 'దురాక్రమణ' అనే పేరుతో అనువాదం చేశారని పేర్కొన్నారు. వెంటనే నేను ఫోను చేసి అడిగితే నాకు దాని జిరాక్సు ప్రతిని పంపారు.

జాన్‌స్టెయిన్ బెక్ చాలా అరుదైన గొప్ప రచయిత. 'దురాక్రమణ' అన్న నవలిక సామ్రాజ్యవాదాన్ని నిరసిస్తూ రాసిన గొప్ప రచన. విదేశాలను ఆక్రమించుకున్న పరిపాలకులు, విదేశంలో నివసించిన తర్వాత తమ విజయానికీ, ఆ దేశ ప్రజల అపజయానికీ తేడా లేదని అర్థం చేసుకుంటారు. 'బంక కాగితాన్ని గెలిచామనుకుని దానికి అతుక్కుపోయిన యీగల్లా తయారయింది మన పరిస్థితి' అని చేతులు కాలిన తర్వాత గ్రహిస్తారు. క్షణం క్షణం భయపడుతూ అందరినీ అనుమానిస్తూ విదేశీ గడ్డపైన జీవించడం కంటే ప్రమాదమైన పని మరొకటి వుండదని తెలుసుకుంటారు. 'దురాక్రమణ' అన్నది దుర్మార్గం మాత్రమే కాకుండా ప్రమాదకరం కూడా అని ఈ నవల హెచ్చరిస్తుంది.

ఈ నవలను 1943లోనే విద్వాన్ విశ్వం గారు అనువాదం చేశారు. అప్పుడు మనం విదేశీ పాలనలో వున్నామని జ్ఞాపకం చేసుకోవాలి. ఈ పుస్తకాన్ని ప్రచురించిన వారు అనంతపురం నవ్యసాహిత్యమాల ప్రచురణకర్తలు. ఇందులో ప్రచురించిన తమ పుస్తకాల జాబితాలో 19 అనువాద గ్రంథాలుండటం ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది. విద్వాన్ విశ్వంగారి పుస్తకంలో లెక్కలేనన్ని అనంతపురం మాటలు వాడారు. మాండలిక రచనలకున్న విశిష్టతను విశ్వంగారు యెంత ముందుగా గుర్తించారో గమనించాలి. ఆయన వాడిన కొన్ని మాటల్ని చదవండి.

| పుస్తకంలో వాడిన మాట | అర్థం |
|---|---|
| అనూక్తి | -అనువాదం |
| ముక్కాలు | -ముప్పావు ( 3/4 |
| కడాకు | -చివరికి |
| ఆతట్టు | -ఆ వైపు |
| గాలిగొడుగుల సేన | -పారాచూట్ ఆర్మీ |
| కొట్టిడీలమేడ | -అంతస్థుల మేడ |
| మెత్తలు | -కుషన్లు |
| నూకుతారు | -తోస్తారు |
| తోలట్టపుస్తకం | -స్కిన్ కవర్ బుక్ |
| వురువులు | -వస్తువులు |
| ఇన్నూట యాభై | -రెండు వందలా యాభై |
| అదురు | -భయం |
| పూరా | -పూర్తిగా |
| దొడ్డిగుమ్మం | -పెరటిగుమ్మం |
| ఉడుకునీళ్ళు | -వేడినీళ్ళు |
| లోదొడ్డి | -పెరడు |
| లెక్కాచారం | -పద్ధతి ప్రకారం |
| కూటకం | -కూడిక |
| కండ్లామూసి | -దాగుడుమూతలు |
| చెండాట | -ఆట్లాట |
| పొట్టిబారీసు | -గౌను |
| మబ్బు | -చీకటి |
| పెనగాలు | -కాలుపైన చాలు |
| కడాకు | -చివరకు |
| చిల్లరంగడి | -కిరాణాకొట్టు |
| భోజనబ్బల్ల | -డైనింగ్ టేబుల్ |
| యాడికి | -ఎక్కడికి |
| తలవరులు | -నాయకులు |
| మజ్జు | -మత్తు |
| బిఱ్ఱుగా | -గట్టిగా |
| పారాడడం | -నడవడం |
| సారిసారికీ | -ప్రతిసారీ |
| దప్పంకోట్లు | -లాంగ్ కోట్లు |
| పడసాల | -వరండా |
| గబ్బునూనె | -కిరసనాయిలు |
| ఊగుడుకుర్చీ | -ఈజీ చెయిర్ |
| పురసత్తు | -శక్తి |
| మేడకూటం | -హాలు |

19వ శతాబ్ది చివరలో రష్యాలో టాల్‌స్టాయ్, డాస్టోవిస్కీ రచనలు చేస్తున్న రోజుల్లో ఇంగ్లాండులో కాన్‌స్టెన్స్ గార్నట్ అనే అనువాదకురాలు వుండేవారు. ఆమె వాళ్ళ రచనలను వెంట వెంటనే ఇంగ్లీషులోకి అనువాదం చేసేవారు. ఆమె అనువాదాలే లేకుంటే 20వ శతాబ్దపు ప్రపంచ సాహిత్య మిప్పుడున్న స్థితిలో వుండే అవకాశమే లేదు. 1940-60 ప్రాంతాల్లో తెలుగు అనువాదకులు చేసిన కృషి కూడా అంత గొప్పదే. ఆ అనువాదాలే లేకుంటే మనకింతమంది గొప్ప రచయితలుండే వారు కాదు. మన సాహిత్యమింత విశిష్టస్థాయిలో వుండేదే కాదు. మానవజాతి సాహిత్యమంతా వొక్కటే. అది వివిధ ప్రాంతాల్లో వివిధ భాషల్లో వ్యక్తీకరించబడుతూ వుంటుంది. మాతృభాషాభివృద్ధికీ, మన సాహిత్యాభివృద్ధికీ అనువాదాల అవసరమెంతో వుంటుంది.

రచయిత ఫోన్ : 98662 43659

-కాకర్ల హనుమంతరావు

# రాయగడ జిల్లాలో మసకబారిన తెలుగు చదువుల వెలుగులు

**ఆం**ధ్రప్రదేశ్‌కి అత్యంత దగ్గర రాష్ట్రంగా ఉంది ఒడిశా. 30 జిల్లాలున్నాయి. వీటిలో రాయగడ జిల్లా తెలుగు భాషీయులున్న ప్రముఖ ప్రాంతం. గంజాం, గజపతి, కొరాపుట్, ఖుర్దా, కటక్, భువనేశ్వర్ జిల్లాలల్లోను తెలుగు వారు, ఉద్యోగ, వ్యాపారాల్లో నిలబడి వలసవచ్చినవారే, ఇక్కడ స్థిరపడినవారే.

మాతృభాష మీద మమకారంతో తమపిల్లల్ని తెలుగు మాధ్యమంలో చదివించాలని ఆరాటపడి, వీరిలో కొందరు పాఠశాలలకు భూదానాలిచ్చేరు, మరికొందరు తెలుగు సాహితీ సాంస్కృతిక సంస్థలకు శ్రీకారంచుట్టి తెలుగుదనాన్ని కాపాడుతూ వస్తున్నారు. మరి కొందరు స్వయంగా తెలుగు మాధ్యమ పాఠశాలల నిర్మాణానికి పూనుకున్నారు.

ఒడిశా ప్రభుత్వం వీరికి ఉత్సాహప్రోత్సాహాలను అందిస్తూ తెలుగు ఉపాధ్యాయుల నియామకాన్ని కొనసాగించారు. 70వ దశకంలో ఒడియా విద్యార్థులతో సమానంగా తెలుగు విద్యార్థులుండేవారు. తెలుగు ఒడియా విద్యా విభాగాలు ప్రతిపాఠశాలలో సమఉజ్జీలుగా నడిచేవి. తగినంతమంది తెలుగు ఉపాధ్యాయులను నియమించి ప్రభుత్వం తన ఉదారతను చాటుకున్నది. అదిస్వర్ణయుగం. అది ఒకప్పటి మాట.

కాలంమారింది, నిజంగా అది మారిందో లేదో కాని, తెలుగు స్థితి గతులు మాత్రం మారాయి. భగవంతుడు సర్వాంతర్యామి అని వేదాలు శాస్త్రాలు ఘోషిస్తున్నాయి. అయినా కనబడని ఆ దేవుని కోసం ఉన్నావా లేవా అని భక్తులు ప్రశ్నిస్తున్నట్లే, అవకాశంలో సగంగా ఉన్న తెలుగు మాధ్యమ పాఠశాలల పరిస్థితి సరిగ్గా ఇలాగే ఉంది. పిల్లలున్నచోట ఉపాధ్యాయులు లేరు. ఉపాధ్యాయులున్నచోట పిల్లలు లేరు. అనూహ్యంగా కొన్నిచోట్ల తెలుగు మాధ్యమంలో చదివే పిల్లలున్నా వారికి పాఠ్యపుస్తకాలు లేవు. అరకొరగా ఉన్న పుస్తకాలు ఒడియా పుస్తకాలకి అనువాదాలు కావటంతో, ఆ అనువాదకులు ఒడియా భాషాప్రభావం ఉన్న తెలుగువారు కావటంతో కొన్ని ఒడియా పదాలకు దుమువులు చేర్చి తెలుగు పదాలుగా మార్పు చేయబడినా, లెక్కలు, విజ్ఞాన శాస్త్రపదాలు తెలుగువారికి అర్థంకానట్లే ఉంటయి. "బావ లేకుండటం కంటే గుడ్డి బావ నయం" అన్నట్లు ఆ పుస్తకాలు 30 శాతం విద్యార్థులకి సహాయపడుతున్నందుకు సంతోషించాల్సిందే.

ఎందుకంటే అనువాదం లేని పుస్తకాల ప్రత్యామ్నాయంగా ఒడియా భాష నేర్చుకొని ఒడియా పుస్తకములోని ప్రశ్నలర్థం చేసుకొని తెలుగులో సమాధానాలు రాయాల్సిందిగా కొందరిని నిర్బంధిస్తున్నారు. ఒడియా భాష రాకపోతే ఇంగ్లీషులో ప్రశ్నలు ఇస్తున్నారు... "తాంబులాలిచ్చేశాం తన్నుకు చావండి" అన్న అగ్నిహోత్రావధానుల బాణీలో. అదృష్టవశాత్తు తెలుగువాచకాలు, ఉపవాచకాలు ఆంధ్ర ప్రభుత్వ పుణ్యమా అని అందటం ఒక వరమే. మిగిలిన పాఠ్య పుస్తకాల మాటేమిటి? ఇదంతా చూస్తే నవ్వాలో ఏడ్వాలో తెలియని స్థితి.

ప్రభుత్వాలమధ్య చర్చలు జరుగుతాయి. నిర్ణయాలు జరుగుతాయి. సభలు, సమావేశాలు, ప్రతినిధులు పేరుతో పెద్ద పెద్దనగరాలు పెద్దలరాకతో "తెలుగు వర్థిల్లాలి" అనే మాటలున్న తోరణాలుతో కళకళలాడినా, గుప్పెడు వరాలు, కొండత ఓదార్పులు అయ్యేక కూడ పర్యావసానం మాత్రం, ఆశాజనకంగా ఉండటం లేదు జనం చెవులు దులిపేసుకుంటున్నారు, గుండెలు ముడిచేసుకుంటున్నారు. మళ్ళీ ఎక్కడవేసిన గొంగళీ అక్కడే.

తెలుగు చదువుకోవాలంటే పోయి ఆంధ్రాలో చదువుకొండని విద్యాధికారులు హూంకరిస్తూన్నారు. ఒడిశాలో తెలుగువారు భాషాపరంగా ద్వితీయశ్రేణి ప్రాధాన్యం నోచుకోని దురదృష్టవంతులు. రాజకీయాన్ని, వ్యాపారాన్ని, శాశించే గౌరవనీయులైన ప్రజానాయకుల్లో కొందరు తెలుగు వారున్నా, వారికీ పరిస్థితి తెలిసినా, నోరు మెదపకపోవడం వారి గొప్ప, పైపై మాటలతో పబ్బం గడుపుకోవటం వారికి వెన్నతో పెట్టిన విద్య.

తెలుగు విద్యార్థుల భవితవ్యం కోసం ఒక్కరైనా ముందుకురారు. విద్యాహక్కు గురించి మాట్లాడరు. ఉద్యమించరు. వందలాది కాగితాలు అధికారులకి మొక్కుబడిగా సమర్పిస్తారు. అంతటితో తమ బాధ్యత పూర్తయినట్లేనని జబ్బలు చరుచుకుంటారు. సంవత్సరం తరువాత సంవత్సరం వస్తుంది. సమస్యలు అలాగే మొండిగా తిష్ఠ వేస్తాయి.

ఒడిశా ప్రభుత్వంవారు విశాల హృదయులు. తెలుగు ప్రథమ భాషగా చదివి ఉపాధ్యాయ శిక్షణ పొందినవారికి ఒడియా మాధ్యమిక పాఠశాలల్లో నియమించి వారి ఉదారతను చాటుకొంటున్నారు. మనవారు ఉద్యాగాల్లో చేరేరనే ఆనందం ఇక్కడే ఆవిరవుతోంది.

కిందామీదపడి నిలబడి నాలుగు ముక్కలు ప్రాంతీయభాషలో నేర్చి ఏదో బండి లాక్కు రావటం తప్ప వారు చేస్తున్న పని వారికే మింగుడు పడదు. 'మహాప్రభో మమ్మల్ని తెలుగుమాధ్యమ పాఠశాలలకు బదిలీ చేయండి' అని ఉత్తర దక్షిణలు సమర్పించ సాహసించినా పని జరగక తూర్పు వైపుకి తిరిగి దండం పెట్టవలసిందే.

ఈ అందచందాలకి తోడు మరో శరాఘాతం తెలుగు ఉపాధ్యాయులకి నిద్రపట్టకుండా చేస్తున్నది. పిల్లలు దండిగా ఉన్న బడు

లలో ఒకరో ఇద్దరో తెలుగు ఉపాధ్యాయులున్నచోట తెగబడి, తగాదా బడి వీరికి ఒడియా తరగతుల బోధనకు పంపుతారు. అయ్యా ఇది అన్యాయమంటే వినేవారు లేనే లేరు. ఏమీ చెప్పకపోయినా పర్వాలేదు వెళ్లి కూర్చోమంటున్నారు. ఆర్చేవారెవరు తీర్చేవారెవరు?

కావలసినంతమంది తెలుగు ఉపాధ్యాయులు ఒడియా బడులలో ఉన్నా వారికి తెలుగు మాధ్యమ బడులకూ బదలీచేయక ఇటు తెలుగుపిల్లలకు అటు ఒడియా పిల్లలకు తీరని నష్టం చేకూర్చుచున్నారు. తల్లితండ్రులు నిరాశానిస్పృహలకు లోనై గుండెరాయి చేసుకొని తమ పిల్లల్ని ఒడియా, ఇంగ్లీషు మాధ్యమాల్లోకి అయిష్టంగానైనా పంపిస్తున్నారు.

పొంచి ఉన్న ప్రళయాన్ని తెలుసుకోలేకున్నారు. తెలుగుభాష కనుమరుగౌతోంది! ఇక తెలుగుజాతి మనుగడ కోల్పోతుంది! తెలుగు సంస్కృతి సాంప్రదాయములు నశించపోతాయి! మననాయకులు, ప్రజలు అన్యభాషీయులకు బానిసలుగా మిగులుతారు.

మన తెలుగు అతిప్రాచీన భాషగా గుర్తించిన కేంద్ర ప్రభుత్వం ఈ ఆపద నివారణనికి చర్యలు తీసుకోదా? ఇరురాష్ట్ర తెలుగు ప్రభుత్వాలు మేలుకోవా? అంతర్జాతీయ ప్రమాణాలతో రాజధానులు నిర్మిస్తారా, లేక తెలుగుభాష, సంస్కృతి, తెలుగుతనానికి సమాదులు కడతారా?

ఒడిశా ప్రభుత్వం మరియు ఆంధ్రా ప్రభుత్వం లోగడ ఈ విషయమై ఒప్పందం కుదుర్చుకున్నాయి కదా. ఆంధ్రా ప్రభుత్వం ఒప్పందం ప్రకారం అమలు చేస్తున్నా ఒడిశా ప్రభుత్వం చేయుట లేదని విన్నవించుకొన్నా పట్టించుకోనక ఇచ్చటి తెలుగు ప్రజలను గాలికి వదిలేశారు. పలుసార్లు ఒడిశాలోని తెలుగు సంఘాలు ఒత్తిడితేగా కనుదుడుపుగా ఒక కమిటీని పంపి మరల నిద్రకు ఉపక్రమించారు. ఇటు తెలుగు ప్రభుత్వాలు అటు కేంద్ర ప్రభుత్వం తలచుకుంటే ఇది ఒక పెద్దసమస్య కాదు. వారికి రాజ్యాంగ పరంగా కూడ ఈ విషయంలో బాధ్యతలున్నాయి. అవి విస్మరిస్తే ఇప్పుడు తమిళనాడులో ఉద్భవించిన జటిల సమస్యలు లాగా ఒడిశాలో కూడా తొందరలో తలెత్తవచ్చును. ముందుగా మేల్కొంటేనే మంచిది.

భాషపై అనురాగం అభిమానం అనుకూలిస్తే –అమృతరసం, ప్రతికూలిస్తే– పచ్చి విషం! హక్కుల పరిరక్షణకోసం అందరూ ఒక్క తాటిపై నిలిచి సంఘటితశక్తిగా సరైన కార్యాచరణ చేబడితే సమస్యల ఏనుగుల గుంపుని కూడ తరిమేయవచ్చు. ఈనాటితరం ఈ కృషి చేయగలిగితే రాబోయే తరం మనసారా పాడుకుంటుంది...

“మాతెలుగు తల్లికి మల్లె పూదండ” అని.

అప్పుడేకదా అమ్మఒడి నిండేది, తెలుగుబడి పలుకుబడి నిలిచేది!

❊



# సీకట్లోని మాటలు

స.రఘునాథ

**పొ**ద్దు గుంకునుంది అన్నంగనే సిన్నక్క ఇంటి దావ పట్టింది. 'అరే, మన మనిసి సిన్నక్కే ఇంటికి పోతుండాది, ఇంగ నాకేం పని' అనుకొన్నేమో సూరీడు, బిరి బిర్న తన రేత్రింటికి పోతుండగనే, పొద్దిన్నే రెక్కలిప్పి పొయిన సిలుకంద్లు, గోరింకులు, కాకులు, కొంగలు, పిచిగ్గువ్వలు ఇట్లా వొర సగా గూడుతట్టుకు ఎగురుకొంటాబొయి, గూట్లో సేరుకొని రెక్కలు ముడుసుకొంటా ఉండాయి. ఇది దినదినమూ సూసుకొంటా ఇంటి కొచ్చేదే. సిన్నక్కదేమి కయిత్వుము రాసే కవి మనసు కాదు, 'దినుమూ నాయట్లానే కదుపాత్రము కోసురుము పొయి వచ్చేదే గదా' అనుకొనేంత తెలివంతే దానిది. కాని, అమ్మతావా అవ్వ తావా నేర్సుకొన్న కొన్ని పాటలొచ్చు. ఎబుడైనా దావలానో, పని చేసేతబుడో పాడుకొంటా ఉంటాది. అట్లా అబుడబుడు సిన్నక్క పాడుకొనే పాటొగటి ఉంది–

మావూరి గుడిలోన బంగారు పల్లక్కి
బంగారు పల్లక్కి మేం ముట్టరాదంటా
ముట్టితే తప్పంటా మేం ముట్టరాదంటా
మేం కట్న గుడిలాకి మేం పోరాదంటా..

పాట గుర్తుకొచ్చింది గానీ పాడుకోలా...

'ఇంట్లా కూతురు ఏం సేసుకోనుందో, యా పని సేసిందో, యా పని యిడిసి పెట్టిందో? నేనే పొయి సేసుకోవాల్నేమో?' అనుకొంటా నెత్తిమీద ఉండే మక్కిరిని పట్టుకొన్న సేతుల్ని వదిలేసి, నడుములాని తిత్తిని తీసి, రొండు పేద్ల వక్కని నోట్లోకి యేస్కొనంగనే మక్కిరి పడిపోయేకట్టు అన్పించింది. రవంచ తలని, ఒల్లుని అట్లిట్ల ఆడించి మక్కిరిని నిలబెట్టింది. ఇంగ పడిపోదులే అనుకొని, ఒగ ఆకుని రొండుగా సింపి, సగాకుని తిత్తిలాబెట్టి, సగాకుని నోట్లా పెట్టుకొనింది. సున్నకాయిని తీసి కందిగిం జంత సున్నాన్ని నోట్లాకి యేస్కొని, అట్లే రవంచ కద్దుపొడిని తీసి యేసుకొంటా ఉండంగనే, మళ్లీ మక్కరి పడిపోయినాకట్టు అనిపించింది. ఇందాకట్లే సేసి నిలబెట్టింది. నోట్లోదాన్ని రవంచ నమిలి, ఊరిన ఎంగిలిని ఉమిసేసింది. నాలికతో ఉంటసేసి దాళివి లాకి తోసుకొనింది.

అబుడు మొగుడు గుర్తుకొచ్చినాడు.

'సేని తావ నింక ఇంటికి పొయినాడా? సేన్లానే ఉండాడా? ఇన్నాగంటా ఆడనే ఉంటే, ఏందిరా మన బతుకు ఇట్ల ఏడుస్తా ఉందే అని నెత్తిన బట్టేస్కొని కానుగు మాని కిందన కూకోనుంటాడు. ఇంటికేమన్నా పొయ్యింటే, అది సేయలా ఇది సేయలా అని కూతురు పైన కూతలేస్తుంటాడు. కూలిపని నింక మీ యమ్మ ఇంగా రాలేదేలనే అనుంటాడు. ఇది దినుమూ నడిసే రామాణమే. ఈ దినుము ఎట్ల గమ్మునుంటాడు?' అనుకొనింది.

ఇంట్లా ఉప్పు, పప్పు నిండుకొనుం డాయి. పోతానే తెప్పీయాల. రాగిపిండికి అంత నూకలేసి కెలికితే ఈపూట గడుస్తుంది. సంచిలా రాగులు ఎన్నుండాయో సూడలే. సూసి, పణుకొనె ముందు మలిసి పెట్టాల. తెల్లవారంగనే మిసునుకు అంపాల. ఈ ముందు కరెంటు ఉంటాదో లేదో! ఈపొద్దు ఆయితారము. రేపు తెల్లవారి కరెంటు. బతి కిస్తివి దేవుడా అనుకొనింది.

ఇంటి ముందుకు రాంగనే సూసింది. సీమనూని దీపుము యెలుగుతా ఉంది. కరెంటు లేదనుకొనింది. పుణ్ణానికి, కూతురు బోకులు కడిగి, సెత్తూడిసి, కట్టెలు పొయ్యి దగ్గిర పెట్టి, నీల్లు తెచ్చి పెట్టుంది. యా మాయకారి మనుసు వొచ్చిందోగాని, నట్టింట్లా రాగులు మలుస్తా కుసునుంది. హమ్మ, బతికిస్తివి తల్లే అనుకొని, "సేటని ఆడేసి అంగిడికి పోయి, సేరంత ఉప్పు, పదిరూపాయిలికి కందిబ్యాల్లూ తీసు కొని రా పో" అంటా ఇరువై రూపాయల నోటుని కూతురికి ఇచ్చింది. దాన్ని సేతిలొకి తీసుకొంటానే "అమ్మా ఇంగొగ ఐదియ్యే, గములు సొబ్బు తీసుకొంటా" అనింది కూతురు. "మన బతుక్కి అదొగటి సేటు.." అంటానే ఇచ్చింది.

అంగిడినింక కూతురొచ్చినంక కరెంటు వచ్చింది. కూతురు, తెచ్చిందే దాన్ని మూలింట్లా పెట్టి, టీబీ ముందు కూకొనింది. దాని పని అది సేసింది గాబట్టి దాన్నింక మాటాడిచ్చే కిలా. పనేమన్నా సెప్పితే ఒగే కసురు.

పొయ్యి అంటించి సంగిటికి ఎసురు పెడతా "మీయప్ప ఇంగా రాలా కదలే" అనింది. "పొద్దయింది, వస్తాదులే" అంటా ఉంది, దాని మాటింకా ఆగలా, దూడ అంబా అంటా లేసి ఒగ గెంతేసింది.

సంగిటి అయితానే ముగ్గురూ తినిరి. కరెంటొచ్చి, మూడుగంటసేపయింది. ఇంగుంటే ఉన్నాకట్టు, పోతే పోయినాకట్టు. అదుండగనే రాగులు మలుసు కొనేయాల అనుకొంటా సేటని సేతిలాకి ఎత్తుకొనింది. అబ్బాకూతురూ టీబీ ముందర కూసునుకొన్నారు. మలిసిం దైంది. కరెంటు టపక్కన పోయింది. ఇంకె బుడో వచ్చేది! కూతురు లేసి టీబీ ఆపుసే సింది. సీమనూని దీపుము అంటించింది. సాపేసుకోని పణుకొనింది.

సిన్నక్క, సాపేసి దానిమింద కమ్మిడి పరి సింది. మగుడు పణుకోనేకి లేసినాడు. ఎవురో వొచ్చినాకట్టైంది. రంగన్నో అనే కూత యిన బడింది. సిన్నక్కేబొయి వాకిలి తీసింది. కొండ కావిలి పెద్దన్న నిలబడి ఉండాడు. కావల్సిన మనిషే. లోపలికి రమ్మనింది. వొచ్చినాడు. రాంగనే "భోజనము ఆయెనా" అనడిగినాడు. "ఆయెలే, నీదాయెనా" అన్నాడు రంగన్న. "భోజనమా, అదొకిటి తక్కువ నా మకానికి". ఆ మాటిని "ఏమైంద్రా" అన్నాడు రంగన్న.

"మద్దానుము కరెంటోల్లొచ్చి బోరు వైర్లు పీకేసిరి. బిల్లు రొండు వేయిలు కట్టాలంట. యేసిందే నాలుగు దోసకాయి సెట్లా తీగల ల్లుతా ఉండాయిగదా, నీల్లు సాలక ఎండి పోతా ఉండాయిరా. గాయము మింద బరేసి నట్ల సేసిర్రా కరెంటోల్లు. సేతిలా దమ్మిడి లేదురా రంగన్నా. నువ్వే ఏమన్నా సేయాల్రా. లేకుంటే మునిగిపోతాన్రా" అన్నాడు. ఏడిసే దొకటే తక్కువనట్లు ఉండాడు.

"ఉండుకున్నెట్లే రొండేలంటే మాట్లేమిరా పెద్దన్నా? నేనేమన్నా సావుకార్నా? నా తావ

**'ఇంట్లా కూతురు ఏం సేసుకోనుందో, యా పని సేసిందో, యా పని యిడిసి పెట్టిందో? నేనే పొయి సేసుకోవాల్నేమో?' అనుకొంటా నెత్తిమీద ఉండే మక్కిరిని పట్టు కొన్న సేతుల్ని వదిలేసి, నడుములాని తిత్తిని తీసి, రొండు పేడ్లు వక్కని నోట్లోకి యేస్కొనం గనే మక్కిరి పడిపోయేకట్టు అన్పించింది. రవంచ తలని, ఒల్లుని అట్లిట్ల ఆడించి మక్కి రిని నిలబెట్టింది. ఇంగ పడిపోదులే అను కొని, ఒగ ఆకుని రొండుగా సింపి, సగాకుని తిత్తిలాబెట్టి, సగాకుని నోట్లా పెట్టుకొనింది. సున్నకాయిని తీసి కందిగింజంత సున్నాన్ని నోట్లాకి యేస్కోని, అట్లే రవంచ కద్లుపొడిని తీసి యేసుకొంటా ఉండంగనే, మళ్లీ మక్కరి పడిపోయినాకట్టు అనిపించింది. ఇందాకట్లే సేసి నిలబెట్టింది.నోట్లోదాన్ని రవంచ నమిలి, ఊరిన ఎంగిలిని ఉమిసేసింది. నాలికతో ఉంటసేసి దాళివిలాకి తోసుకొనింది.**



ఏడిదిరా అంత దుడ్డు" అన్నాడు రంగన్న.

"నువ్వేమన్నా లేదని సేతులెత్తేస్తే నేను ఉర్లేసుకోవాల్సిందే" అంటా "నువ్వైనా సెప్పు సిన్నక్కా" అన్నాడు వొచ్చి సిన్నక్క సేతులు పట్టుకొంటా. ఏమన్నా సేయమన్నట్ల మగని తట్టుకు సూసింది సిన్నక్క.

తనకేమన్నా కస్టము అంటే, నేనుండా ననేవోడు పెద్దన్న. దానికే "సరేలే తెల్లార్నీ, ఏమన్నా సేద్దాము. సెయ్యి ఎంగిలి సేస్తువు, సేతులు కడుక్కో" అన్నాడు రంగన్న. తళిగెలా సంగిటిముద్ద పెట్టి, సారుపోసుకోనొచ్చి ఇచ్చింది సిన్నక్క.

పెద్దన్న తినేసి పోయేపాటికి సవరేతిరి అయుంటుంది. దీపుము తీసేసి వొచ్చి, మగని పక్కలా పణుకొనింది సిన్నక్క. దీనికోసమే కాసుకొన్నాకట్టు సీగిటొచ్చి ఇల్లు నిండు కొనింది.

**"కరెంటోల్లది పేదోల్ల మిందనే శానా దర్బారు. మనమేమీ చేయిలాపుము గదా" అని రవంవసేపు గమ్మునుండి పొయినాడు.**

**సీగిటి నిరుసద్దులా ఇద్దురూ పాలుపంచు కొనిరి. "ఏం సేద్దామంటావు" అడిగినాడు. అది ఒగే తడవుకు సీగిటినీ సిన్నక్కనీ అడిగి నాకట్టుంది. "ఏమన్నా సేయి పాపుము" అనింది సిన్నక్క. "అదిగాదే" అన్నాడు. "అంటే" అనింది. "అదేనే, ఏం సేయాలనేదే తలకి వస్తాలేదు" అన్నాడు. సీగిట్లా ఇద్దరి నిరుసద్దు. ఇద్దరి నిరుసద్దులా సీగిటి.**

"నిరుడు పంట కోతకు వస్తాది అన్నం గనే వాన రాకబాయెగదా. యెన్నులే సగానికి సగుము నాసుగింజలు పడిపోయినాయి గదా. వాటినే తినుకోనుండాము గదా. ఈతూరి దున్ని యిత్తింది సగము సేనుకే గదా. నువ్వేమో బోరు యేయించుమంటివి. నాకూ సరే అనిపించె. గొర్రెలు, కోళ్లు, ఎనుముల్ని అమ్మేకి లా. పుంజును ముట్టుకొనేకి లా. మనికి మంచి సేయమని కాటుపురాయునికి యిడిసిండేది అది"

మగడు పక్కలా లేకబోయుంటే సీగిటే మాట్లాడతా ఉంది అనిపించేది. ఇంట్లా అంత సిమ్మసీగటి. "నిదరబోతివా?" అన్నాడు. 'లా' అన్నాకట్టు ఒగతూరి దగ్గింది. "లేసి దీపుము పెడుతావా, ఏలనో ఈపొద్దు సీగిట్లా దిగులైతాంది" అన్నాడు. "దీపుము పెడితినో సీమనూని నిండుకొంటాది. రేపటికుండదు. సొసైటోల్లు ఇచ్చేది వారుము తరవాతనే. అంగిడిలా కొనుక్కోనొస్తే కాలిపోవాలంతే. ఇన్నేల్లు లేని దిగులు ఇబుడేడిది, కలకుండు" అనింది. "మాట్లాడతా ఉండాము గదా.." అన్నాడు. "ఇంతకి మాట్లాడుకొనేకి యెలుగు కావల్నా, సీగిట్లా మాట్లాడితే యినబడదా ఏంది" అనింది. ఆ మాటకి రంగన్న నోట్లా మాట లేకపోయింది. సేతిని సిన్నక్క కడుపుమిందేసి, "అమ్మిందానికి వొచ్చిన లచ్చరూపాయిల కాసులు ఆరునెల్లైనా అట్లే పడిండాయి. అవుసరుము వొచ్చినా కర్సు సేయలా" అన్నాడు. "తెలుసు" అనింది. "దాంట్లానింకనే తీసి పెద్దన్న కీయాల, ఇద్దుమా?" అన్నాడు. "ఇయ్యి, ముంచేసే రకుము కాదులే" అనింది.

## సీగిట్లోని మాటలు

నిరుసద్దు.

సీగిట్లా నిరుసద్దు. గురకసద్దు. సీగిటి గురక? మాటలినకనే గురకేడిది సీగిటికి? అది వాల్ల కూతురి గురక.

"బోరు కోసరమని దాసిపెట్టిన కాసులు. గానీ బోరేయించలేక పోతిమి" అన్నాడు. తెలుసనింది. "నడువులా బిడ్డ పెండ్లి మాటొచ్చె గదా?"అన్నాడు. "వొచ్చిందానికే గదా బోరుకు వాయిద యేసింది" అనింది. "దాన్నీ నిచ్చయము సేసుకొన్లేక పోతిమి" అన్నాడు రంగన్న. "లేదంటినా? నువ్వే, బోరేయిస్తే పెండ్లి సెయిలేము. పెండ్లనుకొంటిమో బోరు లేదు అంటివి. ఏదనేదే తేలక ఉండిపోయింది గదా?" రొంటికీ నువ్వే కారణము అన్నట్లు నుడి వింది. "నిజుములే. బోరేయిస్తిమనుకో, నీరు పడతాదనే నమ్మకములా. యేసి నీల్లు పడక పోతే మనగతేమి? మన నసీబు బాగుండి నీల్లు పడిపోతే అనే ఆస ఒగిటి మనుసుకొచ్చె గదా. కానీ ఆస అసగానే మిగులిపోతే అనే అనుమానమూ ఉంది గాదా? అదేమో అంటారు గదా– పెండ్లి గాందే పిచ్చి కుదర్దు, పిచ్చి కుదరందే పెండ్లి గాదు అని, అట్లైపాయె. బోరుకేస్తే పెండ్లీ గాదు, పెండ్లిసేస్తే బోరు లేదు. ఏంసేసి సచ్చేదో తెల్లే" అన్నాడు. "నీకే తెలీంది నాకెట్ల తెలుస్తాది?" అని, "బోరు యేయించేస్తావ సూడి. పెండ్లిని ఒగ మూడేండ్లు వాయిదా వేద్దాము. ఆ లోపల పంటలు పెట్టి" అని సిన్నక్క అంటుండగానే రంగన్న, "వెయ్యి నూరూ, నానూరడుగులు దింపించాడు ఉండే వోల్లు, నీరేలా. ఇట్ల దింపుకొంటా పోయేకి మన తావ దుడ్లు ఏడుండావి" అని మాటేసి నాడు. "మనుము ఇట్లనే అనుకొంటా పోతే.." గోకలా యావదో తగులుకొన్నాకట్టు గమ్మునుండిపోయింది సిన్నక్క.

ఇద్దురికి మాటలు లేవు. నేనేమన్నా అందామంటే నా మాటలు లోల్లకి యినిపించదు. ఇబుడు మాట్లాడల్సింది రంగన్నే. ఏం మాట్లాడుతాడో యిందాం అనుకొనింది సీగిటి. "ఏమే బోరా, పెండ్లా?" అన్నాడు రంగన్న. ఏడుస్తా మాట్లాడుతుండాడు అనిపించింది సిన్నక్కకు. సీగిటికి వాని కన్నీల్లు కనబడె. అవును, బోరా పెండ్లా అనుకొంటా, బోరు అనబోయి పెండ్లి అనింది. అనెంక "నీరు పడేకట్టు ఉంటే..." అని, మాటను నిలిపేసింది.

ఏ ఇంటిదో కోడి కూసింది. దానెనకనే తనింటికోడి వంతు పాడింది. కోడి కూసింది, ఇంగేల నిద్ర, లేద్దాం అని సిన్నక్క అనకొంటా ఉండంగనే, "పెద్దన్నొస్తే దాంట్లానింక రొండు వేలు తీసియ్యి. వాడు తిరిగి ఇచ్చినంక ఏమి సేయల్నో సూద్దాము..." అన్నాడు రంగన్న.

యియాల్లు బోరేసే మాటకొస్తారా? పెండ్లి మాటకొస్తారా? దినుమూ వచ్చేదాన్నే గదా. ముందు తెలిసేది నాకేగదా. అబ్బుడు ఈ కతని మనుసులకి కొక పోయినా, సుక్కలకైనా సెప్పుకొనెచ్చులే అనకొంటా ఉండంగనే, అబ్బుడే పుడతా ఉండే పొద్దు వెలుతురులా కరిగిపోయింది సీగిటి. ❉



**స.రఘునాథ.** శ్రీనివాసపుర, కర్నాటక.
ఫోను : 08157-245124,
సెల్ : 99805 93921

కోలారు జిల్లా మాలూరు తాలూకాలోని మలియప్పనహల్లిలో 1954లో జననం. ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయులు. వీరు తెలుగన్నడ రచయితగా పేరుపొందినవారు. వీరివి ఇప్పటివరకూ ఆరు కవితా సంపుటాలు. రెండు విమర్శనా గ్రంథాలు, బాలగీతాల పుస్తకాలు రెండు, అనువాదాలు ఆరు (కన్నడం నుంచి తెలుగులోకి రెండు, తెలుగునుంచి కన్నడం లోకి నాలుగు) వచ్చినాయి. వీరి తంగడి హూవు (తంగేడుపువ్వు) కథా సంకలనం 2004లో వచ్చింది. తల్లినుడి కన్నడమైన రఘునాథ గారి కన్నడ రచనలలో తెలుగు సొబగూ, తెలుగు రచనల్లో కన్నడ సోయగం కలగలిసిపోయి ఇరునుడుల వారికీ వీనులవిందు చేస్తుంటాయి. 'నమ్మమక్కళు' అనే సంస్థ ద్వారా ఎన్నో సామాజిక కార్యక్రమాలను వీరు చేస్తుంటారు.

సీగిటి : చీకటి
దావ : దారి
మక్కిరి : గంప
పేడ్లు : ముక్కలు
కడ్లుపొడి : పొగకాడల పొడి
దాళివి : దవడ
ఇన్నాగంట : ఇంతవరకూ
ఆయితారము : ఆదివారం
సీమనూని : కిరోసిన్
గములు : వాసన
బర : వాత
తళిగె : కంచం
చేయిలాపుము : చేయలేము
కలకుండు : ఊరకుండు
గోక : గొంతు
యావదో : ఏదో

# భాషల సామర్థ్యం

-కీ.శే.డా॥బి.ఎస్.రామకృష్ణ

**భా**షాశాస్త్రం ప్రకారం ప్రపంచంలోని ఏ భాషా ఒకటి గొప్పదీ మరొకటి తక్కువదీ కాదు. ఏ భాష ప్రత్యేకత దానిదే. సామర్థ్యమూ అంతే. అయితే అసలు ఒక భాషకు ఉన్న సామర్థ్యాన్ని ఎలా తెలుసుకోవాలి? కొలమానం ఏమిటి? ఒక భాషను మరో భాషతో పోల్చి చూసినప్పుడు ఆయా భాషల మధ్య అంతరువులు ఏ ఏ స్తరాలలో కనిపిస్తాయి? వాటిని నోటిమాటతో కాకుండా సాంకేతిక కొలమానాల ద్వారా గణాంకాల ద్వారా ఎలా తెలుసుకోవచ్చో నిరూపించే సైద్ధాంతిక వ్యాసం ఇది. నిర్దిష్ట సూత్రాల అనువర్తనం ద్వారా ముందు పాశ్చాత్యభాషల మధ్యగల సామర్థ్యాల అంతరువులను కనుగొన్నారు. ఆ తరువాత అవే సూత్రాలను పాశ్చాత్యభాషలకూ భారతీయ భాషలకూ మధ్యగల సామర్థ్యాల అంతరువుల కోసం అనువర్తింపజేశారు. ఈ సూత్రాల అనువర్తన వల్ల భాషాసామర్థ్యాలను కచ్చితంగా గణాంకాల నిష్పత్తులతో సహా తెలుసుకోవచ్చు. ఇలాంటి పరిశోధనలు అటు అనువాదానికీ ఇటు భాషా సాంకేతిక ప్రగతికీ, ఆధునికతకూ కొత్తదారులు తెరుస్తాయి. అందుకే ఆంగ్లంలో బి.ఎస్.రామకృష్ణగారు 'సైన్స్‌టుడే' పత్రిక 1973 ఆగస్టు సంచికలో వ్రాసిన ఈ వ్యాసానికి తెలుగుసేతను అందిస్తున్నాం. కీ.శే.చలసాని ప్రసాద్ తన వ్యక్తిగత గ్రంథాలయం నుండి నాటి సైన్స్ టుడే పత్రికను తీసి ఇచ్చి ఈ వ్యాసాన్ని మన పత్రికలో ప్రచురించమని సలహా ఇచ్చారు. ఆ తర్వాత రెండు మూడు నెలలకే ఆయన మరణించారు. ఆయన స్మృతికి ఈ అనువాదాన్ని అంకితం చేస్తున్నాం.

సాంకేతికత ప్రధానంగా ఉన్న సంక్లిష్ట అంశంపై వ్రాసిన ఈ ఆంగ్లవ్యాసాన్ని తెలుగు చేయడంలో పాలుపంచుకున్న డా.మధురాంతకం నరేంద్ర, డా॥పి.కుసుమహరనాథ్ (తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం), డా.గారపాటి ఉమామహేశ్వరరావు, డా.అద్దంకి శ్రీనివాస్ (హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం) గార్లకు కృతజ్ఞతలు.

-సంపాదకుడు

ఏ భాష గొప్పది? ఇంగ్లీషా హిందీనా, తెలుగా? తమిళమా ? జర్మనా? సాహిత్యగుణంలో కాదు, సాంఖ్యిక కొలమానం ప్రకారం. ప్రసారాల ఇంజనీరు దేనిని ఎన్నుకొంటారు?

మానవుడు భూమి మీద ఆవిర్భవించిన నాటినుంచి, సంఘం కోసం, తోడు కోసం, తన భాష కోసం పోరాటం చేశాడు. వ్యక్తి మనుగడ నుంచి విడదీయలేనంతగా మాట్లాడే భాష ఏమి చేస్తోంది? మానవ స్వభావంలో భాష పాత్ర ఏమిటి? భాష-మనిషి ఉపయోగించే ఒక పరికరం మాత్రమేనా లేక అది అతని ఆలోచనా ధోరణి, ప్రాపంచిక దృష్టిని నిర్ధారించటంలో ఏమైనా ప్రధానమైందా? భాషకు అర్థానికి మధ్య సంబంధమేమిటి? భాషను భౌతిక రసాయన శాస్త్రాల్లాగా లక్ష్యాత్మకంగా అధ్యయనం చేయగలమా?

ఇలాంటి భాషా సంబంధిత ప్రశ్నలకు జవాబు కోసం ప్రయత్నించడంలో మనకు ఎదురయ్యే ప్రాథమిక ప్రతిబంధకం ఏమిటంటే భాషను గురించిన ఆలోచనకు భాషనే ఉపయోగించడమే. భాషను అర్థం చేసుకోవడానికి భాషనే ఉపయోగించాలి.

ఈ వ్యాసంలో మనం భాషా వినిమయానికి మాత్రమే పరిమితం అవుదాం. ఎందుకంటే భాషా పరిమాణాత్మక కొలమానం. ఇతర ఉపయోగాలకంటే వాటి మౌఖిక, లేఖన భాషారూపాలు మిన్న కాబట్టి. అన్ని భాషలూ మాట్లాడటానికి, రాయడానికి కొన్ని నిర్దిష్ట చిహ్న సముదాయాలను కలిగి ఉంటాయి. హల్లు, అచ్చు, శబ్దాలు, వర్ణమాల అక్షర లక్షణాలు వీటన్నింటినీ వాటి లేఖన భాషలో వాడక తప్పదు. ఈ చిహ్నాలు భావాన్ని అందించే క్రమంలో - పదాలు, పదబంధాలు వాక్యాలుగా విభజించబడ్డాయి. ఈ చిహ్నాలు భావాన్ని తెలియజేయడంతో పాటుగా, కొలతకు తగిన కొద్ది సమాచార పరిజ్ఞానాన్ని (information content) కూడా అందజేస్తాయి. ఈ సమాచార పరిజ్ఞానం (భావం నుండి స్పష్టంగా వేరుచేయగలిగిన) భాషా వినిమయ నిర్వహణలో మౌఖిక కొలమానంగా మారుతోంది.

భాష ఒకలాంటి ప్రతీక వాదమనీ, మన ఆలోచనలు, కోరికలు, ఉద్వేగాలను వ్యక్తపరిచే సంకేతం అనీ అంటుంటారు. ఈ అభిప్రాయాన్ని మనం అంగీకరించనట్లయితే, వివిధ భాషలు మన ఆలోచనలను భాషా చిహ్నాలుగా క్రోడీకరించే వివిధ సంకేతాలని తప్పదు. కాబట్టి రెండు విభిన్న భాషల సమాన సందేశాల సమాచార పరిజ్ఞానాన్ని పరిశీలించినట్లయితే, మనం ఆ రెండు భాషల సాపేక్ష నిర్వహణ సామీప్య ప్రామాణిక విలువను సరిపోల్చే స్థితిలో ఉంటాము. ఈ వ్యాసంలో మొదట ఇంగ్లీషు, జర్మన్ భాషలలో (రెండింటికి) ఉన్న దగ్గర సామీప్యతలను, ఆలోచనలను భాషా చిహ్నాలుగా క్రోడీకరించడానికి ప్రత్యామ్నాయ సంకేతాలుగా ఎలాంటి సామర్థ్యం కలిగి ఉన్నాయో సరిపోల్చుదాం. ఆ తరువాత పొడసూపిన సూక్ష్మ సమస్యలను ఆవిష్కరించి, ఈ తులనాత్మక విధానాన్ని ఇంగ్లీషుతో తక్కిన హిందీ, మరాఠీ, తమిళం, మలయాళం, తెలుగు, కన్నడం లాంటి భారతీయ భాషలకు విస్తరిద్దాం.

ప్రతి అక్షరపరంగా కొంత సమాచారాన్ని ఒక పొడుగాటి సందేశం నుండి విడదీయగా -

$$H = \sum_i P_i H_i = - \sum_i P_i \log P_i$$ బిట్స్/ అక్షరానికి.

పై సూత్రంలోని H పరిమాణం ఎన్నో సమాన విషయాలకు కొలమానం. మొదటి దశలో నిర్వచన క్రమం ద్వారా, H పరిమాణం, వర్ణమాలలోని ప్రతి అక్షరం నుండి పొందిన మొత్తం సమాచారాన్ని ప్రతి అక్షరం యొక్క స్వతంత్ర విలువగా ఆ అక్షరాల ఏర్పరిక సం భావ్యతల ననుసరించి P1, P2, ....px, లుగ గుణిస్తోంది. అంతేకాక అది మనకు గల అనిశ్చితి లేక మనకు తరువాతి సరాసరి చిహ్న నిర్ధారణ సందేహాన్ని కూడా గుణిస్తోంది. ఇంకా అది ఒక చిహ్న ప్రసారం, నిల్వ మరియు తిరిగి ప్రసారం కావడానికి గల ఖర్చును పరోక్ష

పద్ధతిలో గుణిస్తోంది. ఇంగ్లీషు అక్షరాలలో వాటి ఏర్పరిక పౌనఃపున్యాలను ఉపయోగించి మనం అక్షర సమాచారం అక్షరానికి H = 4.03 గా కనుగొంటాం. కానీ అన్ని అక్షరాల ఏర్పరిక సమాన సంభావ్యతలను అనుసరించిన ఇది 4.71గా ఉంది. ఈ ఫలితం, అనిశ్చిత తరువాత చిహ్నం అన్ని చిహ్నాల ఏర్పరిక సంభావ్యతలు సమానంగా ఉన్నప్పుడు గరిష్ఠం అన్న నిజానికి అనుగుణంగా ఉంది.

వాస్తవానికి ఇంగ్లీషు భాష అక్షరాలు (లేక ఏ భాష అవిటికవే స్వతంత్రంగా ఏర్పడవు. మనం అక్షరం జంటలను గమనించిన th, st లాంటి ప్రాధాన్య సంగమాలను కనుగొనవచ్చు. అక్షరానికి అక్షర జంటలకూ గల సంభావ్యతను అక్షరం అక్షర జంటల $\sum P(i,j)$ సంభావ్యతల ఆధారంగా లెక్కపెట్టవచ్చు. ఈ విధంగా అక్షర జంటల సగటు సమాచారాన్ని నిర్వచించవచ్చు.

$$H_{pair} = -\sum_{i\,j} P(i, j) \log P(i, j)$$

ఎంతో కాలంగా అక్షర జంటల పౌన:పున్యంలా కాకుండా, అక్షర త్రిపాదులను కూడా గూఢ లిపి విశ్లేషకులు ఇతరులు గణిస్తున్నారు. ఏకాక్షరల కన్నా అక్షర జంటలు, అక్షర త్రిపాదుల సంభావ్యతలు అసమానంగా పంపిణీ కావడం వల్ల, సమాచారంలో జంటల, త్రిపాదులు తక్కువగా అంటే జంటలు అక్షరానికి 3.31 గా త్రిపాదిలు 3.10 గా ఉన్నాయి. మనం పొడుగాటి వాక్య క్రమాల సంభావ్యతలను చూసినట్లయితే ఒక చిహ్నానికి సమాచారం అక్షరానికి 1.5 బిట్స్ కన్నా తక్కువగా ఉంటాయని తెలుసుకోవచ్చు.

సమాచారంలో ప్రగతిశీల తగ్గింపును అక్షర సముదాయాలు, పదాల క్రమంలో తరువాతి అక్షర నిర్ధారణను కచ్చితంగా చెప్పలేదని తెలుస్తుంది. ప్రతి అక్షరం తరువాత ఏ అక్షరమైనా రావడానికి సమాన అవకాశాలున్నాయి. భాషలో పునరుక్తి (redundancy) అధికంగా ఉంది. ఉదాహరణకు, Q అక్షరం తరువాత U అక్షరంలో ఎలాంటి సమాచారం పొందలేము. అంటే U ఒక నిర్ణీత పరిమాణం. 25 సం॥ల ముందు సమాచార సిద్ధాంతాన్ని అభివృద్ధి చేసిన Dr. సి.యి. షానన్, మనం మాట్లాడే లేక రాసే భాష సంఖ్యిక పరిమితులు అని చూపాడు. మనం ఇక్కడ ఏమి చేయగలమా చూద్దాం.

మనం 26 ఇంగ్లీషు అక్షరాలను పేకముక్కలపై రాసి, ఒక ఖాళీ ముక్కను పదాల మధ్య స్థలం గుర్తుగా ఉంచి, ఒకసారి ఒక ముక్కనే ముక్కలను కలగలుపుతూ తీద్దాం. ఆ విధంగా వచ్చే అక్షర క్రమం ఇంగ్లీషు ఇంచుమించు శూన్య క్రమ సంఖ్యాకం అని పిలవవచ్చు. సాధారణ క్రమం ఇలా చదువవచ్చు.

XFOML RXKHRJFFJUJ ZLPWCFWKGYJ FFJEYVKCQGXYD

QPAAMKBZAACIBZLHJQD

మనం మొదట క్రమంలోని రమారమిని, అచ్చయిన ఇంగ్లీషు దినపత్రిక లేక పుస్తకం లోని అక్షరాలనూ యిష్టం వచ్చినట్లుగా తీసుకుందాం. ఒక ఉదాహరణ.

OCRO HLIRGWR NMIELWIS EU LL NBNESEBYA TH EEI ALHENHTTPA OOBTTVA NAH BRL

రెండవ క్రమ రమారమిని పొందడానికి మనం మరో పేజీని తెరచి ఈ అక్షరం కనపడేవరకు చూసి, ఆ తరువాత మొదటి ఎన్నుకొన్న అక్షరానికి ఏదో ఒక అక్షరాన్ని కలుపుదాం. ఇప్పుడు ఇంకే పేజీ తెరచి మొదటి అక్షరానికి చేసినట్లుగా చేసి ఇంకో అక్షరాన్ని రెండక్షరాల అనుక్రమానికి జత చేద్దాం. ఈ పద్ధతి ద్వారా రెండవ క్రమ రమారమి మనకు లభిస్తుంది.

ON IE ANTSOUTLNYS ARE T INGTORE ST BE S DEAMY ACHIN D THEASONARE

ఈ మొత్తాన్ని మూడవ క్రమ రమారమి మళ్ళీ చేసినట్లయితే మూడో క్రమ రమారమి వస్తుంది.

IN XD IST LAT WHEY CRATCIT FR MR BIRS GROGID

FONOENOME OF DEMONSTURES

*please check the above with the original as it was not clear to me with the original)

ఈ విధంగా యాంత్రిక రచనలో ప్రతి స్థాయిలోనూ స్పష్టమైన ప్రగతిని చూస్తాం. చివరిది మనలను మోసగించే ఒక తెలియని, నూతన పదం అవుతుంది. మనం ఇక పెద్ద క్రమ రమారమిని చేయాలనుకొంటాం. కొన్ని సమస్యలు ఉన్నాయి. ఈ ఆటను బాగా ఆడాలంటే అక్షరాల బదులుగా పదాలు, పద జంటలు ఇంగ్లీషులోని పౌనఃపున్నంలో ఉపయోగించాలి. మిల్లరీ నుండి తీసిన కొన్ని ఉదాహరణలు.

Zerooth Order : BETWIXT TRUMPTER PEBLY COMPLICATION VIGOROUS
TIPPLE CAREER OBSCURE ATTRACTIVE CONSEQUENCE EXPEDITION

First Order : IS TO WENT BIPED THE OF BEFORE LOVE TERTLEDOVES
THE SPINS AND I OF YARD THAN ASK WENT GREEK YESTERDAY

Second Order : SUN WAS NICE DORMITORY IS I LIKE CHOCOLATE CAKE
BUT I THINK THAT BOOK IS HE WANTS TO SCHOOL THERE.

Third Order : FAMILY WAS LARGE DARK ANIMAL CAME ROARING DOWN
THE MIDDLE OF MY FRIENDS LOVE BOOKS PASSIAONATELY EVREY

Fourth Order : WENT TO THE MOVIES WITH A MAN I USED TO GO TOW ADS

THE HARVARD SQUARE IN CAMBRDIGE IS MAD FUN FOR.

Seventh Order : SAID THAT HE WAS AFRAID OF DOGS MARKED WITH WHITE SPOTS AND BLACK SPOTS COVERING IT THE LEOPARD DID.

ఉద్దేశాన్ని చక్కగా వినపించడానికి ఈ ఉదాహరణ చాలు. భాషలో పునరుక్తి, సమాచార ప్రసరణలోని తప్పుల నుండి కాపాడటానికి సహజంగా ఏర్పడుతున్నట్లు కనిపిస్తుంది. ప్రతి అక్షర క్రమంలోని ప్రతి అక్షరం వచ్చినట్లయితే ప్రతి అక్షరం అర్థమంతమైన వార్తనిస్తుంది. ప్రతి భాషలోనూ ఉచ్చారణ, వ్యాకరణం, వాక్య అవసరాలను భాషలో గల అనేక అవకాశాలను నిర్దేశిస్తాయి. ఆ విధంగా ప్రసంగ స్వేచ్ఛకు ప్రతిబంధకాలు (limitations) ఉన్నాయి. ఒక చిహ్న గరిష్ట విలువ తగ్గిన సమాచార పునరుక్తిని సగటుగా లెక్కించవచ్చు. చాలా భాషలు రాసే రూపంలో 70 అంతకంటే ఎక్కువ శాతం పునరుక్తి కలిగి ఉంటాయి.

డా. సి.యి.షానన్ సమాచారం తాలూకూ పరిమాణాత్మక కొలమానం మొట్టమొదట ఆవిష్కరించారు. భాషాశాస్త్రం, అర్థశాస్త్రం, మనస్తత్వశాస్త్రం, ఇంక అనేక సామాజిక శాస్త్రాల పరిశోధనల షానన్ కొత్త మార్గాలను చూపారు. ఎన్నో ప్రశ్నలను పరిమాణాత్మక పద్ధతిలో పరిశోధించడానికి మార్గాన్ని ఈ పద్ధతి సుగమం చేసింది.

**భాషల సంబంధ సమాచార నైపుణ్యాలు :**

మనం వ్యాస ప్రారంభంలో ఎదుర్కొన్న రెండు సమస్యలలో ఇప్పుడు మొదటిది చూద్దాం. ఒక ఆలోచనను రెండు భాషల్లో వ్యక్తపరచ గలిగినప్పుడు, రెండింటిలో ఏది తక్కువ సమాచార వినిమయం బిట్లను కలిగిఉంటుంది అని అడగవచ్చు. కచ్చితంగా ఏ భాష అయితే తక్కువ బిట్లను కలిగి ఉందో దానికి ఆర్థిక ఉపయోగాలు కొంత భావ వక్రీకరణ ప్రమాణంలో ఉన్నాయి. ఇప్పుడు ఒకే అలోచనలు రెండు భాషలలో చేయరు. అందువల్ల ఒకే అర్థం వచ్చే రెండు వాక్యాలు అందించే సమాచారాన్ని పోల్చి చూడాలనుకున్నప్పుడు, ఒక భాషలోని వాక్యాన్నీ, రెండవ భాషలోని దాని అనువాదాన్నీ  తీసుకోవాలి. మూల భాషలో చదువరుల నుంచి వచ్చే స్పందనను తీసుకురాగలిగినదే మంచి అనువాదం.

ఇప్పుడు ఇంగ్లీషు, జర్మను భాషల్లో విషయగ్రహణమెలా జరుగుతుందో గమనిద్దాం. ఇంగ్లీషు, జర్మను భాషలనే యిప్పుడు ఉదాహరణలుగా తీసుకోవాడానికి కారణముంది. అవి రెండూ దగ్గర సంబంధముండే భాషలు. పైగా ఆ రెండు భాషల మధ్య అనువాదాలు బాగా జరిగాయి. ఆ రెండింటిలో ఒక భాష నుంచీ మరొక భాషలోకి అనువాదాలు చేయడానికి అవసరమైన పద సంపద ఉంది. పైగా మనం ఆ రెండు భాషలకూ చెందినవారం కాకపోవడంతో యిలాంటి పరిశీలనకు అవసరమైన తాటస్థ్యం కూడా ఉంటుంది.

కొన్ని సంవత్సరాల క్రితం ఇటువంటి తులనాత్మక పరిశీలన జరిగింది. అప్పుడు 171017 బిట్లు ఉండే ఇంగ్లీషు సమాచారాన్ని జర్మనీలోకి అనువదించినప్పుడు 207590 బిట్లు (బిట్లు) అవసరమయ్యాయి. అంటే ఒక ఇంగ్లీషు బిట్టుకు 1.2 జర్మనీ బిట్లు కావలసివచ్చాయి. అలాగే ఒక సమాచారాన్ని జర్మనీ నుంచి ఇంగ్లీషులోకి అనువదించి చూడాలి. 175491 బిట్లుండే జర్మనీ సమాచారాన్ని ఇంగ్లీషులోకి అనువదించినప్పుడు 163981బిట్లు అవసరమయ్యాయి. అంటే ఒక ఇంగ్లీషు బిట్టుకు 1.07 జర్మనీ బిట్లు అవసరమయ్యాయి.అందువల్ల ఇంగ్లీషు జర్మనీ కంటే ఎక్కువగా పదసంపద ఉన్నట్టు తెలుస్తోంది. ఈ రెండు బిట్ల మధ్య ఉన్న సమాన స్వభావ మేమిటి? అని నిష్పత్తి అనువాదమార్గం పైన ఎందుకు ఆధారపడివుంది?

ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పాలంటే మనం అనువాద నమూనాను మార్పుచేసి పద్ధతిగా గుర్తించాలి. రెండు భాషల్లో ఒకే అర్థమున్న పదాలుండటం కష్టమనే విషయాన్ని అనువాదకులందరూ గుర్తించారు. అనువాద మెప్పుడూ యీ అర్థ విపర్యాయాలతో వేగుతూ ఉంటుంది. అందుకే అనువాదంలో అనువాదకుడు కొన్ని అదనపు మాటల్ని వాడుతుం ఉంటాడు. అప్పుడు ఒక ఇంగ్లీషు బిట్టుకు జర్మనీలో x బిట్లు అవసరమని అనుకుందాం. అనువాదం రెండు భాషల మధ్య జరుగుతున్నప్పుడు అవసరమయ్యే అదనపు బిట్టు y అనుకుందాం. అప్పుడు జర్మనీ, ఇంగ్లీషు భాషల మధ్య అనువాదాల సమీకరణ ఈ కింది విధంగా ఉంటుంది.

$$171017\,(x+y)= 20759$$

$$175491\,(1/x +y) = 163984$$

అప్పుడు $x = 1.15$, $y = .065$ అనుతుంది. అప్పుడు అనువాద ప్రసక్తి లేకపోయినా ప్రతి ఇంగ్లీషు బిట్టుకి 1.15 జర్మనీ బిట్లు సమానమవుతాయి. అంటే అనువాదానికి మనం 0.065 బిట్లు అదనంగా వెచ్చిస్తున్నాం. అదే వెచ్చింపు ఈ భాష నుండి ఆ భాషకు అనువదించేటప్పుడు అవసరం.

**సామ్యం :**

ఇటువంటి తులనాత్మక పరిశీలనను ఇంగ్లీషు భాషకూ, భారతీయ భాషలకూ మధ్య కూడా చేయవచ్చు. పట్టిక 1లో ఒక ఇంగ్లీషు బిట్టుకి సమానమైన భారతీయ భాషల బిట్లనూ (x), అనుమాదానికి అవసైరమైన అదనపు బిట్టనూ (y), పేర్కొనబడ్డాయి. ఇంగ్లీషు, జర్మన్ భాషల మధ్య జరిగినట్టుగా కాకుండా, ఇక్కడ కొంత పరొక్షమార్గంలో ఈ తులనాత్మక పరిశీలన జరిగింది. ఇందుకోసం ఇంగ్లీషు భాషలో వాడే అక్షరాల సంఖ్యను, భారతీయ భాషల వర్ణాలు లేక శబ్ద సముదాయాల సంఖ్యతో గణిందాం. అక్షరమాలలో, రాయడానికి అవసరమైన శబ్ద సముదాయాల్లో ఉండే తేడాలే కారణం.

పట్టిక - I

ఇంగ్లీషుతో పోల్చినప్పుడు భారతీయ భాషల్లో వుండే అర్థపరిణితి

| భారతీయ భాష | ఒక ఇంగ్లీషు విభాగానికి సరిపోయే అనువాదానికి అవసరమైన భారతీయ భాషల విభాగాల సంఖ్య x | అదనపు విభాగాలు y |
|---|---|---|
| హిందీ | 1.34 | 0.22 |
| తమిళం | 1.09 | 0.17 |
| మళయాళం | 1.24 | 0.08 |
| తెలుగు | 1.14 | 0.04 |
| కన్నడం | 1.14 | 0.07 |

ఈ తులనాత్మక పరిశోధనకు అవసరమైన వాచకాన్ని కథలు, వ్యాసాలు, ఆత్మకథలు, వ్యాపార రచనలు మొదలైన వివిధ రకాలవాటి నుంచి తీసుకున్నాం. అందువల్ల ఈ సంఖ్యలు కొద్దిగా అటూఇటూగా ఉండే అవకాశం కూడా ఉంది. అర్థాల్ని వీలయినంత పరిపూర్ణంగా అనువదించే పరిస్థితులనే ఇప్పుడు గమనిస్తున్నాం. అనువాదంలో కొంత అర్థం నష్టపోతున్నామన్న స్పృహతోనే ఈ పని చేశాం. ఏదిఏమైనా ఏ భాషయైనా మరో భాషతో పోల్చినప్పుడు బలహీనంగానే కనబడుతుంది. అందుకే అనువాదంలో అదనంగా పదాల్ని వాడవలసి వస్తోంది. ఇంగ్లీషు భాషలో ఉండే పదాల సరాసరి పొడవు 4.5 అక్షరాలైతే జర్మనీలో 6 అక్షరాలను గుర్తించడం అవసరం.

**వివిధ లిపుల సంబంధ లిప్యంతరీకరణ నైపుణ్యాలు :**

ఆలోచనల్ని వివిధ రకాలుగా సంకేత రూపంలో తెచ్చే విధానాన్నే వివిధ భాషలుగా గుర్తిస్తున్నాం. మాటలోని వివిధ శబ్దాలను వివిధ రకాల సంకేతాలుగా భాషలు అనువదిస్తున్నాయి. పరిణతిని కొలవడానికో మార్గమున్నప్పుడే లిపులను తులనాత్మకంగా పరిశీలించడం సాధ్యపడుతుంది. నిజానికి లిపులలోని పరిణతిని కొలవడానికి మనకు చాలా మార్గాలున్నాయి. వాటిని నేర్చుకోవడంలో ఉండే సులువును గమనించవచ్చు. యంత్రాలు వాటిని గుర్తించడంలో ఉండే కచ్చితత్వాన్ని పట్టించుకోవచ్చు. చదవడంలో ఉన్న వేగాన్ని కొలబద్దగా అనుకోవచ్చు. వాటికి ఉన్న సౌందర్యాన్ని పోల్చి చూడవచ్చు. మరొక ముఖ్యమైన పద్ధతి ఆ లిపిని రాయగలిగే వేగాన్ని లెక్కించడం. లిపి పరిమాణాలను గమనించినప్పుడు రాయగలిగే వేగానికి, స్పష్టతకూ మధ్య సమతుల్యాన్ని సాధించడం కోసం చేసిన ప్రయత్నాలు బోధపడతాయి.

ఇప్పుడు చర్చకోసం రోమను లిపినీ, అనేక రకాల భారతీయ లిపులనూ తీసుకుందాం. భారతీయ లిపుల బదులుగా రోమను లిపిని వాడడం వల్ల ఏమైనా అదనపు సౌకర్యం చేకూరుతుందా అని గమనిద్దాం. ముందుగా భారతీయ లిపుల శబ్దాలను రోమను లిపి యథాతథంగా అనువదించలేనిదని అర్థమవుతుంది. కానీ క్రమంగా ఈ రోమను లిపి, ఇంగ్లీషు, జర్మను, ఫ్రెంచి మొదలైన భాషలకు ఉపయోగపడుతుందని ఊహిద్దాం. వేగంగా రాయగలగడాన్నే ముఖ్యమైన అంశంగా భావిద్దాం. అయితే ఈ రకమైన పరిశీలనకు అవసరమైన గణాంక విధానాలు చాలా పెంపొందాయి. ఉదాహరణకు మందుల ప్రభావాన్ని గుర్తించడం కోసం గినియా పందుల్లో వచ్చే మార్పుల్ని పరిశీలించడమూ, వివిధ రకాల బోధనల పరిణతిని తెలుసుకోవడం కోసం విద్యార్థుల్లో వచ్చే పరిణతిని లెక్కించడమూ జరుగుతోంది.

మనం ఇప్పుడో పద్ధతిని అనుసరించబోతున్నాం. దాదాపు 60 మందిని, రోమను, దేవనాగరి లిపులు రెండూ రాయగలిగిన వాళ్లను కొన్ని అర్థం లేని పదాల్ని చూసి రాయమని అడుగుదాం. వాళ్లు తీసుకునే కాలాలను లెక్కిద్దాం. వివిధ రకాల అక్షరాల్ని, అచ్చుల్ని, హల్లుల్ని రాయడానికి పట్టే కాలాన్ని గమనిద్దాం. దాదాపు 60 జతల సమయాల్లో వివిధ లిపుల్ని రాయడానికి పట్టిన కాలాన్ని పోల్చిచూద్దాం. బాగా వేగంగా రాయగలిగిన వాళ్ళనూ, అంత వేగంగా రాయలేని వాళ్లనూ అందరినీ తీసుకుందాం. చెప్పిన మాటల్ని రాయమని అడగకుండా చూసి రాయమనడం వల్ల వాళ్ల అక్షర దోషాల్ని మనం వదలిపెడుతున్నాం. పరీక్ష పెడుతున్నామని చెప్పకుండా వీలయినంత సాఫీగా వాళ్ళను రాయమని చెబుతున్నాం. అందరూ కనీసం ఉన్నత పాఠశాల చదువులు చదివినవారై ఉండాలి. వాళ్ళ రాతల పద్ధతిని బట్టి మూడు రకాలుగా విభజిద్దాం. (1) రోమను లిపి రాయడంలో బాగా అభినివేశం ఉన్న వాళ్ళు, (2) భారతీయ లిపులు రాయడంలో బాగా ఆరితేరిన వాళ్ళు, (3) రెండింటిలోనూ సమానమైన ప్రతిభ ఉన్న వాళ్ళు.

వీళ్ళందరూ ఈ రెండు లిపులలోనూ రాయడం వల్ల పరస్పర లిపుల ప్రభావాలతో ఉండే ఉంటారని అనుకుందాం. ఆ లిపులు రాయడానికి పట్టే కాలాలను పోల్చి చూసినప్పుడు ఒక లిపిలో వేగంగా రాయగలిగిన వారు, మరో లిపిలో కూడా వేగంగానే రాస్తున్నారని తెలుస్తుంది.

ఇప్పుడు మనం తెలుగు లిపిని పోల్చి చూద్దాం. రెండు లిపులకూ చెందిన మూడు వర్గాల రాతల రాయడానికవసరమైన సరాసరి సమయాన్ని Eij అనుకుంటే (1) లిపి, (2) సాధన (3) తప్పుల ఆధారంగా కొలవగలిగిన ఉత్తమ సరాసరి.

$$\mu = \sum_{i,j} \xi_{i,j} \; (i = 1,2; \; j = 1,2,3), \text{ i.e.}$$

$$\xi_{i,j} = \mu + \alpha_i + \beta_j + \varepsilon_{i,j}$$

గణాంక శాస్త్రం ప్రకారం:

$$\mu = \sum^{3} \alpha_i = 0, \quad \sum^{2} \beta_j = 0, \quad \sum^{3} \varepsilon_{i,j} = \sum^{2} \varepsilon_{i,j} = 0$$

ఈ సంబంధాన్ని ఉపయోగించి, పట్టిక 2ను ఇలా రూపొందించవచ్చు:

**పట్టిక-2**

**లిపి, సాధన, తప్పులు ఆధారంగా సరాసరిని గణించడం**

| సాధన చేసే పద్ధతి | సరాసరి లిపి రాత<br>రోమను లిపి | తెలుగు లిపి |
|---|---|---|
| ఇంగ్లీషు సాధన చేసిన వాళ్ళు | $\xi_{i,j} = \alpha + x_1 + \beta_1 + \varepsilon_{11}$<br>$176 = 164 + 7 + 13 - 8$ | $\xi_{12} = \mu + x_1 + \beta_2 + \varepsilon_{11}$<br>$166 = 164 + 7 - 13 + 8$ |
| తెలుగు సాధన చేసినవారు | $\xi_{i,j} = \mu + \alpha_2 + \beta_2 + \varepsilon_{21}$<br>$192 = 164 + 7.5 - 13 + 7.5$ | $\xi_{12} = \mu + \alpha_2 + \beta_2 + \varepsilon_{22}$<br>$151 = 164 + 7.5 - 13 - 7.5$ |
| రెండూ సమానంగా సాధించిన వారు | $\xi_{31} = \mu + \alpha_3 + \beta_1 + \varepsilon_{21}$<br>$163=164-14.5+13+6.5$ | $\xi_{32} = \mu + \alpha_3 + \beta_2 +$<br>$136=164-14.5-13-6.5$ |

$\mu$ అనే పరిమాణం వివిధ లిపులను రాసే సమయాల సరాసరి సమయాన్నీ, వివిధ రాతగాళ్ళ తరగతులనూ పేర్కొంటూ, x గా పేర్కొనబడుతూ సాధన పరిణతులకు మధ్య సమతుల్య స్థితిని గుర్తిస్తూ, $\beta_i$ ని లిపి ప్రభావాన్ని y గా పేర్కొంటూ, తేడాల్ని ఏర్పరుస్తోంది. అనే సామాన్యతను పేర్కొంటూ కొలుస్తోంది. అలాగే $\mu$ సాధనపైన లిపి ప్రభావాన్ని కొలుస్తోంది.

$x_1$, $x_2$, $x_3$, అనే ఈ మూడు వర్గాల మధ్య సాధనలో తేడా లేకపోతే రోమను తెలుగు లిపుల మధ్య ఉండే సరాసరి రాత సమయం $\mu + B_1$ అవుతుంది. $\beta_i$ +B2 అవుతుంది. అప్పుడు తప్పుల్ని గణించడంలేదు.

$\mu + B_1 = 177$
$\mu + B_2 = 150$ సెకండ్లు
} రోమను తెలుగు శబ్దాల్ని లిపిగా మార్చడానికి పడుతున్న సమయం.

పట్టిక అచ్చుల్నీ, హల్లుల్నీ (consonants, vowels) తెలుగు లిపిలో వేగంగా రాయవచ్చుననీ నిరూపిస్తోంది. భారతీయ భాషల్లో ఒక పద భాగానికి అక్షరంగా రాయడం కుదురుతుంది. ఇంగ్లీషులో రెండు అక్షరాలవసరమవుతున్నాయి.

ఇప్పుడు రోమను లిపి కంటే తెలుగు లిపికున్న సౌలభ్యం పెద్దదేం గాదు. వాటి తులనాత్మక రాత పరిణతిని లెక్కించడం కోసం వేరే రకాల పదాలను గూడా గమనించాలి.

తెలుగు లిపిలో తెలుగు వాచకాన్ని రాయడానికి అవసరమైన సమయమూ, రోమను లిపిలో రాయడానికి అవసరమైన సమయమూ : నిష్పత్తి

$P_1$= తెలుగులో అవి వచ్చే ఆవశ్యకతలు

$$\frac{p_v(\mu + \beta_2)_v + p_{cv}(\mu + \beta_2)_{cv} + \ldots + p_{ccvc}(\mu + \beta_2)_{ccvc}}{p_v(\mu + \beta_1)_v + p_{cv}(\mu + \beta_1)_{cv} + \ldots + p_{ccvc}(\mu + \beta_1)_{ccvc}}$$

(బ్రాకెట్లలో ఉన్నవి వివిధ రకాల అక్షరాలు)

ఈ సమీకరణాలు చెబుతున్నదేమిటంటే :–
తెలుగులో నిష్పత్తి : 0.94
ఇతర భారతీయ భాషల్లో నిష్పత్తి :
తమిళంలో : 1.09, కన్నడంలో : 1.05, దేవనాగరిలో : 1.06, మలయాళంలో: 0.95

ఈ స్వల్పమైన తేడా – భారతీయ భాషలకు రోమను లిపిని వాడడం వల్ల, రాయడానికి పట్టే సమయంలో పెద్ద తేడా ఉండదని తెలుపుతోంది.

సమాచార సేకరణ, వ్యాప్తి పెద్ద ఎత్తున జరుగుతున్న నేటి కాలంలో యిటువంటి తులనాత్మక పరిశీలన అవసరమెంతో ఉంది. మనం సమాచారం ఎక్కువగా ఉండటంతో తృప్తిపడం. ఆ సమాచారానికి వేగంగా స్పందించాలనుకుంటాం కదా!

ఆ సమాచారమంతా మనకు భాషద్వారానే అందుతోంది. గతంలో పరిసరాలపైన మానవుడికి ఉండే నియంత్రణతో బాటు అతడి భావ వినిమయ పరిణతి కూడా పెరుగుతూ ఉండేది. భాష అన్నది మానవుడి ఆయుధం ఇప్పుడు అతడు యంత్రాలకు రాయడమూ, చదవడమూ నేర్పిస్తున్నాడు. తన భాష ద్వారా యంత్రాలతో ముఖాముఖికి సన్నద్ధమవుతున్నాడు. గతంలో లిపి, ప్రచురణా భాషపైన ప్రభావాన్ని చూపాయి. అలాగే మనిషికి యంత్రాలతో జరుగుతున్న భావ వినిమయం మరెన్నో మార్పులు తీసుకురాబోతుంది.

---

## డా. బి. ఎస్. రామకృష్ణ (1921–2011)



1921లో విజయనగరంలో జన్మించిన తెలుగుబిడ్డ కీ.శే. బి.ఎస్.రామకృష్ణ ధ్వనితరంగ శాస్త్రరంగంలో విశ్వవిఖ్యాత పండితుడు.

బి.ఎస్.రామకృష్ణ ఆంధ్ర విశ్వవిద్యాలయం నుండి బియస్సీ డిగ్రీని, వారణాసి విశ్వవిద్యాలయం నుండి ఎమ్మెస్సీ(భౌతికశాస్త్రం) డిగ్రీని పొందారు. తరువాత ప్రభుత్వ ఉపకారవేతనంపై ధ్వనితరంగశాస్త్రంలో పరిశోధన చేసి అమెరికాలోని చికాగోలో ఉన్న ఇల్లినాయిస్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ నుండి 1949లో పిహెచ్.డి.ని పొందారు.

ఆ తర్వాత ఆయన బెంగుళూరు లోని ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సైన్స్ (ఐ.ఐ.ఎస్.సి)లో ఎలక్ట్రికల్ కమ్యూనికేషన్ ఇంజనీరింగ్ (ఇసిఇ)లో అధ్యాపకుడిగా తన బోధననూ పరిశోధనలనూ ప్రారంభించారు. అక్కడే వివిధ హోదాలలో మూడు దశాబ్దాల పాటు అలుపెరగని పరిశోధన సాగించారు.

ఆయన విధుల్లోకి చేరగానే చేపట్టిన మొట్టమొదటి లక్ష్యం ఐ.ఐ.ఎస్.సి లో ఇసిఇ లో ఒక ధ్వనితరంగశాస్త్ర పరిశోధనలకూ పరీక్షలకూ ఉపకరించే విధంగా అత్యుత్తమ స్థాయిలో ఒక అద్భుతమైన అధునాతనమైన ప్రయోగశాలను నెలకొల్పడం. అందుకు ఎంతగానో కృషి చేశారు. అలాగే అక్కడే ధ్వనితరంగశాస్త్రానికి సంబంధించి ఒక పరిచయకోర్సును ప్రారంభించారు. ఇలా పాఠ్యప్రణాళికలోనికి పరిశోధనా ప్రయోగాలలోనికి ధ్వనితరంగ శాస్త్రాన్ని ప్రవేశపెట్టడం అనేది భారతదేశంలో అప్పటిదాకా లేదు. దీనికి ఆద్యులుగా మొట్టమొదటి ప్రయత్నం చేసిన ఘనత వీరికే దక్కింది.

బి.ఎస్.రామకృష్ణ ఆ ధ్వనితరంగశాస్త్ర బోధనల కోసం అనేక సాధారణ ప్రయోగాలు కనిపెట్టేవారు. తాను ప్రారంభించిన ప్రయోగశాలను తిరుగులేని విధంగా వృద్ధి చేశారు. ఇదంతా విద్యార్థులకు, భావిపరిశోధకులకు ధ్వనితరంగ శాస్త్రాన్ని సుబోధ గావించడం కోసమే. బోధనకు ఉపకరించే సంభాషణా సంకేతాల స్పెక్ట్రోగ్రాములను పొందడం కోసం సామాన్య ప్రయోగశాల సౌకర్యాలను అభివృద్ధి చేయడం వీరు కార్యనైపుణ్యానికి మచ్చుతునక.

బి.ఎస్.రామకృష్ణ ధ్వనితరంగ శాస్త్రాన్ని పూర్వస్నాతక, స్నాతకస్థాయి కోర్సులను బోధించేవారు. వారు బోధించే అంశాలలో ప్రకంపనలు (vibrations) తరంగ వ్యాపనం (wave propagation), సమాచార సిద్ధాంతం (information theory) సంభావ్యత సిద్ధాంతం (probability theory), యాదృచ్ఛిక ప్రక్రియలు (random prcesses), మొదలైనవి ముఖ్యమైనవి. ధ్వనితరంగ శాస్త్రాన్ని అధ్యయనం చేయాలనే ఆసక్తిని ఇనుమడింపజేసేలా భయాన్ని పోగొట్టేలా ఆయన తరగతి గదిలో ఇచ్చే శిక్షణ ఉండేది. ధ్వనితరంగ శాస్త్రం పరిశోధనలలోనూ వీరి మార్గదర్శకత్వంలో IISc వర్ధిల్లింది.

ధ్వని తరంగశాస్త్రానికి సంబంధించిన అన్ని అంశాలనూ ఆయన స్పృశించారు. పరిశోధనలోని లోతులను కనుక్కొంటూ అందులో ఉన్న ఆనందాన్ని అనుభవిస్తూ పరిశోధనపై ప్రేమను పెంచుకున్నారు. భారతీయ సంగీత వాయిద్యాల ధ్వని విశ్లేషణలపై వీరు చేసిన సైద్ధాంతిక విశ్లేషణాత్మక పరిశోధన సి.వి.రామన్ గారిని కూడా ఆకర్షించింది. అలాగే వీరూ సహ పరిశోధకులు విదేశీ భాషాలిపులపైనే కాక భారతీయ భాషా లిపులపైనా అనేక సాంకేతిక పరిశోధనలను చేశారు. ఇంతగా లోతైన పరిశోధనలను చేసినందువల్లనే ప్రపంచవ్యాపితంగా కీర్తి, అనేక ఉన్నత సంస్థలలో వివిధ పదవులు ఆయన్ని వరించాయి. 1980 నుండి 1986 వరకు హైదరాబాద్ విశ్వవిద్యాలయానికి వైస్ ఛాన్సలర్‌గా బాధ్యతలు నిర్వహించిన బి.ఎస్.రామకృష్ణ ఫిబ్రవరి 12, 2011న కీర్తిశేషులయ్యారు.

('కరెంట్ సైన్స్' 2011 మే 25 సంచికలో శ్రీ జి.వి.ఆనంద్ వ్యాసం ఆధారంగా)

-వావిలాల సుబ్బారావు

# చూడముచ్చటైన సంగీతం

**ఆ**రోజు రాత్రి డా॥యం.రాజం గారి వయొలిన్ వింటున్నాను. డి.డి.భారతి ఛానెల్‌లో చూస్తూ వింటున్నాను. సంగీత భారాన్ని కళ్ళు చెవులు పంచుకుంటున్నాయి. చెవులు మాత్రమే పొందవలసిన అనుభవాన్ని కళ్ళు కూడా పంచుకోవటం వల్ల సంగీత ఆస్వాదన దట్టంగా లేదు. టీవీలలో సంగీతం పూర్ణానుభవం ఇవ్వదనిపించింది. కచ్చేరీలు కూడా అంతే. ప్రత్యేకమే అయినా తక్కళ్లు మూతపడితేనే గుండె నిండుతుంది. కానీ మనసు ఊరుకోదు. "చూడు చూడు చేతులు ఎట్లా తిప్పుతున్నాడో.. కమాన్‌తో ఎట్లా కొడుతూ నాదం పుట్టిస్తున్నాడో..ఛాతీ అంటుంది. అది చూసి చెవుల అనుభవం మందగిస్తుంది.

ఎంత గాఢంగా విన్నా చెవులకు అందనంత లోతుల్లో నుండి వస్తాయి తరంగాలు. అబ్బ ఏమీ నీలాంబరి..గుండెలు పిండేసే నీలాంబరి. రాజంగారి వయొలిన్‌లోని ధ్వనులు ఏ నక్షత్రాల మధ్య నుండి వస్తున్నవో ఆమెకయినా తెలుసా? దివ్య సంగీతానికి తాను వాహకం మాత్రమేనా? 'నక్షత్రాం తర్నిబిడ నిఖిలగానం' అని శ్రీశ్రీ ఊరికే కల్పనగా అనలేదు. అతనికి ఆ నక్షత్రాంత నిర్నిబిడత తెలుసేమో! శ్రీశ్రీలో అభ్యుదయ లోకాల కల్పనలే చూశాం గానీ తాత్వికానుభవాలు ఎవరు గుర్తించారు. క్రమంగా తానే దూరం చేసుకున్నాడేమో! ప్రాపంచిక ప్రాధమ్యతకోసం రాజంగారి వయొలిన్ వాదనను కళ్ళు మూసుకుని వింటుంటే తీగలు గొంతుకు సమీపంగా వెళ్లినట్లుంటుంది. నాదంలో గాంభీర్యం, సంగీతంలో అహంకారం-ధీమా- గర్వం లాంటి మనో భావాలు గూడ ఉంటాయి. ఆమె వ్యక్తిగత స్వభావం ఏమో తెలియదు గాని-సంగీతంలో ఆ స్వభావం ధ్వనిస్తుంటుంది. భానుమతి గారి కంఠానికున్న పెడసరం ఈమె గారి కమాన్‌లో వినిపిస్తుంది. ఆమె కూతురు తక్కువ తిన్నారా? ఇద్దరూ ఒకరికొకరు ధీటుగా -సొహరాబ్, రుస్తుం లాగా శ్రీనాధుడు గౌడ డిండిమభట్టు లాగా, విద్యాచలం, సింహాచలం లాగ పోటీపడి....

రాజంగారి కచేరి 'కోణార్క ఫెస్టివల్'లో జరుగుతుంది. భవనేశ్వర్ నుండి వెళ్ళాం. రాజంగారి నాదం అంటే నాకొక వ్యామోహం. వినటం అరుదే అయినా వారి నాదం చెవులకు జ్ఞాపకం వస్తుంటుంది. ప్రత్యక్షంగా వినే అవకాశం వచ్చింది. నా సామిరంగా! ఏమి సంతోషం. ఆమె కూతురు- ఇద్దరు మనుమరాళ్ళు..మూడుతరాలు ఒకే కుటుంబంలో ఒకే బాణీలో- ఎంత వరప్రసాదం! కచేరికి ముందుగా మా పిల్లలు వారితో ఫొటోలు దిగారు. మధుమేహవ్యాధి లేనివాడు స్వీటు షాపులో కూర్చున్నట్లున్నది నా సంగతి.

కానీ ఆశించినంత ఆనందించలేక పోయాను. లోపం ఎక్కడున్నది? సంగీతంలో లేదు. నా ఆసక్తిలో లేదు. నాకున్న సంగీతజ్ఞానం ఎపుడూ పూజ్యమే. నాకు చెవులు మాత్రమే ఉన్నాయి. రాగం, తాళం... ఏ సాంకేతిక విషయాలూ తెలియవు నాకు. నా చెవులను నాదానికి తగిలించి కూర్చుంటాను. .................
నా సంగీతానుభవానికి తీర్పు కానవాలు చెప్పవలసిందే. చేతులు తాళం వేయవచ్చు. పాదాలు చిందులూ వేయవచ్చు.

ప్రత్యక్షంగా నిన్న కచేరిలో నా అనుభవం నిరాశ పడ్డది. నిర్వాహకులు ఎంతగొప్ప ఏర్పాట్లు చేశారు! ఎంత అద్భుతమైన ఆహ్వానం! ఎంత మర్యాద! కళలు సంస్కృతుల పట్ల, కళాకారుల పట్ల ఒరియా వారి గౌరవాన్ని, ఆదరాన్ని ప్రకటించే తీరు తెన్నులకు తన్మయపడ్డాను. కళలపై అంత బహిరంగ గౌరవం ఆంధ్రదేశంలో నేను చూడలేదు. 'ఇంత సంగీత మన్నన సాధ్యమా?' అని చిన్నబుచ్చుకున్నాను. రాజుగారి కొలువుకు సాక్షాత్తూ ఏ సంగీత సరస్వతియో, నారద తంబూరతో దిగివస్తే రాజు ఎంత గౌరవం చేస్తాడని కవులు ఊహిస్తారో, వర్ణిస్తారో- అంత చేశారు కోణార్క ఫెస్టివల్ నిర్వాహకులు. అది చూసి నా పులకరింతలో నా అనుభవ శక్తి కొంత అక్కడే ఖర్చయిపోయింది. ఆమె సమీపంలో నిలబడ్డానన్న సంతోషంతో మరికొంత ఇప్పుడు సంగీతం వినటం కాదు, చూస్తున్నాను. తన కూతురు- తన ఇద్దరు మనుమరాళ్ళు, తన సంగీత ప్రతిధ్వనులను రెట్టింపుగా పలికిస్తుంటే, వింటున్న ఆ వృద్ధ సంగీతమాలి, మనసులోని మురిపాలను ఊహిస్తూ, అసలు సంగీతాన్ని పదిపాళ్ళే విన్నానేమో. అందువల్ల నా సంగీతాస్వాదన తగినంత దట్టం కాలేకపోయింది. ఇదీ గొప్ప అనుభవమే కానీ సంగీతాస్వాదనను సైడు కర్టెన్‌లోకి నెట్టేసింది.

ఒకప్పుడు మహా మార్దంగికుడు శ్రీ పాల్ఘాట్ మణి అయ్యర్ త్యాగరాజ ఆరాధనోత్సవాల కమిటీకో, మద్రాస్ మ్యూజిక్ అకాడమీకో అధిపతిగానో ఉన్నప్పుడు వాళ్ళ కచ్చేరీలు రేడియోలో ప్రసారం కావటానికి అంగీకరించలేదు. శ్రద్ధ గల శ్రోతలకు అవకాశాన్ని దూరం చేసినా, అందులో నిష్ఠగల వారికి నిజమేననిపించింది. నాకు ఇప్పుడు తెలిసింది.

సంగీతం అంటే నాదసౌందర్య వైవిధ్యం ఒక్కటే కాదు. ఆ

విద్వాంసుని వల్ల వారి పాటకు ఒక స్వభావం కూడా అబ్బుతుంది. ఒక వ్యక్తిత్వం వస్తుంది. కవిత్వంలో అలంకారాది భాషా నైపుణ్యాలను మించి కవి కనిపించనట్లే సంగీతంలో కూడా సాంకేతిక విషయాలను మించి సంగీత విద్వాంసుని మూర్తి కనిపిస్తుంది. దాన్ని సంగీతంలో ఏమంటారు? అదేనా మనోధర్మమంటే.

ఒకసారి 1980–82 మధ్య విశాఖపట్నంలో బాలమురళీకృష్ణ గారి కచేరికి వెళ్ళాను. ఎవరు పరవశించరు? పాటే కాదు మాట కూడా సంగీతమే. ఒక చమత్కారం రంగరించుకొని ఉంటాయి వారి వాక్కులు. వారి మాటలకు 'వాక్కులు' అనే అనబుద్ధి అవుతుంది. అర్థం ఒకటే అయినా ఏదో వాతావరణ భేదం ఉంటుంది. నాల్గురోజుల తర్వాత యం.యస్.బాలసుబ్రహ్మణ్యశర్మ గారి కచ్చేరి ఏర్పాటయింది. గొప్ప సంగీతం ఇట్లా కూడా ఉంటుందా? అనిపించింది. వొయ్యారాల సంగీతానికే అలవాటయిన చెవులకు ఇది కొత్త వ్యక్తిత్వంలా అనిపించారు.

ఇంటికి వెళ్ళాక రెండు సంగీతాల జ్ఞాపకాలు వెంటపడ్డాయి. కొంచెమైనా పాడగలిగిన వాడయితే తన సంగీత జ్ఞాపకాలను కూనిరాగంతో మననం చేసుకునేవాడు. అందులో నేను పరమమూగవాడిని. నాలో దృశ్యాల రూపంలో మననం అయ్యాయి. 'సంగీతంలో ఇద్దరు బాలురు' అని ఎక్కడో రెండు పేజీలు వ్రాసుకున్నాను. ఎక్కడ పోయిందో.

దాని సారాంశం ఏమంటే 'సంగీతం తల్లి' చంకనెక్కి కూర్చుని గారాబాలు పోతూ మారాం చేసే ముద్దులకొడుకు బాలమురళీకృష్ణ, తన మారంతో నానా అల్లరీ పెడతాడు ఆమెను. ఆ అల్లరి ఆమెకూ ఇష్టమే. చూసే మనకూ బాగానే వుంటుంది. అది తల్లీపిల్లల మురిపాల సల్లాపం. బాల సుబ్రహ్మణ్య శర్మ గారు, ఆ తల్లితోపాటు తిరునాళ్ళకు వెళ్ళి, జనంలో తప్పిపోయి తల్లికోసం పరితపించే పిల్లవాడు బెంబేలు పడతాడు. ఆర్తితో కనపడదేమో నన్న బెంగతో బావురు మంటాడు. చూసేవాళ్ళకు కూడా "పాపం బిడ్డ ఎంత కక్కటిల్లిపోతున్నాడో" అనిపిస్తుంది. ఇద్దరి 'నగుమోము' కీర్తనలు వింటే ఈ దృశ్యం కనిపిస్తుంది. ఇన్ని సంగీత వ్యక్తిత్వాలు ఒక విద్వాంసునిలో గండపెండేరాల గర్వం కనిపించవచ్చు. మరొకరిలో పాండిత్య లౌక్యం కనిపించవచ్చు. వేరొకరి జీవితంలోని విశృంఖలత్వం వారి కచేరీలోనూ విహరించవచ్చు.

మహావాది వెంకటప్పయ్యగారని ఒక విశృఖల గాయకుడు ఉండేవాడు. ఆకాశవాణితో పేచీపడి రేడియో శ్రోతలకు దూరమయినాడు కానీ కచేరీ శ్రోతలకు ఆయన ఒక ఉధృత సాగరం. బాలసుబ్రహ్మణ్యశర్మగారు మహావాదివారిని గురువుగా సంబోధించేవారు. 1966లో ఆయన కచేరి చివరగా విన్నాను. శర్మగారిలోను మహావాదిగారిలోను ఒకే రకమైన సంగీత వేదన వినిపించేది నాకు. మహావాది గాత్రంలో నాదస్వరధర్మం ఉందనేవారు నల్లాన్ చక్రవర్తుల కృష్ణమాచారి గారు.

కొందరి సంగీతంలో వ్యక్తిత్వ ధర్మాలు కూడా స్పష్టంగా కనిపిస్తాయి. వారి శ్రేణి వేరు. టీవీ సంగీతంలోనూ, దృశ్యాడంబరంలోనూ సంగీతాస్వాదన పలుచబడుతుంది. అయినా అదీ గొప్ప అనుభవమే.

–రచయిత ఫోన్ : 98664 02973



ఫిబ్రవరి 21, 2016 ఆదివారం మాతృభాషా దినోత్సవం' సందర్భంగా కేంద్ర మానవవనరుల అభివృద్ధి మంత్రిత్వశాఖ ఆధీనంలోని నేషనల్ బుక్‌ట్రస్ట్ ఇండియా నెల్లూరు లోని హోటల్ ప్రెసిడెంట్స్ ఇన్‌లో నిర్వహించిన 4 పుస్తకాల ఆవిష్కరణ దృశ్యం. చిత్రంలో శ్రీమతి పాతూరి అన్నపూర్ణ, శ్రీమతి చంద్రలత, ఆవిష్కర్త ఆచార్య వి.వీరయ్య (ఉపకులపతి, విక్రమసింహపురి విశ్వవిద్యాలయం, నెల్లూరు) శ్రీ పెరుగు రామకృష్ణ, డా॥గంగిశెట్టి శివకుమార్, ఎన్.బి.టి తెలుగు సంపాదకులు డా॥పత్తిపాక మోహన్

-చలసాని నరేంద్ర

# తెలుగు రాష్ట్రాలను ఆకట్టుకొంటున్న ఫిరాయింపు రాజకీయాలు

సైద్ధాంతిక రాజకీయాలకు పేరుబడిన తెలుగు రాష్ట్రాలలో తొలి నాటి నుండి కాంగ్రెస్, వామపక్షాలు, కాంగ్రెస్ వ్యతిరేక పక్షాలుగా జరిగాయి. చాలాకాలం కాంగ్రెస్ ఏకచత్రాధిపత్యం సాధించినా సైద్ధాంతిక పటుత్వం ఉన్న నాయకులు అనేకమంది ఉన్నారు. ప్రపంచంలో ఎన్నికల ద్వారా మొదటి కమ్యూనిస్ట్ ప్రభుత్వాన్ని ఆంధ్ర రాష్ట్రంలో ఏర్పాటుకు సన్నాహాలు చేసారు. ఎన్నికల ముందే మంత్రివర్గాన్ని కూడా ప్రకటించారు. అయితే నాటు వామపక్ష సిద్ధాంతాలను వ్యతిరేకించిన టంగుటూరి ప్రకాశం పంతులు, ఆచార్య యన్ జి రంగా వంటి వారు కాంగ్రెస్ తో చేతులు కలిపి ఆ ప్రయత్నాన్ని తిప్పి కొట్టారు.

స్వాతంత్ర్య కాలం నుండి వామపక్ష భావాల ప్రభావం నుండి యువతను తప్పించడం కోసం ఆచార్య యన్.జి.రంగా వంటి వారు రాజకీయ పాఠశాలలు కూడా నిర్వహించేవారు. తెలంగాణలో జరిగిన సాయుధ పోరాటంలో తొలి కమ్యూనిస్ట్ విప్లవ ప్రభుత్వం ఏర్పాటుకు సహితం అంచనాలు వేసుకున్నారు. స్వాతంత్ర్యం తరువాత స్వతంత్ర పార్టీ, భారతీయ జనసంఘ్ వంటివి కాంగ్రెస్ వ్యతిరేక రాజకీయాలతో వామపక్షాల ప్రభావాన్ని తగ్గించే ప్రయత్నం చేశాయి.

అయితే జనత పార్టీ ఆవిర్భావం నుండి రాజకీయ విలువలు సన్నగిల్లి, అధికార రాజకీయాలు చోటుచేసుకోవడం ప్రారంభం అయ్యాయి. ఇప్పుడు ఏకంగా తెలుగు రాష్ట్రాలలో ఫిరాయింపు రాజకీయాలకు పెద్ద పీట వేస్తున్నారు. అధికార పార్టీలు ప్రతిపక్షాలకు చెందిన ప్రజా ప్రతినిధులను ఆకట్టుకొని, వారికి ప్రభుత్వంలో ప్రాధాన్యత కల్పిస్తున్నాయి.

పార్టీలు మారడం కొత్తేమీ కాదు. అయితే గతంలో పార్టీ మారిన వారు పాత పార్టీ ద్వారా లభించిన అధికార పదవులకు రాజీనామా చేసి, తిరిగి ఎన్నిక కావడం కోసం ప్రజల ముందుకు వెళ్ళడం అలవాటు. ఇప్పుడా సాంప్రదాయానికి సహితం తిలోదకాలు ఇస్తున్నారు. పార్టీ ఫిరాయింపుల నిరోధక చట్టం అలంకరణ వస్తువుగా మిగిలి పోయింది. పార్టీ మారినవారు ప్రతిపక్ష పార్టీ ప్రజా ప్రతినిధిగా మంత్రి పదవిలో కూడా కొనసాగడం జరుగుతున్నది.

బంగారు తెలంగాణ కోసం, రాజకీయాలు పక్కన పెట్టి, అంత కలసి పని చేయడం కోసం, ప్రజల బాగు కోసం పార్టీ మారుతున్నామని ఈ సందర్భంగా తెలంగాణ రాష్ట్రంలో ఫిరాయింపుదారులు తమ చర్యలను సమర్థించుకొంటున్నారు. పైగా ప్రజల అభీష్టం మేరకే చేరుతున్నామని చెప్పుకొంటున్నారు. అంతగా ప్రజల మద్దతు ఉంటె తమ పదవులకు రాజీనామా చేసి, అధికార పార్టీలో చేరి ఉంటె వారి గౌరవమే కాకుండా రాజకీయ విలువలను సహితం గౌరవించినట్లు కాగలదు కదా.

తెలంగాణ ముఖ్యమంత్రి కె.చంద్రశేఖర్‌రావు తెలుగుదేశం పార్టీ నుండి బయటకు వచ్చినపుడు ఆ పార్టీ ద్వారా లభించిన శాసన సభ్యత్వానికి, ఆ పార్టీ ద్వారా వచ్చిన డిప్యూటీ స్పీకర్ పదవికి కూడా రాజీనామా చేసి, ఆ తరువాతనే టి. ఆర్.యస్ ను ఏర్పాటు చేసారు. మళ్లి ఉపఎన్నికల్లో పోటీ చేసి గెలుపొందారు. తెలంగాణ ఉద్యమం





సందర్భంగా పలు సందర్భాలలో ఆ పార్టీ ప్రజా ప్రతినిధులు రాజీనామాలు చేసి, తిరిగి గెలుపొందిన సందర్భాలు ఉన్నాయి. అవే సాంప్రదాయాలను ఇప్పుడు ఎందుకు టి.ఆర్.యస్ అనుసరించడం లేదు? ఫిరాయింపు దారులకు ప్రజల మద్ధతు లభించదని వెనుకడుగు వేస్తున్నారా?

ఇక ఆంధ్ర ప్రదేశ్‌లో కూడా తెలంగాణ రాష్ట్రం నుండి ఇదే వరవడిని తెలుగుదేశం పార్టీ అనుసరించడం ప్రారంభించింది. తనకు 21 మంది యం.యల్.ఏల మద్ధతు అదనంగా లభిస్తే గంట సేపట్లో చంద్రబాబు నాయుడు ప్రభుత్వాన్ని కూలగొడతాను అని ప్రతిపక్ష నాయకుడు వై.యస్.జగన్మోహన్‌రెడ్డి యధాలాపంగా చేసిన ప్రకటనకు అధికార పక్షం తీవ్రంగా స్పందించింది. వెంటనే ప్రతిపక్షం నుండి ఫిరాయింపులను ప్రోత్సహించడం ప్రారంభించింది.

వాస్తవానికి ఎన్నికల అనంతరమే ప్రతిపక్షం నుండి పలువురు అధికార పక్షంలో చేరడానికి సిద్ధపడ్డారు. అయితే పార్టీలో ఉన్న వారికి ముందు పదవుల పంపకం జరగాలి, కొత్తవారితో ఇబ్బందులు ఎందుకని ఫిరాయింపులను ప్రోత్సహించలేదు. ఇప్పుడు జగన్మోహన్ రెడ్డి ప్రకటనతో అటువంటి సంశయాలను ప్రక్కన పెట్టి "చివరకు నీ పార్టీలో నీవు ఒక్కడివే మిగులుతావులే" అంటూ జగన్మోహన్‌రెడ్డికి శాపాలు పెట్టే వరకు వెడుతున్నారు.

అయితే తెలుగుదేశం పార్టీ ఏర్పాటు చేసినప్పుడే ఈ సమస్య వచ్చినదని గుర్తుంచుకోవాలి. పార్టీ ప్రారంభం సమయంలో మాజీ ముఖ్యమంత్రి నాదెండ్ల భాస్కరరావుతో పాటు మరో ముగ్గురు యం.యల్.ఏ లు సహితం ఆ పార్టీలో చేరుతున్నట్లు ప్రకటించారు.

అయితే వారు తమ శాసన సభ్యత్వాలకు రాజీనామా చేసి రావాలని పార్టీ వ్యవస్థాపకులు యన్.టి.రామారావు స్పష్టం చేయడంతో ఆ ముగ్గురు వెనుకడుగు వేశారు. కేవలం భాస్కరరావు మాత్రమే యం.యల్.ఏ పదవికి రాజీనామా చేశారు.

పార్టీ ప్రారంభం అనంతరం తిరుపతిలో జరిగిన తొలి మహా నాడులో పార్టీ మారిన వారు ఎవ్వరైనా ఆ పార్టీ ద్వారా తమకు లభించిన పదవులకు రాజీనామా చేసి రావలసిందే అంటూ స్పష్టంగా పార్టీ విధానంగా పేర్కొంటూ ఒక తీర్మానం చేశారు. ఇప్పుడు ఆ తీర్మానానికి తెలుగుదేశం పార్టీ తిలోదకాలు ఇస్తున్నట్లు స్పష్టం అవుతున్నది.

రెండు తెలుగురాష్ట్రాల్లోనూ విచిత్రమైన రాజకీయ వాతావరణం రాజ్యమేలుతోంది. విపక్షానికి చెందిన ప్రజాప్రతినిధులను అధికార పార్టీ ముందు శరణు, శరణంటూ సాగిలపడే విధంగా అధికార పక్షం పరిస్థితులను సృష్టిస్తోంది. విపక్ష సభ్యులను లొంగదీసుకోవ టానికి ఆకర్ష్ అనే ప్రమాదకరమైన క్రీడకు తెలుగురాష్ట్రాల్లోని అధికారపక్షాలు ఏకకాలంలో తెరలేపుతున్నాయి. ఇందులో భాగంగానే విపక్షానికి చెందిన శాసనసభ్యులు, లోక్‌సభ సభ్యులను లొంగదీసు కోవటానికి ఇరు రాష్ట్రాల్లోని అధికారపక్షాలు సామ, దాన భేద, దండోపాయాలను ప్రయోగిస్తున్నాయి.

పైకి రాజకీయ ప్రత్యర్థులుగా కనిపిస్తున్నా తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఇద్దరూ పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహించడంలో ఒకే పంథాను అనుసరిస్తూ ఉండటం ఆసక్తి కలిగిస్తున్నది. మొన్నటి వరకు తెలంగాణ లో తెలుగుదేశం పార్టీకి చెందిన ప్రజా ప్రతినిధులు టి.ఆర్.యస్ లో చేరుతూ ఉంటే తమ పార్టీ వల్లన లభించిన అధికార పదవులకు రాజీనామా చేయకుండా వెళ్ళడం ప్రజాస్వామ్యాన్ని అప హాస్యం చేసినట్లే అని తెలుగుదేశం నాయకులు విమర్శలు గుప్పిం చారు. కాని ఇప్పుడు ఆంధ్రప్రదేశ్‌లో అదే విధంగా వారు చేస్తూ ఉండటం గమనార్హం.

తెలంగాణలో కెసిఆర్ ఆకర్ష్ పథకానికి బాధితుడైన చంద్రబాబు నాయుడు ఏపిలో అదేవిధమైన ఆయుధాన్ని ప్రతిపక్షంపైకి ప్రయోగి స్తున్నారు. తెలంగాణాలో కెసిఆర్ ప్రయోగిస్తున్న ఆకర్ష్ పథకాన్ని ఒకపుడు చంద్రబాబు తీవ్రంగా వ్యతిరేకించిన సంగతి తెలిసిందే. సంతలో పశువులను కొంటున్నట్లు కెసిఆర్ టిడిపి ఎంఎల్ఏలను కొంటున్నారంటూ పెద్ద ఎత్తున గతంలో ధ్వజమెత్తారు. ఆంధ్రప్రదేశ్ విషయానికి వచ్చేసరికి ప్రభుత్వం అమలు చేస్తున్న అభివృద్ధి పథకా లకు, కార్యక్రమాలకు ఆకర్షితులై అధికార పార్టీలో చేరుతున్నట్లు తెలుగుదేశం నాయకులు సమర్థించుకొంటున్నారు.

ఇద్దరు ముఖ్యమంత్రులు అనుసరిస్తున్న ప్రస్తుత పద్ధతులను చూస్తుంటే, భవిష్యత్తులో జరిగే ఎన్నికల్లో గెలిచిన వారందరూ అధికార పార్టీకి చెందిన వారే ఉంటారని అనుకున్నా ఆశ్చర్యపోనక్కర్లేదు. ఎందుకంటే, ప్రతిపక్షాల నుండి గెలిచిన వారందరినీ అధికార పార్టీలో తమవైపు తిప్పేసుకుంటే ప్రతిపక్ష శాసనసభ్యులనే వారే ఉండక పోవచ్చు. గతంలో కూడా దివంగత ముఖ్యమంత్రి వైఎస్ రాజశేఖర్ రెడ్డి హయాంలో ఇటువంటి ఘటనలు జరిగినా పార్టీని వీడిపోదామని అనుకుంటున్న వారిని గుర్తించి తమవైపు వైఎస్ లాక్కున్నారు. కానీ మూకుమ్మడిగా బేరాలు చేయలేదు.

ఈ సందర్భంగా పార్టీ ఫిరాయింపుల చట్టం అమలులో స్పీకర్లు అనుసరిస్తున్న నిర్లక్ష్య ధోరణి చర్చకు అస్తున్నది. ఫిరాయింపులపై చర్యలు తీసుకోవడానికి తమకు కాలవ్యవధి లేదు అన్నట్లు వ్యవ హరిస్తున్నారు. వై యస్ రాజశేఖర్ రెడ్డి హయంలో సహితం అసెంబ్లీ కాలపరిమితి ముగిసే వరకు గడిపి, చివరిలో స్పీకర్ నిర్ణయం ప్రక టించారు. ఇప్పుడూ అదే విధంగా చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. అయితే ఈ విషయం సుప్రీంకోర్టు పరిశీలనలో ఉంది. గతంలో రెండు రాష్ట్రాల విషయంలో ఒకచోట మూడు నెలల్లో, మరో చోట ఆరు నెలల్లో నిర్ణయం తీసుకోవాలని స్పీకర్‌ను ఆదేశించిన ఉదాహ రణలు ఉన్నాయి. ఇప్పుడు సహితం తెలుగు రాష్ట్రాల స్పీకర్లు ఎక్కువ కాలం కాలయాపన చేయలేని పరిస్థితులు ఏర్పడవచ్చు.

❊



–చెరుకూరి జ్యోతి

# జాతుల సమస్యతో ముడిపడిన మాతృభాషోద్యమం

**160** ఏళ్ళ భారత స్వాతంత్ర్యోద్యమం ఆర్థిక, రాజకీయాంశాలేకాక ముఖ్యమైన సాంఘిక సాంస్కృతిక సమస్యలకు వొక పరిష్కారాన్ని నేటికీ చూపలేదనటానికి భాషల సమస్యకూడా ఉదాహరణంగా నిలుస్తుంది. 70 ఏళ్ళక్రితం విడిపోయినప్పటికీ పాకిస్తాన్ దేశం కూడా మనలాగానే భాషాసమస్యలతో సతమతమౌతోంది.

ఫిబ్రవరి 21 ప్రపంచ మాతృభాషాదినోత్సవమని మనకంద రకూ తెలుసు. దానికి మూలం భారత ఉపఖండపు భాషల వివాదంలో వుంది. బంగ్లాదేశ్ ఏర్పడానికి పూర్వం దానిని తూర్పు పాకిస్తాన్ అనేవాళ్ళు. పాకిస్తాన్ దేశం ఉర్దూభాషను తన జాతీయ భాషగా స్వీకరించి, బెంగాలీలయిన తూర్పుపాకిస్తాన్ మీద రుద్దితే, దానికి వ్యతిరేకంగా పెద్ద ఆందోళనలు, అలజడులు జరిగాయి. 1952 ఫిబ్రవరి 21న ఢాకానగరంలో ఉర్దూతో పాటు బెంగాలీని కూడా జాతీయభాషగా చేయలంటూ సాగిన విద్యార్థి– ఉపాధ్యాయుల ఉద్యమాలపై పోలీసులు జరిపిన కాల్పులలో 8మంది అమరులైనారు. దాన్ని పురస్కరించుకుని 1999 నవంబరు 17న యునెస్కో నిర్ణయించి ప్రకటించినట్లు 2000వ సంవత్సరపు ఫిబ్రవరి 21 నుండి అంతర్జాతీయ మాతృభాషల దినోత్సవాన్ని జరుపుకుంటున్నాము.

నేటికీ భారత ఉపఖండంమీద ఇంగ్లీషు భాషాపెత్తనం వదల లేదు. ఇపుడు ఇంగ్లీషు భాషామాధ్యమంలో ప్రాథమిక విద్యనుండీ బోధించే తల్లక్రిందుల విద్యావిధానం సాగుతోంది. అంతేకాక ఏది జాతీయభాష అనే సమస్యకు కూడా పూర్తి పరిష్కారం లభించలేదనటానికి భారత– పాకిస్తాన్ దేశాలలో వ్యక్తమైన కొన్ని బలమైన అభిప్రాయాలు ఉదాహరణంగా నిలుస్తాయి.

ఫిబ్రవరి 21న, ముంబాయి నగరంలో జరిగిన గేట్‌వే సాహిత్యోత్సవంలో ప్రఖ్యాత సినీ దర్శకుడు ఆదూరు గోపాలకృష్ణన్ మాట్లాడుతూ "హిందీ చాలా సుందరమైన భాష, చాలా గొప్ప రచయితలు హిందీలో వున్నారనటానికి ఎలాంటి సందేహం లేదు. కానీ అంత మాత్రాన ఇతరులపై హిందీని రుద్దటానికి, పరిపాలనా వుండాలని కోరుకుంటున్నారు. కానీ ఆదొక విపరీత ధోరణి మాత్రమే. భారత దేశం అనేక విభిన్న సంస్కృతుల, భాషల, జీవన విధానాలుగల దేశం. ఈ అంశాన్ని సహజమైనదిగా భావోద్వేగాలు అనుమతించే విధంగా అవగాహన చేసుకోవాలి. హిందీని జాతీయ భాష అనీ, మిగిలినవి ప్రాంతీయ భాషలనీ భావించటం పొరపాటు. మన భాషలన్నీ ప్రాంతీయమైనవే. దేశంలోని ప్రజలందరూ ఏ భాషలోనైతే మాట్లాడుకుంటారో అపుడు మాత్రమే అది జాతీయభాష అనిపించుకో గలదు. కానీ యిప్పుడలా జరగటం లేదు.

"ఈశాన్య భారతంలోనూ, దక్షిణాపధాన హిందీ మాట్లాడరు. కనుక హిందీని జాతీయ భాష అని ఎవరూ పిలవకూడదు. ఇవన్నీ విభిన్న తెగలనడుమ, సంభాషించుకునే భాషలు మాత్రమే. హిందీని ఉత్తరాదిన మాట్లాడతారు కనుక అది ఎక్కువమందికి అర్థమవుతుంది. అయినప్పటికీ దాన్ని ప్రాంతీయభాషగానే పరిగణించాలి"

(ది హిందూ 22.2.2016)

మనకు స్వాతంత్ర్యోదమకాలంనుండీ "జాతి– జాతీయత– దేశము" అనే పదాలు కొంత గందరగోళాన్ని సృష్టిస్తూనే వున్నాయి. ఐరోపా ఖండంలో మొదట జాతిరాజ్యాలు (నేషన్ స్టేట్స్) ఏర్పడ్డాయి. అవి జాతి (నేషన్) అన్నా, రాజ్యమూ లేక దేశమూ అన్నా ఒకే అర్థంలో వినియోగించాయి. అవి దాదాపుగా ఒకే భాషను కలిగివున్న జాతి యొక్క రాజ్యాలు లేక దేశాలు. కానీ భారత ఉపఖండం అనేక భాషాజాతుల దేశం. ఇందులో కేవలం మాట్లాడే భాషలు వందల్లో వున్నాయి. రాయగలిగిన, స్వంత లిపి వున్న భాషలు పదుల్లో వున్నాయి. పాశ్చాత్య దేశాలలో ఫ్యూడలిజానికి వ్యతిరేకంగా జరిగిన పోరాటాల క్రమంలో, స్వంత మార్కెట్టు, వనరుల కోసం బూర్జువా వర్గాలు నిర్మాణం చేసినవే జాతి రాజ్యాలు (నేషన్ స్టేట్స్) అయితే మనం బ్రిటీషు సామ్రాజ్యవాద వ్యతిరేక స్వాతంత్ర్యోద్యమాన్ని (ఇండిపెండెన్స్ స్ట్రగుల్‌ని) జాతీయోద్యమం (నేషనల్ మూవ్‌మెంట్) అని పిలుచుకోవటానికి అలవాటుపడ్డాం. పాశ్చాత్యదేశాల జాతి రాజ్యాల (నేషనల్స్ స్టేట్స్) కొరకు జరిగిన ఫ్యూడల్ వ్యతిరేక పోరాటాన్ని మన సామ్రాజ్యవాద వ్యతిరేక స్వాతంత్ర్య పోరాటానికి సరి సమానమైనదిగా భావిస్తూ నేషనల్‌మూవ్‌మెంట్ అని పేరిడుకున్నాం.

మనకు అనేక భాషాజాతులు(లింగ్విస్టిక్ నేషనాలిటీస్) న్నప్పటికీ వాటి అభివృద్ధి చాలా అసమానంగా వుంటూ వచ్చింది. జాతీయ బూర్జువావర్గం అన్ని భాషాజాతులలో ఒకే స్థాయిలో అభివృద్ధి చెంద లేదు. కాకపోగా బ్రిటీషు సామ్రాజ్యవాదాన్ని అంటకాగిన బూర్జువా వర్గం త్వరగా పెరగగలిగింది. వారికీ, తమకు సాంఘిక పునాదిగా వుండిన ఫ్యూడల్ వర్గాలకూ, విడగొట్టిన (భారత– పాకిస్తాన్) దేశాల అధికారాన్ని 1947 బదిలీ చేశారు. బ్రిటీషువారి పెట్టుబడులు అట్టే వుండగానే అమెరికా తదితర దేశాల పెట్టుబడులు కూడా రంగ ప్రవేశం చేసి, చివరకు 1991లో సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు భారతపాలకవర్గాలు దాసోహమన్నాయి. ఇది వొక సంక్షోభం వెంట మరొక సంక్షోభానికి కారణమై అటు జాతుల అభివృద్ధినీ, ఇటు భాషావికాసాన్ని అడ్డుకుంటున్నాయి.

జాతీయ బూర్జువావర్గం వెనకబడిపోయినట్లే జాతుల భాషలు కూడా తగిన వికాసానికి నోచుకోకుండా, ఆధునిక జీవన ప్రక్రియల సమస్త రంగాల అవసరాలకు వినిమయం కాకుండా గిడసబారి పోయాయి. భారత రాజ్యాంగం మొదట 14 భాషలను జాతీయ భాషలుగా, హిందీ- ఇంగ్లీషులను అధికారభాషలుగా గుర్తించింది. ప్రస్తుతం 22 భాషలన్నారు. ఆచరణలో హిందీ- ఇంగ్లీషు భాషలు జాతీయభాషలుగా, మిగిలినవన్నీ ప్రాంతీయ భాషలేనన్నట్లు వ్యవ హారంలో చలామణి అవుతున్నాయి. నిజానికిప్పుడు హిందీతోసహా సమస్త భారతీయభాషలూ ఇంగ్లీషు భాషాపెత్తనానికి, వత్తిడికి గురయి తగిన వికాసానికి నోచుకోకుండా వున్నాయి.

ఇప్పుడొక్కసారి మన సహోదరదేశం పాకిస్తాన్ వైపు చూద్దాము. ఈ సంవత్సరపు మాతృభాషాదినోత్సవం (21 ఫిబ్రవరి) సందర్భంగా, యునెస్కో చేసిన ప్రకటన ప్రకారం "పాకిస్తాన్ దేశంలో ఉర్దూ మాధ్యమంలో చదువులు బోధించటం, రాజకీయ ఒడిదుడుకులకు దోహదపడుతోంది" (డెక్కన్ క్రానికల్ 22.2.20016)

మనదేశంలో చాలామంది ఉర్దూ పాకిస్తానీయుల భాష అనీ, హిందీ భారతీయ భాషనీ అనుకుంటుంటారు. కానీ ఉర్దూ పుట్టుకా పెరుగుదల పూర్తిగా భారతదేశంలోనే నన్న విషయంగానీ, మన హైదరాబాదుకి ఉత్తరప్రదేశ్ నుండి వలస వచ్చిన హిందువులలో అత్యధికుల మాతృభాష ఉర్దూనేననీ చాలామందికి తెలియదు. బూర్గుల రామకృష్ణారావుగారు "ఉర్దూభాష భారతదేశమునందు జనించి యభివృద్ధినొందిన, ముఖ్యమగు సంకీర్ణభాషలలో నొక్కటి.... హిందీ, ఉర్దూ ఈ రెండు భాషలూ ఒకే తల్లి కడుపున బుట్టిన యప్పచెల్లెండ్రని మరచిపోగూడదు" (బూ.రా.కృ.రచనలు పుట 227) అని రాశారు. పాకిస్తాన్‌కు సంబంధించినంతవరకు ఉర్దూభాష వలస భాష. ఆ దేశంలో అత్యధికులు మాట్లాడేది పంజాబీ ఇంకా సింధీ, బలూచీ, పస్తూ (వాయువ్య సరిహద్దు) సరాయికీ, (కొద్ది వేలమంది మాత్రమే మాట్లాడే 'బ్రాభుయి' అనే ద్రావిడ భాష కూడా వుంది) ఇవే అక్కడి ముఖ్యమైన భాషలు. ఇపుడు యునెస్కో "పిల్లలు అర్థం చేసుకోగలిగినట్టి వారి వారి ఇంటి భాషలోనే చదువులు నేర్పండి" అని సందేశమిచ్చింది. (డక్కన్ క్రానికల్ 22.2.2016) అంతేకాకుండా పాకిస్తాన్‌లో ఉర్దూని మాతృభాషగా కలిగినవారు కేవలం 8 శాతం మాత్రమేనని కూడా చెప్పింది. విద్యార్థులకు వారికి అర్థమయ్యే మాతృభాషల్లోనే చదువులు చెప్పండి. అందువల్ల అనవ సరపు రాజకీయ గొడవలు కూడా కొన్ని సమసిపోగలవని సూచిం చింది. ఇళ్ళల్లో ఉర్దూకాని హిందీని మాట్లాడే వారు భారతదేశంలో ఎందరున్నారు? ఖచ్చితమైన గణాంకాలు తీస్తే హిందీని కూడా పైకి కనిపించినంత మంది ఇంటి భాషగా వినియోగించరని బయట పడవచ్చు.

నిజానికి మనకిలాగానే పాకిస్తాన్ కూడా వివిధ భాషా జాతు లున్న దేశం. తన మతరాజకీయాలలో భాగంగా అక్కడి ప్రజలపై ఉర్దూని రుద్దారు. (బంగ్లాదేశ్ మొదట్లోనే దాన్ని ప్రతిఘటించి తమ బెంగాలీతనాన్ని నిలబెట్టుకుంది) ప్రపంచజ్ఞానాన్ని అందుకుని మన దేశీయభాషలలోకి అన్వయించుకోవటానికి ఇంగ్లీషు ఒక దూర దర్శినిలా మనకు అవసరమే. కానీ దాన్నే కళ్ళుగా చేసుకోమని మన పిల్లలపై వేలంవెర్రి స్థాయిలో ఇంగ్లీషుని రుద్దారు. మిగిలిన జ్ఞానేంద్రియాలు ముఖ్యంగా చెవులు తెలుగులో పనిచేస్తూ ఇంగ్లీషు కళ్ళతో చదువుకోవటంవల్ల జ్ఞాన సముపార్జనాక్రమం కుంటుపడి పోయి అటు ఇంగ్లీషూ, ఇటు తెలుగూ రాని తరాలు పెరిగి పోయాయి. ఈ పరిస్థితులకు మూలం పాలకుల దళారీతనంతో, సామ్రాజ్యవాద ప్రపంచీకరణకు లొంగిపోవటంలో వుంది. ఉత్తరాది ఫ్యూడల్‌శక్తులు- బడాబూర్జువా వర్గాలూ దేశమంతా హిందీని కృత్రిమంగా రుద్దే పనిలో భాగంగానే 'హిందూ- హిందీ- హిందూస్తాన్' లాంటి నినాదాలిస్తున్నారు. పాకిస్తాన్‌లో ముస్లిం మతోన్మాదులు ఉర్దూని ఎలా వినియోగించుకుంటున్నారో మనకు తెలియదుగానీ, ఇక్కడి హిందూ మతోన్మాదశక్తులు హిందీని ఏకైక జాతీయభాషగా రుద్దే వ్యూహాల్లో వున్నారు. బహుశా దాన్ని ఖండించటానికే ఆదూరి గోపాల కృష్ణన్ అలా మాట్లాడి వుంటాడనుకోవచ్చు. మనదేశంలో జరుగు తున్న దగాకోరు ఎన్నికలనే ప్రజాస్వామ్యంగా పాలకవర్గాలూ, వారి మీడియా, కొందరు మేధావులూ ప్రచారం గావిస్తున్నారు. సామాజిక వ్యవస్థలన్నీ- కుటుంబం నుండి కులం, మతం దాకా, విద్యావ్యవస్థ నుండి ఆర్థిక, రాజకీయాల దాకా- ప్రజాస్వామికం కావాల్సివున్నదనే స్పృహ కూడా లేకుండా ఆత్మవంచన చేసుకుంటున్న కాలంలో మనం జీవిస్తున్నాం. భాషా ప్రజాస్వామ్యం సాధించాలనీ, 'మాతృ భాషలో విద్యాబోధన- పరిపాలన' అన్నది ప్రజాస్వామిక కనీస జీవన లక్షణాలని నెత్తీనోరూ కొట్టుకున్నా వినిపించుకోవటానికి కొందరు సిద్ధంగా లేరు.

❊

-గెలివిత్తుల పాండియన్

# పాండ్యనాడులో తెలుగు వెలుగెత్తుతుంది

**మ**దురై అనే పేరు చెవిన వినగానే మీనాక్షమ్మ గుడి, తిరుమల నాయకరు మహల్, మల్లిపువ్వు, మల్లిపువ్వు (లాంటి) ఇడ్లీలు, గాంధి మ్యూజియం ఇలా ఎన్నో విషయాలు మీ గుర్తుకు వస్తూ ఉంటాయి.

గుడిలు, గోపురాలను చూసి వెళ్లడానికి అనో లేదా వేరే ఏది అయినా పనిగానో మదురైకి వచ్చిన వాళ్లకి అయితే ఇక్కడ తెలుగు వాళ్లు కూడా కొందరు ఉండారు అని అనుకొని ఉంటారు. నిజానికి కొందరు కాదు. ఇక్కడ తెలుగువాళ్లు పెద్ద గుంపు ఉన్నారు. ఆ మాటకి వస్తే మా పాండియనాడు అంతా కూడ నూర్లాది తెలుగు పల్లెలు ఉన్నాయి.

ఒకొక రాజు పాలించినపుడూ పాండియనాటి ఎల్లలు మారుతూ ఉండేవి. అయినా కూడా నేటి మదురై, తేని, దిండుక్కల్, విరుదునగర్, సివగంగై, రామనాదపురం, తూత్తుకుడి, తిరునెల్‌వేలి జిల్లాలు పాండియ మండలంగా గుర్తించపడుతాయి. ఆంధ్రకు దక్షిణంగా ఉండే తొండనాడు, కొంగునాడు, చోళనాడులకన్నా దక్షిణంగా ఆంధ్ర సరిహద్దులో ఉండి వేయి కిలోమీటర్లు దక్షిణంలో పాండియనాడు ఉండాది.

పాండియనాటి ముత్యాలు ప్రపంచ ప్రసిద్ధి చెందినవి. వైగా నది, తామిరపరణి ఏరులునూ పాపనాసం, వైగై ముల్లై పెరియారు ఆనకట్టలునూ మా వ్యవసాయానికి మూలాదారాలుగా ఉన్నాయి.

తిరుప్పరంగున్రం, తిరుచ్చెందూర్, పళిముదిర్ చోలై మొద లగు తావుల్లో ఉండే మురుగుడి గుడిలునూ, మదురై మీనాక్షమ్మ గుడియూ అందులోని వేయిస్తూపాల మండపమూ, తమిళనాడు ప్రభుత్వ ముద్రలో బాగంగా ఉండే శ్రీవిల్లిపుత్తూర్ ఆండాళ్ ఆల యము, తిరుమల నాయకరు మహలు, వీరపాండియ కట్టబొమ్మన్ గారు పాలించిన పాంచాలం గురిచ్చి కోట, దిండుక్కల్, విరుపాచ్చి నాయకరు కట్టిన కోట, మదురై కూడలళిగర్ ఏట్లో దిగే పండుగ, వీరానికి అదయాళముగా ఉండే అలంగానల్లూర్, పాలమేడు, జల్లి కట్టులునూ పాండియనాడుకి పాండియ నాటి తెలుగువాల్లకూ అడయాళాలుగా ఉన్నాయి.

రాజకంబళ నాయక్కర్‌లు, కమ్మవాళ్లు, గవరా/బలిజ వాళ్లు, వెలమనాయుడులు, రాజులు, ముదిరాజులు, రెడ్డిలు, శెట్టిలు, కాట్టు నాయకర్లు, బోయర్లు (వడ్డెవారు), మాదిగవాళ్లు, ఇలా ఎన్నో తెలుగు కులాలు ఇక్కడ పెద్ద సంక్యలో ఉన్నారు. వీటిలో కొన్ని కులాలు ఎదిగిన కులాలు గానూ, మరికొన్ని కులాలు వెనుకపడిన కులాలు గానూ, కొన్ని కులాలు నిండా వెనుకపడిన కులాలుగానూ ఉన్నాయి. నేటికి కూడానూ సమాజం అంటరానిదిగా చూసే దళిత, గిరిజన కులాలు కూడాను ఇక్కడి తెలుగు కులాల్లో ఉన్నాయి.

రాజకంబళం అనబడే తొమ్మిది కులాల కూటమిగా పుట్టిన కులం ఇక్కడ తెలుగునూ, తెలుగుతనాన్ని కాపాడుతూ వస్తోంది. ఒకప్పుడు పాళియకారులుగానూ, జమీనుదారులుగానూ చిన్న చిన్న రాజులుగానూ ఎక్కువవంతు ఈ కులంవాళ్లే ఉండేవాళ్లు. ఆంగ్లే యులు మదుర మట్టిని చేజేసుకున్నప్పుడు ఎక్కువగా దెబ్బ తినింది ఈ కులం వాళ్లే. వీళ్ల పాళియాలూ సొత్తు సంపత్తులు అన్నీ పోగొట్టు కొని చదువులు, ఉద్యోగాలు దొరకక చాలా వెనుకపడి పోయారు.

నాయుడు, రెడ్డి, శెట్టి కులాలవారు కొంతవరకు ఆర్థిక స్తాయిగా ఎదిగి ఉన్నారు. ఇకపోతే దళిత, గిరిజనుల స్థితిలో ఏమీ మార్పు లేదు.

ఇలా పాండియ మండలంలో తెలుగువారు ఎక్కువగా ఉండినా తమ కుల చీలికలు, ఆర్తిక స్తాయిలను పట్టి విడివిడిగానే ఉంటారు. తోటి తెలుగు కులాలు పైన పెద్దగా అక్కఱనో పట్టింపో లేకుండానే ఉన్నారు. 'నేను నాయుడు, నేను నాయకరు, నేను రెడ్డిని అని మనవాళ్లు ఐక్యత్వం లేకుండా ఉన్నంత కాలం మన అమ్మనుడికి దూరము అయి బానిసలుగానే బతకాల్సి ఉంటుంది' అని నేటి యువకులు కొందరు తెలుసుకొని తెలుగువారి ఐక్యత్వం కోసం ప్రచారం మొదలు పెట్టారు. అందుకు కారణం ఉంది కూడాను.

ఇంతకు ముందు తెలుగువాళ్లను ఈసడించుకునే తమిళ జాతీయవాదులు కొందరు నేడు తెలుగువాళ్ల మిండ మండిపడి దాడులకు దిగుతున్నారు. కొన్ని నెలల క్రితం నాం తమిళర్ కట్చి వ్యవస్తాపకుడు అయిన సేమాన్ గారు తెలుగు వాల్లనూ తిరుమల నాయకరు మహాల్‌ను తక్కువ చేసి మాట్లాడినారు. దాన్ని ఖండించిన ఒకతని మింద కొందరు గూండాలు దాడి చేసారు. ఆ తరువాత జరిగిన నిరసన సబల్లో మనవాళ్లు తమ కుల బేదాలు మరచి ఐక్యంగా కలుసుకున్నారు.

దాని కొనసాగింపుగా ఈ ఏడాది జనవరి 3వ తేది వీర పాండియ కట్టబొమ్మన్ జన్మదినోత్సవం గనంగా జరిగింది. ఒక మదురైలో మాత్రం లక్షం మందికి పైగా పాలుకొన్నారు. తేని, తిరుప్పూర్, ఉడుమల పేట, చెన్నై మరిన్ని నగరాల్లో కూడా తన పుట్టిన రోజు వేడుకలు పెద్ద ఎత్తులో నడిచినాయి.

తెలుగువారి ఒగ్గట్టును చూసిన ప్రభుత్వం తిరుమల నాయకరు పుట్టిననాడు అయిన తై పూనాన్ని ప్రభుత్వ పండుగగా ప్రగటిం చింది. మదుర తిరుమల నాయకరు మహాల్‌లో నడిచిన ఈ వేడు కకు తెలుగువాళ్లు పెద్ద ఎత్తులో తరలి వచ్చి కలుసుకున్నారు.

మనవాళ్లకి మెలకువ పుట్టి ఉంటే ఐక్యత్వం మరింతగా బలపడి కొనసాగితే మా రాష్ట్రంలో మన తెలుగు పెద్ద ఎత్తులో వెలుగెత్తుతుంది. ❋

పుస్తక సమీక్షలు

## విప్లవ సాహిత్యంలోని వస్తురూప వైవిధ్యాల వివరణ

## తెలంగాణ సాహిత్యం (వ్యాస సంపుటి)




**వృ**త్తిరీత్యా అధ్యాపక వృత్తిలో చేసిన పరిశోధనా పత్రాల సంపుటీకరణే అయినా, రచయిత కాశీం తెలంగాణా ప్రాంతానికి చెందిన తెలుగు సాహిత్యాన్ని కాచి వడబోసి సారాన్ని 'తెలంగాణ సాహిత్యం' అనే విమర్శనాత్మక గ్రంథంగా వెలువరించారు. తెలంగాణ ఉద్యమానికున్న నేపథ్యాన్ని దశలవారీగా తెలియచేస్తూ దిశానిర్దేశం చేసిన ఉద్యమం 'పాట' రూపంలో ఊపందుకుని, రాజ్యహింసకు శ్రమ దోపిడీకి విరుగుడుగా వచ్చిన విప్లవ సాహిత్యాన్ని సోదాహరణంగా తెలియచేశారు. తెలంగాణా విప్లవోద్యమాల ఫలితంగా ప్రజలు పాలక వర్గాన్ని ప్రశ్నించగలిగారని వివరంగా తెలియజేశారు. తెలంగాణా ఉద్యమ స్వరూపాన్ని గురించి తెలంగాణేతరుల అవగాహనకు పనికొచ్చే గ్రంథమిది. తెలంగాణాలో సాహిత్య చైతన్య పోరాట యోధుడిగా అల్లం రాజయ్య 1960 దశకంలో వచ్చిన తెలంగాణా రైతాంగ పోరాటాలను చిత్రీకరించిన "సృష్టికర్త" వంటి కథలను, సింగరేణి గని కార్మికుల పోరాటాలకు నాయకత్వం వహించిన సి.కా.స(సింగరేణి కార్మికుల సమాఖ్య) నేతలను కథానాయకులుగా చేసుకుని వచ్చిన 'అతడు' వంటి కథలలోని వస్తువును కాశీం పరిచయం చేసి అల్లం రాజయ్య పుస్తకాలను చదవాలనే ఉత్సాహాన్ని కలిగించారు. అంతేకాదు శిథిలమవుతున్న మానవ సంబంధాలు, మరీ ముఖ్యంగా స్త్రీ పురుష సంబంధాలను స్థాలీపులాక పరిచయం చేశారు. ఆధునికంగా అందరి నోళ్లలో, మెదళ్ళలో కదులుతున్న 'ప్రపంచీకరణ' భావజాలాన్ని భీదల మీద, కర్షక కార్మికుల మీద 'దాడి'గా ప్రతిఫలించిన 'ఉరికి ఉప్పలం' 'జిగిరి' వంటి రచనలను పాఠకులు చదివి భూమి గుండ్రంగానే ఉండాలనే నిర్ధారణకు వచ్చేటట్లుగా చేసి డాలరు దేశాలు భూమిని మానవ శ్రమను ఎలా దోచుకుంటున్నాయో అర్థం అయేటట్లుగా కాశీం తన విమర్శకు పదును పెట్టారు.

కవితా వస్తువు, పాత్రలు, పాత్రోచిత భాష, భావవిప్లవాలు కవిత్వాన్ని నిర్మించిన విషయాన్ని సోదాహరణంగా వివరించి పాఠకులకు కవిత్వం వ్రాయాలనే భావనను కలిగించారు. ఈ క్రమంలోనే జూకంటి జగన్నాథం గారి కవితను నమూనాగా చెప్పి ప్రపంచీకరణ వలన తెలంగాణ సంస్కృతి పరాయీకరణం చెందిన విధాన్ని తెలియజేశారు. తెలుగు సాహిత్యం, చరిత్ర ఆధారంగా 'ఆంధ్రుల సాంఘిక చరిత్ర'ను తరతరాలకు అందించిన సురవరం ప్రతాపరెడ్డి గారికి దక్కవలసిన గౌరవం దక్కలేదని, వారి సంపాదకీయాలు ప్రజలకు, పాఠకులకు కరదీపికలని 'విద్య జ్ఞానం కోసమనే' భావాన్ని నొక్కి చెప్పిన సురవరం వారి 'గోల్కొండ పత్రిక' సంపాదకీయాలు పాఠకుల పాలిట వరాలని వివరించారు. వారి పీఠికల గురించి రచయిత సవివరంగా పేర్కొని పీఠికల ప్రయోజనాన్ని అందిస్తూ పాఠకులకు అవి గ్రంథాలయాల వంటివి అని అర్థం అయ్యేలా చేశారు. చారిత్రకంగా సమ్మక్క సారక్కలతో ప్రారంభమైన పోరుగడ్డ తెలంగాణ, దాని క్రమ పరిణామ రూపంగా 'తెలంగాణ విప్లవ సాహిత్యం' అనే వ్యాసంలో విప్లవం అంటే మార్పు అని, అది ఆర్థిక రాజకీయాలలో పెను మార్పులను తెస్తుందనీ విరసం పుట్టుక, నక్సలిజం ఆవిర్భావాన్ని తెలియజేయటమే గాక ఆర్థిక రాజకీయ సమస్యలను చిత్రించిన విప్లవ కవుల కవిత్వపు చైతన్యాన్ని రచయిత అందిచారు. విప్లవ సాహిత్యంలోని వస్తురూప వైవిధ్యాలను వివరించారు. తెలంగాణ సాహిత్యం (వ్యాస సంపుటి)

రచన : కాశీం వెల రూ.140/-లు. ప్రతులకు : స్నేహ ప్రచురణలు, గుంటూరు.

– **జె.కనకదుర్గ,** 94911 4299

## అమ్మమాట వినాలని వుంది..

**రాఘవ మాస్టారు,** బెంగుళూరు.
సెల్ : 09741407099

**అ**మ్మ నాభి నుండి
మధుర సారమందించి
మనసు ఊసులనుండి
అమృతనుడుల సుధలొలికించి

గుండెలోతుల్లో గూడుకట్టిన
ఎద మూలల్లో మూట గట్టిన
అమ్మతో ఆటలాడిన పాటను
నాన్నతో ఊకొట్టిన మాటల్ని
తాతవ్వలు కథలు చెప్పిన నుడిని
అత్తఅక్కలు ముద్దాడిన నుడువులని
కల్తీ లేని కమ్మని తెలుగుమాటల్ని

ఆరు బయట వెన్నెల్లో
నామనుమడు, మనవరాళ్ళ నోటి నుండి
నా అమ్మ నుడి పలుకులను ఒకసారి
మనసారా వినాలని వుంది.

## స్పందనను వ్రాయండి

**'అమ్మనుడి'**లో రచనలపై
మీ స్పందనను వ్రాసి పంపండి!
సంపాదకుడు
'అమ్మనుడి', జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520 004.
ఇ-మెయిల్ : *ammanudi@gmail.com*




# జాతీయస్థాయి పురస్కారానికి అర్హమైన కావ్యం
# విజయ భారతం

**అ**కుంఠిత దేశభక్తి, కుత్సితమతులైన శాత్రవుల గుండెలు చీల్చి రుధిర స్రవంతిలో జలకమాడే పరాక్రమం, అకళంకమైన ప్రణయాను రక్తి, దేశం కోసం శ్రమించే సైనికుల త్యాగాన్ని గుర్తించగల నాయకుల ఔదార్యం ఇవన్నీ ఒక్క రూపాన్ని సంతరించుకుంటే ఏర్పడిన సురుచిర రసవత్కావ్యం 'విజయభారతం'. రసరాజు లేఖని నుంచి జాలు వారిన రసఝురీ ప్రవాహం ఇది.

రణరంగంలో సింగం వంటి రణసింగ్ ఈ కావ్యంలో కథానాయకుడు. అమృతం వంటి హృదయం గల అమృత కథానాయిక. రేపటి దేశసేవకు సంతానాన్ని కనాలనే కోరికతో రణసింగును వివాహ మాడింది. వలపు తలపులు తెరచుకొనే సమయంలో యుద్ధానికి రమ్మని రణసింగుకు తంతి చేరింది. "శోభన రాత్రికేమి? భారతాంబా క్షోభ యిట్లుండగా కునుకుం బట్టునె?" అనుకుంటూ తిలకం దిద్ది భర్తను యుద్ధానికి సాగనంపింది. సమర రంగంలో శత్రు సంహారం చేస్తూ రణసింగు గాయపడతాడు. స్పృహతప్పిన రణసింగును ఆసుపత్రిలో చేరుస్తారు. స్పృహవచ్చిన వెంటనే రణసింగు యుద్ధం గురించి ప్రశ్నించి *" కలదు రెండవ చేయి – సంగ్రామ భూమి / కిపుడె నను పంపుడు"* అన్న సన్నివేశం చదవగానే నెత్తురుడిగిన మనుషుల్లో కూడా రక్తం సలసలా కాగిపోతుంది. ఇటువంటి సన్నివేశాలు ఎన్నో... ఎన్నెన్నో..

రణసింగును చూపడానికి ప్రధాని శాస్త్రి వస్తాడు. అతనిని చూచి రణసింగు కన్నీరు విడుస్తాడు. భార్యతో సమాగమాన్ని విడిచి యుద్ధానికి వచ్చిన రణసింగు వృత్తాంతాన్ని ఆయనకు అధికారులు వినిపిస్తారు. అతని కన్నీళ్ళకు భార్యా వియోగం కారణం అనుకుంటారు. అప్పుడతడు ఇలా అంటాడు. "ఇవి నా శోభన భంగ భాష్పములు / కానేకావు ! నా దేశ శౌ / ర్య విశేషంబులు చాటు నాయకుడు / నాకే యిట్టు లేతెంచ – గౌరవ మొప్పారగ లేచి వందన మొనర్పన్ / జాల కున్నాడనన్ / నెవులిట్లశ్రువులై బయల్పడె / విధిన్ నిందింప మేలున్నదే !

ఈ సన్నివేశం హృదయాన్ని ద్రవింపజేసి, మేను పులకరింపజేసి, అనంద బాష్పాలను రప్పిస్తుంది. ఇటువంటి రసవత్తరమైన సన్నివేశాలు, మైమరపించే సంఘటనలు, రసానుభూతితో మేను పులకరింపజేసే సన్నివేశాలు కావ్యంలో కో కొల్లలుగా కన్పిస్తాయి. మురిపిస్తాయి. శాస్త్రి, రణసింగు భార్యను విమానంలో పిలిపించి, అతని చెంతకు చేర్చడం గొప్ప ముక్తాయింపు.

రణసింగు, లాల్‌బహదూర్ శాస్త్రి, అమృత పాత్రల చిత్రీకరణలో కవి చూపిన నేర్పు, అనన్యం, అద్భుతం, వర్ణనల్లో అలంకార ప్రయోగంలో, పదాల కూర్పులో రసరాజు కవిరాజు అనిపించుకున్నారు. రసరాజుకు ఆంధ్రాభిమానంతో పాటు, కోనసీమపై అభిమానం జాస్తి. ఆంధ్రదేశపు అందాలు, సంస్కృతీ సాంప్రదాయాలు, వివాహపు వేడుకలు, విందు వినోదాలు వర్ణించడానికి పంజాబీలను ఆంధ్రదేశంలో నివసించే వ్యక్తులుగా చూపడం బాగుంది. తెలుగు వారి పౌరుషాన్ని వర్ణించిన తీరు మరీమరీ బాగుంది.

విజయ భారతంలో ఉపదేశం కూడా కనిపిస్తుంది. స్వసుఖాలను, ప్రాణాలను దేశం కోసం, దేశ క్షేమం కోసం తృణప్రాయంగా భావించే సైనికుల త్యాగాన్ని నాయకులు గుర్తించాలి. కసబ్ లాంటి మానవ మృగాలను వెంటనే ఉరితీయకుండా వారికోసం కోట్లకొలది ప్రజాధనాన్ని వెచ్చించడం ఎంతవరకు సమంజసమో ఆలోచించాలి. శత్రువులను జైళ్ళలో ఉంచి ఏ విమానమో హైజాక్ చేస్తే, వారిని విడిచి పెట్టడం ఎంత తప్పో గుర్తించాలి. యుద్ధ రంగంలో సైనికులు పోరాటంలో చూపే పటిమ, వారి నిబద్ధత నాయకుల్లో కూడా ఉన్నప్పుడే దేశానికి రక్ష అని రసరాజు నాయకులకు సందేశమిచ్చారు. దేశభక్తిని ప్రబోధించే ఈ నవలకు జాతీయ పురస్కారం ఇవ్వడం సముచితమని అప్పుడే ఈ భావం ప్రజల హృదయాల్లో నిలిచి పోతుందని భావిస్తున్నాను. రసరాజు గారి కలం నుండి ఇటువంటి దేశభక్తి ప్రపూరిత రసవత్కావ్యాలు మరెన్నో రావాలని ఆశిద్దాం.

విజయ భారతం (పద్య కావ్యం) కవి : రసరాజు

పుటలు : 132, వెల : రూ.100/- ప్రతులకు : శ్రీమతి రంగినీని సూర్యనారాయణమ్మ, ఎల్.ఐ.జి. 177, హౌసింగ్ బోర్డు కాలనీ, తణుకు – 534211), ఫోను : 94403 88659

**డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ**, గుంటూరు
చరవాణి : 98497 99711

పుస్తక పరిచయం

## బ్రౌన్ గురించి మూడు ప్రక్రియల్లో మూడు పుస్తకాలు

**తెలుగు భాషా ప్రశస్తి-పద్యకావ్యం, తెలుగు భాషా వికాసం - గేయకావ్యం, తెలుగు భాషా ప్రదీప్తి- నాటకం**

ఈ మూడు పుస్తకాల రచయిత, శతాధిక గ్రంథకర్త ఆచార్య ఎస్.గంగప్ప. వలస పాలనా కాలంలో భారతదేశంలో పనిచేసిన బ్రిటీషు అధికారుల్లో సి.పి.బ్రౌన్ ఒకరు. ఈయన తన ఉద్యోగ బాధ్యతలు నిర్వహిస్తూనే తన జీవితం, డబ్బులు వెచ్చించి తెలుగుభాషకు చేసిన సేవ వెలకట్టలేనిది. అటువంటి సి.పి.బ్రౌన్ తెలుగుభాషకు చేసిన సేవను ప్రశంసిస్తూ ఆచార్య గంగప్పగారు వ్రాసిన పద్యకావ్యం-తెలుగు భాషా ప్రశస్తి; గేయకావ్యం-తెలుగు భాషా వికాసం; నాటకం- తెలుగు భాషా ప్రదీప్తి. ఇక్కడ ఒకే వ్యక్తిని, ఒకే అంశాన్ని తీసుకొని మూడు భిన్న ప్రక్రియల్లో మూడు పుస్తకాలు వ్రాసి ప్రచురించిన ఆచార్య ఎస్.గంగప్ప అభినందనీయులు. పద్యం వ్రాయడంలోను, గేయం రచించడంలోను, నాటకం సంభాషణాత్మకంగా పొందుపరచడంలోను ఆచార్య గంగప్ప గారి ప్రత్యేకత వెల్లడవుతుంది. ఈ పుస్తకాలను భాషా సేవకులకు, సాహితీ పిపాసులకు అంకితం ఇవ్వడం సముచితంగా, సమంజసంగా ఉంది. ప్రతి ఒక్కరూ తప్పక చదివి, పిల్లల చేత కూడా చదివించవలసిన పుస్తకాలు ఇవి.

**తెలుగు భాషావికాసం, తెలుగు భాషాప్రశస్తి, తెలుగుభాషా ప్రదీప్తి-** ఈ మూడు పుస్తకాలు ఒక్కొక్కటి రు.25/-లు. ప్రతులు దొరుకుచోటు : శ్రీమతి ఎస్.పార్వతమ్మ, సి/73, శ్రీనివాసనగర్ కాలనీ, గుంటూరు-522 006. ఫోన్ : 0863-2231805

## బతుకుపాట

ప్రభుత్వ కళాశాలల్లో తెలుగు అధ్యాపకుడుగా, చివరగా విద్యారంగంలో ప్రాంతీయ ఉపసంచాలకులుగా వ్యవహరించిన డాక్టర్ యు.దేవపాలన పరిశోధనాంశంగా తీసుకున్న "ప్రకాశం జిల్లా శ్రామిక గేయాలు" గ్రంథం- పేదల గుండెచప్పుళ్ళకు నిదర్శనం. మరుగునపడి మాయం కాబోతున్న జానపద సాహిత్యాన్ని ఊరూరూ తిరిగి, సేకరించి, వాటిని చక్కగా విశ్లేషించి 'బతుకుపాట'గా మనకు గ్రంథరూపంలో అందించడం ముదావహం. ఇందులో వాన, ఏరువాక, సంక్రాంతి, కథా గేయాలు, జాలిపాటలు, వలపు పాటలు, బాంధవ్య గీతాలు, హాస్యగీతాలు- ఇవన్నీ గ్రామీణ జీవన విధానాన్ని కళ్ళకు కట్టినట్లు చూపుతున్నాయి. ఇందులో "దళిత ఆదివాసీల సాహిత్యం- వారిపాటల్లో ధ్వనించే ఆత్మాభిమానం" అనే వ్యాసం రచయితకు వారిపట్లగల అభిమానాన్ని వెల్లడిస్తుంది. వైవిధ్యంతో కూడిన పాటలను ఇందులో పొందుపరచి విశేషాలతో వివరించిన రచయిత దేవపాలన కృషి అభినందనీయం.

**బతుకుపాట** : రచయిత-డాక్టర్ యు.దేవపాలన, పుటలు : 116, వెల : రు.80/-లు. ప్రతులకు : శ్రీమతి యు.దేవపాలన, డోర్ నెం.29-201, అద్దంకి, ప్రకాశం జిల్లా. ఫోన్ : 98484 18574

## సామ్రాజ్యవాద దోపిడీ మండలాలు




గత దశాబ్దికాలంలో సెజ్‌ల ఏర్పాటు సామాన్య ప్రజల్ని కలవరపరచింది. ఈ సెజ్‌ల ఏర్పాటుతో చిన్న పరిశ్రమల ఉనికిని దెబ్బతీసే ప్రమాదం ఉండటంతో, వాటిని వ్యతిరేకిస్తూ ప్రజలు ఆందోళన బాట పట్టారు. తీవ్రంగా ప్రతిఘటించారు. ప్రభుత్వం తోకముడిచింది కూడా. అయినా ప్రస్తుత కేంద్రప్రభుత్వం, రెండు తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు తిరిగి సెజ్‌ల ఏర్పాటుకు ఉరుకులు పెడుతున్నాయి. ఇది ఆందోళనను కలిగించే విషయం. ఈ పుస్తకంలో పశ్చిమ బెంగాల్‌లోని నందిగ్రాం మొదలుకొని మహబూబ్‌నగర్ జిల్లాలోని పోలేపల్లి సెజ్, కాకినాడ సెజ్, శ్రీకాకుళం జిల్లాలో సెజ్‌లు, నెల్లూరు జిల్లా తడలోని అపాచీ సెజ్ ప్రాంతాల్లోని ఆందోళనకారులు, బాధితులు తెలిపిన విషయాలను పొందుపరిచి యం.రత్నమాల గారు ఈ పుస్తకాన్ని ప్రచురించారు. ఈ పుస్తకం ద్వారా రత్నమాల గారు ప్రభుత్వాలు ఏవైనా, వాటి అధినేతల ఆలోచనాధోరణి ఒక్కటేనని, దాని కారణంగా ప్రజలు నిత్య జాగరూకులు కావాలని హెచ్చరిస్తున్నారు. ఇందులో సెజ్‌లు అంటే ఏమిటి? ఈ సెజ్‌లను అడ్డుకోవాలని, అడ్డుకొనే ప్రజలకు అండగా నిలబడాలని పిలుపునిస్తూ ఈ సెజ్‌ల నేపథ్యంలో స్త్రీలపై జరుగుతున్న హింసను గూర్చి యం.రత్నమాల గారు వ్యాసాల్లో వివరించారు. ప్రతి ఒక్కరూ చదివి, అవగాహన చేసుకొనాల్సిన రచన ఇది. **సామ్రాజ్యవాద దోపిడీ మండలాలు** : పుటలు 56, వెల: రు.50/-లు, రచయిత : యం.రత్నమాల. ప్రతుల కొరకు : యం.రత్నమాల, మేఘా అపార్ట్‌మెంట్స్, ప్లాట్ నెం.302, నల్లకుంట, హైదరాబాద్-500044. సెల్ : 94403 29445

## 2016 ఫిబ్రవరి అమ్మనుడి

**అ**మ్మనుడి ఫిబ్రవరి పత్రికలో నా గేయం (14వ పుట) చివరి చరణంలో "పరదేశముల తెలుగు వారలు పరితపించ/స్వంత రాష్ట్రములోనె చతికిల పడె నేడు" అని ఉంది. అందుకు నిదర్శనంగా గుజరాతు, టిటాఘర్, (కలకత్తా), మొరసునాడు, తొండనాడు, బంగ్లాదేశ్ (ముఖపత్ర చిత్రం–వ్యాసం) తెలుగు వ్యాసాలున్నవి. చదివి ఆనందం–ఆవేదన రెండూ కలిగినై. వాళ్ళకు మనకు ఎంత తేడా?

బొర్రా గోవర్ధన్ గారు బౌద్ధం మీద అభిమానంతో చాలా కృషి చేస్తున్నారు. వారికి మార్గదర్శి డా॥ఈమని శివనాగిరెడ్డి అనవచ్చు. కానీ నిదానం ప్రధానం. తొందరపడి ఏకపక్ష నిర్ణయాలు చేయవద్దని మనవి.

ఆచార్య రెండవ నాగార్జునుని (మొదటి నాగార్జునున్ని అందరూ మరచిరి. అతని పేరనే ఆ కొండకు ఈ పేరు వచ్చింది) స్వస్థలం 'వేదలి' చందవోలు దగ్గరి 'యాజలి' అన్నారు. వేజలి, వేదలిగా మారిందని వీరి సమర్థన. (చందోలు, యాజి, బుద్ధాం గ్రామాలు నేను చూసిన) వ.యగా మారుట కష్టం. కరీంనగర్–ధూళి కట్టలో క్రీ.పూ. 2వ శతాబ్ది నాటి బౌద్ధస్తూపం, శాతవాహనుల కోట ఉన్నాయి. ఈ ప్రదేశానికి సుమారు 7,8 కి.మీ.దూరంలో 'వెల్ది' అనే చారిత్రక గ్రామముంది. వేదలి–వెల్దిగా మారుట సులభం, సహజం. ఆలోచించండి.

భావ వివేకుని మలయగిరిని 'మంగళగిరి' అనవచ్చా? అది ఉత్తరాంధ్ర కావచ్చును కదా! ఇక, దిజ్ఞాగునిది కంచి, సింహాచలం అని వీరి మాట. కానీ ప్రముఖ పురావస్తు శాఖ పరిశోధకులు కీ.శే.వి.వి.కృష్ణశాస్త్రి గారి అభిప్రాయం దిగ్నాగ బౌద్ధ రచయితది కరీంనగర్ జిల్లా కోటిలింగాల దగ్గరి 'పాశిగాం' అని (2002 శాతవాహన ఉత్సవాల ప్రసంగం) సంచిక అచ్చులో వచ్చింది.

డా॥వావిలాల సుబ్బారావు గారి వ్యాసం బాగుంది. విషయ విశేషాలు–కాలక్షేపం కూడా. ఇళ్ళకప్పు, దోనెపెంకు, వారి మాట, ఇటు 'గూనెపెంకలు' అని జనవ్యవహారం.

పుట 43, 'గోదావరి సవరభాషాపదం. నిజమే కావచ్చు. జోల(ఏరు) పదాలు సవరని దిమిడిజరీలు, జోలాపుట్టి అన్నారు. సరే..కానీ రాజోలు మాటేమిటి? ఇది ప్రోలు అనే కదా.

పుట–15 రెడ్డి గారి వ్యాసారంభంలో ఒక సంఖ్య తప్పినట్లుంది. అందలి రెండవ సంఖ్య 1886 అని కాక 1986 సరికావచ్చు.

**–డా॥మలయశ్రీ,** కరీంనగర్,
98665 46220

## దేశభాషల పట్ల నాయకుల చిన్నచూపు...

ఫిబ్రవరి 2016 అమ్మనుడిలో పేజీ 48లో వచ్చిన 'దేశభాషల పట్ల నాయకుల చిన్నచూపు–విధానలేమి' వ్యాసం చాలా బావుంది. 'ప్రథమ్' సంస్థ వారి విద్యాస్థాయి–2014 వార్షిక నివేదిక (Annual Status of Educational Report 2014) ప్రకారం తెలుగు రాష్ట్రాలలో 41% పిల్లలు తెలుగులో వారు చదవవలసిన కనీస స్థాయిని కూడా చదవలేకపోతున్నారని తెలుస్తున్నది. కాబట్టి మాట్లాడే భాషగా తెలుగు మరి కొన్ని తరాలు ఉంటుంది. సరైన లెక్కలు లేకపోయినా చదివే భాషగా తెలుగు ఇంకా తక్కువ, వ్రాసే భాషగా మరింత తక్కువ అని చెప్పవచ్చు. మనిషి మేధావికాసాన్ని మౌఖికంగానో, అక్షర రూపంలోనో ప్రతిబింబించని భాషపుట్టి చనిపోయే మనుషుల వలె పోతుంది. వాటివలన జరిగే నష్టం మనకు తెలియదు. అలా పోయిన భాషలు ఎన్నో. రాజ్యాల మధ్య యుద్ధాల వలన, రాజకీయాల వలన పోయిన భాషలు కూడా ఉన్నాయి. అటువంటి వాటిలో మన అందరి నిర్లక్ష్యం వల్లో, అగ్రవర్ణాలపై అక్కసువల్లో సంస్కృత భాష మరుగున పడిపోయింది. అలా ఎందుకు జరిగిందో, ఎలా జరిగిందో తెలుసుకొంటే తెలుగుభాష కూడా సంస్కృతంలా మరుగున పడిపోకుండా ఆపవచ్చునేమో పరిశీలించండి. ఆ దిశలో మీ పత్రిక కృషి చేస్తే తెలుగుభాషకి సమయానికి చేయవలసిన సేవ చేసినట్టవుతుంది.

**–కలశపూడి శ్రీనివాసరావు,** +9198850 74764 + 15168593010

## తమిళనాట....స్పందన

తమిళనాట అనాదిగా సాగుతున్న తెలుగువారి ప్రాభవంపై విద్వేషం – అనువాదం చలసాని నరేంద్ర.

ఈ వ్యాసాన్ని మీరు ప్రచురించకుండా వుండవలసింది. ఇందులోని సమాచారమంతా పూర్తిగా తప్పుల తడక. ఈ వ్యాసాన్ని రాసిందే తమిళ, ఇంగ్లీషు పత్రిక. అనాదిగా తమిళులు నడిపే ఆంగ్లపత్రికలు ది హిందూ– ది మెయిల్ స్వరాజ్యం పూర్తిగా తెలుగు వ్యతిరేకులు. ప్రతి తమిళ గ్రంథస్తులు, రచయితలూ తెలుగునూ, తెలుగువారినీ దెబ్బతీయటంలో దిట్టలు.

తెలుగువారు 15/16 శతాబ్దాల్లో తమిళనాట వచ్చి స్థిరపడ్డారని వీరి వాదం. తెలుగువారు తూర్పున చిలక సరస్సు నుంచి దక్షిణాదిన కోయంబత్తూరు, దిండుగల్లు దాకా వ్యాపించి ఉన్నది. ఇది ఈస్టిండియా కంపెనీ రికార్డులు చెబుతున్నవి.

తమిళ ముఖ్యమంత్రులు ముగ్గురు మాత్రమే. రాజగోపాలాచారి, కామరాజ్, భక్తవత్సలం, ముదలియార్లు తెలుగు వెలమలు తమిళులుగా రూపాంతరం చెందారని మన స.వెం.రమేష్ గారి సిద్ధాంతం. అంటే తమిళ ముఖ్యమంత్రులు ఇద్దరే. భక్తవత్సలం, ముదలియారు.

తమిళేతర ముఖ్యమంత్రులు ఓ.పి.రామస్వామిరెడ్డి, సి.యన్.అన్నాదురై (తల్లిదండ్రులు తెలుగు వైశ్య కుటుంబీకులు) కరుణానిధి (తెలుగు) యం.జి.ఆర్ (మలయాళీ), జానకీ రామచంద్రన్ (తళు–యం.జి.ఆర్ సతీమణి) జయలలిత (తుళు)

ఈరోడ్ వెంక రామస్వామినాయుడు (పెరియార్ పూర్తిపేరు)

కర్ణాటక నుంచి వచ్చి ఈరోడ్‌లో స్థిరపడ్డ తెలుగు బలిజ కులస్తులు.

**–చందు,** చెన్నయ్

-డా॥ఈమని శివనాగిరెడ్డి

# మన రాజులు-వారి బిరుదులు

**చా**రిత్రకంగా మగధను పాలించిన బింబిసారుడు మనదేశపు మొట్టమొదటి రాజు. మగధను సామ్రాజ్యంగా తీర్చిదిద్ది రారాజైనాడు. సామ్రాట్టుగా పిలువబడినాడు. అలాగే కోసలరాజు ప్రసేనజిత్తు. ఇంకా పదహారు గణతంత్రరాజ్యాల నేలిన రాజులూ ఉన్నారు. నమ్మదగిన మనదేశపు తొలి సాహిత్యమైన బౌద్ధ సాహిత్యం వీరిని రాజులని పిలుస్తుందే తప్ప ఇంద్రుడు, చంద్రుడు, అరివీరభయంకరుడు అని ప్రశంసించిన ఆధారాలు లేవు.

అలాగే జైనమతావలంబి చంద్రగుప్త మౌర్యుణ్ని కూడా జైన సాహిత్యం ఒక్క పేరు తప్ప మరే ఇతర విశేషణాలతోనూ కీర్తించలేదు. వైదికేతర మతాలను ఆదరించిన రాజులను ఆయాసాహిత్యాలు రాజుగానో, సామ్రాట్టుగానో పేర్కొన్నాయి గానీ అనేక విశేషాలను ఆపాదించి, రాజులు రాణులు, మంత్రులు, సామంతులు, దండనాయకులపై సైతం విపరీత బిరుదులను, ప్రశస్తులను, ప్రశంసలను కురిపించింది. బౌద్ధ వైదికేతర సాహిత్యంలో అలా ఉంచితే, శాసనాల్లో అసలు విషయం ఇసుమంతైతే, పొగడ్తలు కొండంతగా కనిపిస్తాయి.

ఇక తెలంగాణ, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఒక్కటిగా ఉన్నప్పుడు, తూర్పున బంగాళాఖాతం మూడు వైపులా గల పొరుగు భూభాగాల్లోకి ఒక్కోసారి చొచ్చుకొని పోయి, మరికొన్నిసార్లు పరాయిరాజులకు మన భూముల్ని అప్పగించిన సందర్భాలెన్నో ఉన్నాయి. స్థానిక రాజులు, రాణులు, మహారాజులు, చక్రవర్తులతో పాటు దక్షిణాన వున్న తమిళ దేశం, పశ్చిమాన గల కన్నడదేశం ఉత్తరాన వున్న మహారాష్ట్ర, విడిపోని మధ్యప్రదేశ్, కళింగ (ఒడిషా) దేశాల రాజులు కూడా తెలుగునేల పాలకులుగా చరిత్రలో నిలిచిపోయారు. చారిత్రక, శాసన సాహిత్యాలను పరిశీలిస్తే, తెలంగాణ లోని కోటిలింగాల నుంచి పాలించిన తొలి తెలుగురాజులైన గోబధ, నరన, కంవాయ, సమగోపలు కేవలం పేర్లతోనే పిలిపించుకొన్నారు. తరువాత రాజ్యానికొచ్చిన శాతవాహనులు, ఇతరులైన చిన్నపాటి రాజులను నాణాలు, శాసనాల్లో రాణో (రాజా) అని వారి పదవిని సూచించటం ప్రారంభమైంది. అంతకు కొంచెం ముందుకెళితే జంబూద్వీపంగా పిలువబడిన బృహత్ భారత దేశాన్ని, ఎల్లలు దాటికూడా పాలించిన మౌర్యచక్రవర్తి అశోకుని కూడా శాసనాలు, సాహిత్యాల్లో కేవలం దేవానాంప్రియ, ప్రియదర్శి, 'మంచి పనులు చేసి దేవతలకు కూడా ప్రీతిపాత్రుడైనవాడు, ఎపుడూ చూడాలనిపించేవాడు' అన్న వాస్తవ అర్థాలను సూచించే విశేషాంశాలున్నాయే తప్ప ఊపిరాడక ఉక్కిరిబిక్కిరి జేసే పొగడ్తల సీసమాలికలు లేవు. అయితే క్షత్రపులు లాంటి శత్రు రాజులను జయించిన శాతవాహనుల కాలం నుంచి రాజుల్ని ఒకటి, రెండు బిరుదులతో కొనియాడటం ప్రారంభమై, ఇప్పటి రెవెన్యూ మండలమంత భూభాగానికి పరిమితమైన సంస్థానాధీశులను ఆడంబర పదగుంభనంతో చదువరులను బెంబేలెత్తించిన వర్ణనలు, హేతుబద్ధ పాఠకులకు కొంత ఇబ్బందిని కలిగించక మానవు. ఇనుపయుగం చివరినాళ్ళలో తెగల ముఖ్యులు, పాలకులుగా అవతరించి, రాజులైనప్పటి నుంచి, బ్రిటీషు పాలనలో కూడా పరిమిత అధికారాలతో కుంచించుకుపోయిన జమీందారుల వరకూ, వారు అసలు పేర్లకు ముందు, బిరుదులు వరసలు గట్టిన వైనాన్ని పరిశీలించినకొద్దీ ఆశ్చర్యం కలుగుతుంది.

రాచరికపు వ్యవస్థను చవిచూపించిన మౌర్యుల కాలం నుంచే తెలుగునేలపై శాసనాలు రూపుదిద్దుకున్నాయి. తరువాత వరసగా వచ్చిన రాజులు, రారాజులూ శాసనాలతోపాటు విడుదల చేసిన శాసనాల్లోనూ, వారిని కీర్తిస్తూ రాసిన గ్రంథాల్లోనూ రకరకాల బిరుదులను గమనిస్తాం. కొన్నికొన్ని సందర్భాల్లో, శాసనాల్లోనూ. నాణాలపైనా, రాగిరేకుల గుత్తిని కుట్టిన రాగి ఉంగరం మీద, రాజుల పేర్లు కాక కేవలం బిరుదులే ఉంటాయి. ఈ బిరుదుల్లో కొన్ని రాజులు, రారాజులు, రాణులు, మహారాజులను మెప్పించటానికి జొప్పించినవైనా, మరికొన్ని బిరుదులు మాత్రం ఆయా రాజుల విక్రమ పరాక్రమాలను, జరిపిన యదార్థాలను, సాధించిన విజయాలను, చేసిన మంచి పనులను, చారిత్రక సంఘటనలను తెలియజేయటాన, ఆయా బిరుదులకు ప్రాధాన్యత దక్కింది. తెలుగునేల నేలినవారిలో మౌర్యులు (అశోకుడు మాత్రమే), శాతవాహనుల కంటే ముందే పాలనా పగ్గాలను పట్టిన కోటిలింగాల తెలుగు రాజులు, శాతవాహనులు, కళింగ చేదిరాజులు (ఖారవేలుడు మాత్రమే), సదవంశీయులు, స్థానిక రాజులు, ఇక్ష్వాకులు, బృహత్పలాయనులు, సాలంకాయనులూ, ఆనందగోత్రినులు, విష్ణుకుండినులు, తొలిపల్లవులు, తొలిదుర్జయులు, మాఠరులు, పితృభక్తులు, వశిష్టులు, తొలితరం తూర్పుగాంగులు, బాదామీ (వాతాపి లేక పశ్చిమ) చాళుక్యులు, వేంగీతూర్పు చాళుక్యులు, తొండైమండలి చోళులు, బాణులు, వైదుంబులు, నోలంబులు(నొలంబపల్లవులు)రాష్ట్ర కూటులు, పల్లవులు, పశ్చిమ గాంగులు, వేములవాడ (బోధన్) చాళుక్యులు, ఎలమంచిలి చాళుక్యులు, ముదిగొండ చాళుక్యులు, జననాధపురం చాళుక్యులు, నిరవద్యపుర(నిడదవోలు) చాళుక్యులు, వెలనాటి చోళులు, తెలుగు (రేనాటి, పొత్తపి, కందూరు, కొణిదెన, నెల్లూరు, చందోలు) చో(డు)ళులు, పల్నాటి హైహయులు, కోనహైహయులు, కొండపడుమటి, పరిచ్ఛేది, మత్స్యవంశీయులు, కళ్యాణ చాళుక్యులు, యాదవ రాజులు, హొయసలులు, తరువాత తూర్పుగాంగులు, కాకతీయులు, కాకతీయ సామంతులు (రేచర్ల, విరియాల, మల్యాల, నతవాడి, చెరకు, కోట(ధరణికోట) కాయస్థ, వెలమ, గోన, అయ్య, కొలను(కొల్లేరు) చక్రనారాయణ, పొలవాస, ఇందులూరి, ముప్పిడి, దేవరి వంశీకులతో పాటు జుట్టయలెంకలాంటి అనేకమంది లెంకలు కాకతీయుల తరువాత చిన్నచిన్న రాజ్యాలుగా ఏర్పడిన తెలుగునేలను పాలించిన రెడ్డి రాజులు, రేచర్ల పద్మనాయకులు (వెలమరాజులు), ముసునూరి నాయకులు (కమ్మరాజులు), ఓఢ్ర (కళింగ) గజపతులు, విజయనగర చక్రవర్తులు(సంగమ, సాళువ, తుళువ, ఆరవీటి వంశాలు) విజయనగర సామంతులు (పెమ్మసాని, మటి, వెలుగోటి, నంద్యాల కుటుంబీకులు) బహుమనీలు, కుత్బ్‌షాహీలు, మొఘల్‌లు, అసఫ్‌జాహీలు, ఆర్కాటు-కర్ణాటక నవాబులు, ఆంగ్లేయులు, డచ్చి, పోర్చుగీసు, ఫ్రెంచివారు, వారికి గల బిరుదులు, కాలానుగుణంగా, ప్రభువులను ఎలా కీర్తించేవారో, ఆ రాజులు ఎలాంటివారో తెలుసుకోవటానికి ఉపయోగకరంగా

మిగతాది 47వ పుటలో...

## వీడ్కోలు కాదు...వీడని కేలు!

**వెలుగు వెంకట సుబ్బారావు,** తెలుగు ఉపాధ్యాయుడు
సెల్ : 92909 42433

**ప**ద్యానికి ప్రతిపదార్థం చెప్పినట్టు
గద్యానికి పదాన్వయం విప్పినట్టు
క్లాసులో కలబోసుకున్న తెలుగుతనాన్ని, తేటతనాన్నీ
గ్లాసులో సుతారంగా వొంపుకున్నట్టు
మీతో మాట్లాడిన ప్రతిక్షణం ఒక పునరుజ్జీవన ప్రబుద్ధ ప్రభాతం
మీతో గడిపిన ఇన్నేళ్ల దగ్గరితనంలో
కొన్ని విసుక్కోవటాలు, తిట్టటాలు, మరికొన్ని నిల్చోబెట్టటాలు
అవన్నీ మిమ్మల్నీ, మమ్మల్నీ నులిపెట్టిన బాధాకరదృశ్యాలు
బిడ్డలారా!
ఈనాటి విద్యావిధానంలో
చదువెంత భయానకమైంది!
గురుశిష్యుల్ని గిరిగీసి ప్రత్యర్థులుగా నిలబెడ్తుంది.
చదువెంత భాస్వంతమైనది...
గురుశిష్యుల్ని గురిచూసి ప్రేమాస్పద ద్వీపాలుగా కలబెడ్తుంది.
పుస్తకాలకి పురుగుల్లా మీరూ, తిరగల్లా మేమూ
తొలిచిందే తొలచటం, తిప్పిందే తిప్పటం!
ఒకరికొకరం పోటీలుబడి, పుటంబెట్టినట్టు
దినదినం కాగి కాగి కాలిపోతుంటాం.
ఎప్పుడో, ఏ క్షణంలోనో ఒకరికొకరం అల్లుకున్న అభిమానమై
ఎగసీ, ఎగయని అవకాశమై పక్షుల్లా రెక్కలు కొట్టుకుంటాం!
ఒకరి మీదొకరం అంతరంగం వీచుకుంటాం.
ప్రపంచమంతా వుచ్చుపొదలై, రొచ్చురొదలై
పొంచి, పొంచి కమ్ముకుంటున్న మిడిమేలపు సంస్కృతులు
మేము మేముగా, మీరు మీరుగా
ఏకాగ్రత నిలదొక్కుకోవటం సర్కస్ తీగమీది నడక!
ఏమాత్రం అలక్ష్యం చేసినా, ఏ చీకటి భేరుండమో
మనల్ని తన్నుకుపోతుంది
ఏ అవలక్షణ ఆక్టోపసో చుట్టజుట్టి తన కిందికి లాగేసుకుంటుంది
ఇన్ని అవాంతరాలు దాటుకుంటూ
ఇంతకాలమైనా నీటిపాయలా, గజ్జలశృతిలా తేలుతూ తిరిగామంటే
ఏదో శబ్దసంబంధం అక్షరబంధ మనల్ని కట్టేసి వుండాలి!
నిన్నటిదాకా...
ఒకరికొకరం చెట్టూ పిట్టల్లా కల్సున్నవాళ్ళం
ఒక్కసారిగా దూరమవటం దుస్సాహసమే మరి!
కానీ వీడ్కోలంటే విడిపోవడం కాదు
కొత్త దూరతీరాలకు పురివిప్పిన మీ చదువుకు
కొత్తవాకిళ్ళు తెరవడం, కొత్తపోకళ్ళు తురమడం
ఎవరేమన్నా, మీ భవిష్యత్తు పుష్పించడానికే
ఎవరేం కోపించినా, దీవించినా మీరు పరిమళించడానికే-
మనం తరగతి గదుల్లోంచి విడిపోవచ్చునేమో గాని
మన చలన గతుల్లో దూరం కాము!
ఎక్కడో వైశాఖమాసం ఒడ్డున తెల్లకొంగల్లా
ఆకాశమెత్తున మీరు కన్పిస్తే-
ఆషాడం తొలివానల్లోని చినుకుల్లా మట్టిపొర చీల్చుకుంటూ
మీరు పలకరిస్తే...
మా కనుపాపలు తడి తడి మబ్బులై
మేము పసిమి పొంగే శ్రావణ సంధ్యార్ణవాల మవుతాం!
వన్నెతరగని వెన్నెల శరద్రాత్రుల మవుతాం!
పూరించిన వేణునేత్రాల్లోంచి జాలువారే
నిశ్శబ్ద సృజన సంగీత జలపాతాలవుతాం!
వెళ్లిరండి! కానీ జాగర్త!
జాతి సంపదల సృష్టికోసం తాము కరిగిపోతూ-
మీ చదువులకు తీరూ, తీరికా, తీరమూ కల్పించిన
అట్టడుగు జీవుల ఆర్తీ, అగ్నీ గమనించండి!
మీ అడుగడుగులో సొంత సుఖం పొడిచే
ప్రైవేటు నాగరికతను చీల్చుకుంటూ
మిమ్మల్ని సరుకులుగా మారుస్తున్న
ప్రపంచీకరణ మాయాంధకార ధూమం తెరలు దాటుకుంటూ-
మునుముందుకు పదండి!
పదవ తరగతి దాటటమంటే-
పెనం మీంచి పొయిలోకి పడ్డట్టు
ఇంటర్లో మీ ఊహల్ని, వూకగా మార్చే
కార్పొరేట్ కళాశాలల కత్తుల మరలో
క్షణం క్షణం తెగిపడే మీ గాయాల్ని
నా కవిత్వపు గంపల నిండా నింపుకుంటూ
నేనూ మీవెంటే వుంటాను.

(రెండు తెలుగు రాష్ట్రాల్లో పదవతరగతి పరీక్షలకు వెళ్తున్న
లక్షలాది విద్యార్థినీ, విద్యార్థుల నుద్దేశించి)

---

**(మన రాజులు...** 46వ పుట తరువాయి)

ఉంటాయి. రాజులు, రాణులు, మంత్రులు, సామంతులు, మాండలికులు, రాజప్రతినిధులు, ఉన్నత రాజోద్యోగుల బిరుదులు, వారు పాలిస్తున్న రాజధాని/ముఖ్యపట్టణాలను పాలించిన, గెలిచిన కోటలను, ప్రాంతాలను కులము, వంశము, శౌర్య, పరాక్రమాలు జయించిన శత్రురాజ్యాలు, రాజులు ఒక్కో సందర్భంలో రాజకీయ అవసరంగా రక్షించిన శత్రురాజ్యాలు, తిరిగి స్థాపించిన శత్రురాజ్యాలు, చేపట్టిన ధార్మిక, దైవిక కార్యక్రమాలు, చేసిన దానాలు, వ్యక్తిగత గుణగణాలు పొందిన శిక్షణ, భాషాపటిమ, పాండిత్యం, జ్ఞానం, సంగీతనాట్య, నాటిక ల్లాంటి లలిత కళలను నేర్చుకొన్న, ప్రోత్సహించిన వివరాలు ప్రాకృత, సంస్కృత, తెలుగు, కన్నడ, ఒరియా, తమిళ శాసనాల్లోని బిరుదులను పరిశీలించటం ద్వారా తెలుస్తుంది. కేవలం తేదీలకే పరిమితం కాక వాదాలకు సైతం ఊతమిచ్చే చరిత్రను చదవటానికి, విశ్లేషించి విడమరిచి చెప్పటానికి 'మన రాజులు-వారి బిరుదులు' అన్న ఈ శీర్షిక ఉపయోగపడుతుంది.

రచయిత సెల్ : 98485 98446






# శ్రీకాకుళంలో 'బాలపుంత' పిల్లల వేదిక ఆధ్వర్యంలో అంతర్జాతీయ మాతృభాషా దినోత్సవం

**అం**తర్జాతీయ మాతృభాషా దినోత్సవం సందర్భంగా ఫిబ్రవరి 21న శ్రీకాకుళంలో "బాలపుంత" ఆధ్వర్యంలో మాతృభాషా దినోత్స వాన్ని జరుపుకున్నారు. ఈ సభలో శ్రీకాకుళం జిల్లా నరసన్నపేట ప్రభుత్వ ఉన్నతపాఠశాలల తొమ్మిదో తరగతి విద్యార్థులు కె.నీలిమ, సి.హెచ్.లలిత, కె.భవానీ, పి.అనూష, డి.వెంకటప్రసాద్, పి.హరీష్, సి.హెచ్ జగదీష్, ఎస్.అరుణకుమార్ లు రాసిన "చిట్టిమనసులు" (సమష్టి శతకం)– బాలపుంత ప్రచురణ ను విడుదల చేశారు.

పిల్లలలో సామాజిక విలువలను పెంపొందింప జేయుట, పఠనా భిరుచిని పెంచుట, సాంస్కృతిక అవగాహన కల్పించుట, శ్రమను గౌరవించుట, సమాజంలో సంఘర్షణను ఎదుర్కొనే విధంగా వారిని తయారు చేయుట, జాతినిర్మాణ శక్తులుగా మలచుట మొదలగు ఉన్నత ఆశయాలతో శ్రీకాకుళంలో "బాలపుంత" కార్యక్రమాలను నిర్వహిస్తోంది. పిల్లలలో పురోగామి చైతన్యం పాదుకొల్పడానికి "బాల పుంత" కృషి చేస్తుంది. నాటికలు, లఘు నాటికలు, కథలు, కవితలను పిల్లలచే రాయించడం, తర్ఫీదు నివ్వడం 'బాలపుంత' చేస్తోంది. దీనిలో భాగమే తొమ్మిదోతరగతి విద్యార్థులు వ్రాసిన "చిట్టి మనసులు" శతకం ఆవిష్కరణ.

సమావేశ అధ్యక్షులు కె.భానుమూర్తి (ఎ.పి.టి.ఎఫ్ జిల్లా కార్య దర్శి) మాట్లాడుతూ "భాషకు ఒక సామాజిక స్వభావం సాంస్కృతిక ప్రభావం ఉంటుంది. జాతిజనులను ఏకం చేసే మహత్తర శక్తి భాష. ప్రతి జాతీ తమ మాతృభాష అభివృద్ధికి కృషి చేసుకోవడం సహజం. కానీ ప్రపంచీకరణలో భాగంగా మాతృభాషలను ప్రక్కకునెట్టి మార్కెట్ భాష అయిన ఆంగ్లాన్ని, ఆంగ్ల మాధ్యమాన్ని ప్రవేశపెట్టి విద్యా వ్యవస్థను సర్వనాశనం చేస్తున్నారు. ఎంతటి క్లిష్టమైన భావాన్నైనా గొప్ప అభివ్యక్తిలో స్పష్టం చేయగల శక్తి మాతృభాషకు ఉంది. అందుకే మాతృభాషలోనే విద్యనందిస్తున్న దేశాలు జర్మనీ, జపాన్, రష్యా, చైనా వంటి దేశాలు అభివృద్ధిపథంలో ఉన్నాయి అన్నారు. మాతృ భాషపై పట్టు పొందిన తొమ్మిదో తరగతి చిన్నారులు "చిట్టి మనసులు" శతకం రాసి మాతృభాష యొక్క గొప్పతనాన్ని చాటి చెప్పారని మెచ్చుకున్నారు.

ముఖ్య అతిథిగా విచ్చేసిన 'ఉపాధ్యాయ' పత్రిక సంపాదకులు సువ్వారి అచ్చెన్నాయుడు మాట్లాడుతూ నేడు ప్రపంచాన్ని పరిశీలిస్తే భాషలు, జీవులు అంతరించి పోతున్నాయి. నేడు భారతదేశంలో సంస్కృతం మృతభాషగా మారింది. దేశంలో హిందీ తర్వాత ఎక్కువగా మాట్లాడే తెలుగుభాష మృతభాషగా మారబోతోంది. మాతృ భాషలను రక్షించుకోవాల్సిన అవసరం ప్రతి ఒక్కరిపై ఉందని తెలి పారు. తెలుగులో ఆటవెలది చందస్సుతో పిల్లలు వ్రాసిన శతకం "చిట్టి మనస్సులు" వారి సృజనాత్మకతకు మచ్చుతునక అని అన్నారు. ప్రధాన వక్తగా విచ్చేసిన చింతాడ తిరుమలరావు మాట్లాడుతూ పుస్తక జ్ఞానం, వ్యవహారిక జ్ఞానం రెండూ కలిసినప్పుడు మంచి వ్యక్తిత్వం ఏర్పడుతుందని, ఈ జ్ఞానం మాతృభాష వల్లనే లభిస్తుందని అన్నారు. రోణంకి అప్పలస్వామికి మాతృభాషపై పూర్తిస్థాయి పట్టు ఉండబట్టే బహు భాషాకోవిదుడయ్యాడు.

ప్రజాసాహితి నాగరాజు మాట్లాడుతూ భాష చుట్టూ ఒక సాంస్కృ తిక భావజాలం అల్లుకొని ఉంటుందన్నారు. మన సంస్కృతిని, సాహిత్య సొగసులను ఆనందించి ఆస్వాదించాలంటే మాతృభాషలోనే విద్యాభ్యాసం జరగాలి అని అన్నారు.

పిల్లలు రాసిన "చిట్టి మనసులు" శతకంలోని మకుటం 'చిట్టి మనసులోని చిన్నిమాట' అనుటకంటె 'చిన్ని మనసులోని పెద్ద మాట' అంటే బాగుంటుంది. పిల్లలకి స్వేచ్ఛావాతావరణం కలుగజేస్తే అద్భుత భావాలు వెలిబుచ్చుతారని తెలియజేసిన శతకం "చిట్టి మనసులు". ఇటువంటి చక్కటి ఆలోచనలు ఇచ్చిన "బాలపుంత"కు ప్రత్యేక ధన్యవాదాలు తెలియజేశారు విశ్రాంత ప్రధానోపాధ్యాయులు విజయానందరాజు. ❋

## చెన్నపురి రచయితల సంఘం

ప్రముఖ తెలుగుభాషోద్యమకారుడు, రచయిత స.వెం. రమేశ్, ప్రముఖ రచయిత నాగసూరి వేణుగోపాల్‌ల పూనికతో చెన్నపురి రచయితల సంఘం ఏర్పాటయింది. గౌరవాధ్యక్షులుగా ప్రేమాధాత్రి, అధ్యక్షులుగా భువనచంద్ర, కార్యదర్శులుగా మన్నవ గంగాధరప్రసాద్, రాజదుర్గం విజయలక్ష్మి, సంయుక్త కార్యదర్శులుగా పి.అనురాధ, ఎం.హంసవర్ధిని, కోశాధికారిగా ఎన్.శాంతి, కార్యనిర్వాహకవర్గ సభ్యులుగా గుడిమెట్ల చెన్నయ్య, ఇమ్మిడిశెట్టి కోటేశ్వరరావు, పి.మోహనశ్రీ, ఉప్పలధడియం వెంకటేశ్వర, బెల్లంకొండ నాగేశ్వరరావు, మాధురి, ముళ్ళపూడి శ్రీదేవి, రాజేశ్వరి, ప్రణవి, బొందుల నాగేశ్వరరావు, భానుమతి, దామోదర్ ఎంపికయ్యారు. శ్రీవిరించి, సరోజినీ ప్రేమ్‌చంద్, జయదేవ్, కాసల నాగభూషణం, వై.రామకృష్ణలతో సలహా మండలి ఏర్పాటయింది. నాగసూరి వేణుగోపాల్, స.వెం.రమేశ్ గౌరవ సలహాదారులుగా వుంటారు.

కతలు, వ్యాసాలు- విమర్శ, చరిత్ర వగైరా అంశాలపై



తెలుగు వచన రచనలను ప్రోత్సహించటం, ప్రచురించటం : వస్తువును చెన్నపురి, దాని చుట్టుముట్టు తావులనుంచి తీసుకొని రాసిన కతలను ప్రోత్సహించటం, తమిళనాడులోని ఇతర తావుల నుండి వచ్చి వుండేవారి తెలుగు నుడికారంతో రచనలను ప్రోత్సహించటం, తరతరాలుగా చెన్నపట్నంలో వుంటున్న వారి నుంచి రచనలు రాబట్టటం, కొత్త రచయితలను ప్రోత్సహించటం, ఇంకా రాయలేని వారిచేత కతలు చెప్పించి వాటిని రికార్డింగ్ చేయడం, పెద్ద రచయితలతో వర్క్‌షాపులు, కనుమరుగవుతున్న తెలుగు మాటలను, పాటలను సేకరించటం, పిల్లల చేత కతలను రాయించటం మొదలైనవి.




తెనాలిలో మాతృభాషాదినోత్సవం సందర్భంగా ఆర్డీవోను కలిసి తెలుగు భాషోద్యమ సమాఖ్య డిమాండ్ల లేఖని సమర్పించిన సామల లక్ష్మణబాబు, భీమిరెడ్డి నర్సిరెడ్డి, గాలి సూర్యనారాయణ, బొమ్మదేవర వెంకటేశ్వరరావు, కొల్లిపర విద్యాసాగర్, పసుపులేటి వెంకటేశ్వరరావు, పాలడుగు వెంకట్రామయ్య, వాకా పేరిరెడ్డి తదితరులు




తెనాలిలో మాతృభాషాదినోత్సవం సందర్భంగా జనసాహితి ఆధ్వర్యంలో జరిగిన సభలో మాట్లాడుతున్న ప్రజాసాహితి సంపాదకుడు కొత్తపల్లి రవిబాబు. తెలుగుభాషోద్యమ సమాఖ్య కన్వీనర్ వెన్నిసెట్టి సింగారావు, పొట్టి పోలేశ్వరరావు, చందు నాగేశ్వరరావు తదితరులు ప్రసంగించారు.



'రచయితల సంఘం-ఆంధ్రప్రదేశ్' లోగోను ఆవిష్కరిస్తున్న ఆ సంఘం అధ్యక్షులు సోమేపల్లి వెంకటసుబ్బయ్య. పక్కన రచయితల సంఘం ప్రధాన కార్యదర్శి చలపాక ప్రకాష్, కోశాధికారి కలిమిశ్రీ, సలహామండలి సభ్యులు, రచయిత్రి యర్రంశెట్టి పాప, సాక్షి విజయవాడ సిటీ ఇన్‌ఛార్జ్ సిహెచ్.శర్మ, రచయిత్రి కోపూరి పుష్పాదేవి ఉన్నారు.




కరీంనగర్‌లోని శరత్ సాహితీ కళాస్రవంతి ఆధ్వర్యంలో అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవం జరిగింది. సబ్బని లక్ష్మీనారాయణ, సంకేపల్లి నాగేంద్రశర్మ, గజేంద్రరెడ్డి మొదలగు పెద్దలు పాల్గొన్నారు. తెలుగు మాధ్యమంలో చదివిన వారికి ఉద్యోగాల్లో ప్రాధాన్యత నివ్వాలని, ఇంటర్మీడియట్‌లో తెలుగుబోధనను తప్పనిసరి చేయాలని వారు కోరారు.



'తెనుగు లెంక' 'అభినవ తిక్కన'
**తుమ్మల సీతారామమూర్తి.**

# 'తెనుగులెంక' సూక్తులు-8

చదువు లేక గ్రుడ్డి బ్రతుకీడ్చు మానిసి
మందు లేక రుజల కుందుపేద
కూడు లేక రాలువాడున్న గడ్డకు
శాంతి లేదు జీవ కాంతి రాదు

సృష్టిలోని మనుషులందరూ ఒక్కటే. శరీరాంగాలు అన్నీ సమానమే. లోన ప్రవహించే నెత్తురు అందరిదీ ఎరుపే– అందరూ అదే గాలి పీలుస్తారు– అందరూ అదే నీరు త్రాగుతారు– అలాంటప్పుడు మనుషుల మధ్య అంతరాలు ఎందుకుండాలి అని సందేహం వస్తుంది. ఒకరు చదువులో సరస్వతిగా మారి, విశేష జ్ఞానాన్ని సంపాదించి, విదేశాలకేగి వేలకోట్లు సంపాదిస్తుంటే, మరొకరు నిరక్షర కుక్షిగా ఎందుకుండాలి? అజ్ఞానంలో అలమటిస్తూ కొంతమంది వ్యక్తుల స్వార్థానికి బలిగా మారి వారికి చెప్పులుగా ఎందుకు బతకాలి? ఎంత కష్టపడినా సంసారాన్ని పోషించుకోలేక, ఎన్ని అగచాట్లు పడినా కడుపు నింపుకోలేక, దీనంగా, హీనంగా జీవితం ఎందుకు సాగించాలి? విద్యలేని పశువుగా ఛీ కొట్టబడుతూ, ఇతరుల మోసాలకు బలై ఆత్మహత్యలకు ఎందుకు పాల్పడాలి?

వైద్యశాస్త్రం పురోగమించింది అని చంకలు కొట్టుకొంటున్నాం. అది ధనికులకు తప్ప సామాన్యులకు ఉపయోగపడుతున్నదా? ఎలాంటి అనారోగ్యాన్నయినా చిటికెలో సరిచేసి నయం చేయగలుగుతున్నామని విర్రవీగుతున్నాం. అది ఉన్నవారికి తప్ప లేనివారికి సాయపడుతుందా? అంతుపట్టని రోగాల అంతుతేల్చి, దివ్యౌషధాలతో దివ్యమైన జీవితాలను ప్రసాదించ గలుగుతున్నామని గర్విస్తున్నాం. ఆ మందులు సొమ్ములున్న వాడికి తప్ప గుడిసెల్లో నివసించేవారికి చేరుతున్నాయా? డబ్బున్నవాడి కాల్లో ముల్లువిరిగితే కాళ్ళ దగ్గర సాష్టాంగపడే కార్పొరేట్ వైద్యం, డబ్బులేని వాడిని కాటికి చేర్చకుండా ఆపగలుగుతుందా? ప్రభుత్వ ఆసుపత్రుల్లో ఎంతమంది వైద్యులుంటున్నారు? వారిలో ఎంతమంది పేదలను ఆదరంతో చూచి వైద్యం అందిస్తున్నారు? ఆసుపత్రుల్లో అందుబాటులో ఉండే మందులెన్ని? దొడ్డిదోవలో గోడలు దాటి పోయేవెన్ని?

గుడిలో దేవునికి చక్కెరపొంగలి ప్రసాదంగా పెట్టే ఈ దేశంలో ఆ గుడిమెట్ల మీద ఆకలితో అలమటిస్తూ అడుక్కునే బిచ్చగాళ్ళు ఎందుకు? దేవుడి హుండీలో కోట్ల కొలది సొమ్మును కానుకగా వేసేవారికి ఖాళీగా ఉన్నపేదల కడుపులు కనిపించవా? వెండి కిరీటాలు, బంగారు నగలతో దేవుని అనుగ్రహం సంపాదించాలనుకునేవారికి బడుగు బతుకులు ఆకలి కేకలు వినిపించవా? పుట్టినరోజు పండుగలకోసం, వివాహపు విందుల కోసం వేలు, లక్షలు వెచ్చించే విలాసపురుషులు, మిగిలిన ఎంగిలి మెతుకుల కోసం కుక్కలతో కాట్లాడే బక్కచిక్కిన బతుకుల ఆర్తనాదాలు ఆలకించరా? ఒక ప్రక్క ఆకలితో అలమటించే అభాగ్యులు, అనాథలు కనిపిస్తుంటే దేశం ఎన్ని లక్షల కోట్లను విలాసంగా చేసే విందులకు వృథా చేస్తున్నది?

మనది ప్రజాస్వామ్యం. ఇక్కడ అందరూ సమానమే, అందరూ అన్ని అవకాశాలు అందుకొనేలా ప్రభుత్వం చూడాలి. అందరూ అన్నీ అనుభవించాలి. ఏ కొందరో అవకాశాలను అందుకొని అందలం ఎక్కుతుంటే మిగిలిన వారు బోయీలుగా మారే పరిస్థితిని కల్పించకూడదు. అందుకే ప్రభుత్వం పై ప్రశ్నలకు సమాధానం వెతకాలి. పరిష్కారమార్గాన్ని కనుక్కోవాలి. కులమత ప్రాంతాలకు అతీతంగా ప్రజలందరూ పరమాన్నం భుజించేలా, ఆరోగ్యంగా, ఆనందంగా, సుఖసంతోషాలతో, ఆనందదైశ్వర్యాలతో అలరారేలా చూడాలి. అప్పుడే దేశంలో శాంతి నెలకొంటుంది. అలజడులు, అశాంతులు అంతరిస్తాయి. దేశం జీవకాంతితో నిగనిగలాడుతుంది. అదే ప్రజాస్వామ్య స్ఫూర్తి.

అందుకే తుమ్మల "చదువుకోలేక గ్రుడ్డిగా జీవించే మనుషులు ఏ దేశంలో ఉండరో, మందులు అందక పేదలు ఏ దేశంలో జబ్బులతో బాధపడరో, అన్నం లేక ఏ దేశంలో ప్రజలు ప్రాణాలు విడవరో ఆ దేశంలో మాత్రమే శాంతి ఉంటుంది. ఆ దేశానికి మాత్రమే జీవకాంతి ఉంటుంది" అన్నారు. అవి లేకపోతే శాంతి, కాంతి ఉండవని, అవి సాధించడానికి ప్రభుత్వాలు కృషి చేయాలని బోధచేశారు.

**–డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,** 98497 99711

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

# తెన్నాటి తెలుగు– మరొక ముందడుగు





ఫిబ్రవరి నెలలో 'ఎల్లనాడుల తల్లినుడి పండుగ' జరిగింది. ఆ తడవున కొంగునాడులోని కోయంబత్తూరులో తెలుగు అక్షరం మొలకెత్తింది. కోయంబత్తూరు లోని పి.ఎస్.జి. (పెద్దింటి సామానాయుడి గోవిందస్వామి నాయుడు) బడిలో తెలుగు తరగతులు మొదలైనాయి. కోయంబత్తూరు 'కమ్మ మహా సమాజం' నిర్వాహకులైన రాచకొండల సెందిల్, రాచకొండల వినోద్ 'తెలుగువాణి' వారిని కలిసి తెలుగును నేర్పమని కోరినారు. తెలుగువాణి సంతోషంగా ఒప్పుకొనింది. హోసూరులో ఉంటున్న తెలుగువాణి కార్యకర్త, రచయిత అయిన కెం. మునిరాజు నేర్పడానికి ముందుకు వచ్చినారు. పి.ఎస్.జి. సంస్థల వారి 'సర్వజన స్కూల్' వారు, తమ మేడను వాడుకొనడానికి ఒప్పుకొన్నారు. ఫిబ్రవరి 14న తరగతి తొలకొనింది. ఫిబ్రవరి 21న తల్లినుడి పండుగను జరుపుకొన్నారు. ఫిబ్రవరి 21 నుండి 12 ఆదివారాల పాటు తెలుగు తరగతులు జరుగనున్నాయి. జట్టుకు 30 మంది వంతున, మూడు జట్లుగా సుమారు వందమంది తరగతులకు వస్తున్నారు. ఇది తెన్నాటి తెలుగుకు ఒక ముందడుగు.

ఉడుమలపేటలో ఫిబ్రవరి 21న తల్లినుడి పండుగ జరిగింది. తెలుగువాణి ట్రస్టీలైన స.వెం.రమేశ్, మార్టూరి వసంత్‌నాయుడు పాల్గొన్నారు. రేణుకాదేవి మహిళా సంగానికి చెందిన ఆడువారు ఈ పండుగను జరుపుకొన్నారు. సమావేశంలో పాలుగొన్న రచయిత్రి సంజనాపద్మం, ఇంటిలో బిడ్డలతో తెలుగులోనే మాట్లాడమనీ, తెలుగు అక్షరాలను బిడ్డలకు నేర్పించమనీ కోరినారు. ఏడాది ఏడాదీ అమ్మనుడి పండుగను నిలపకుండా జరుపుకోవాలని తీర్మానించినారు.

# పాండియనాడులో తెలుగు వెలుగెత్తుతుంది









మధురై, తేని, దిండుక్కల్, విరుదునగర్, సివగంగై, రామనాదపురం, తూత్తుకుడి, తిరునెల్‌వేలి జిల్లాలతో కూడిన పాండ్యనాడు (పాండియమండలం)లో అన్ని కులాల తెలుగువారిలో ఐక్యత ఏర్పడుతోంది. ఇటీవలే అందరూ కలిసి వీరపాండియ కట్టబొమ్మన్, తిరుమల నాయకరుల పుట్టినరోజులను ఘనంగా జరుపుకొన్నారు.
(వివరాలతో వ్యాసాన్ని లోపలి పుటల్లో చదవండి)

AMMANUDI (Telugu Monthly)
March 2016, Vol.2, Issue 1

RNI-APTEL/2015/62362
Postal Reg. No.TEN/12/2015-17